*Issued— 23-8-1956*




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## WEDNESDAY, 3rd AUGUST, 1955

## VOLUME VII—No. I

*CONTENTS*




PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL
1956
PRICE 6 annas.

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Wednesday, 3rd August, 1955.**

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### SHORT NOTICE STARRED QUESTIONS

*Renaming of Harijan Welfare Department.*

311-A.

*1259-B. -Q : Sri M. RAJESWARA RAO :— Will the Hon. the Chief Minister be pleased to state ;

(a) whether it is a fact that the present Harijan Welfare Department has been re-named as "the Social Welfare Department"; and

(b) if so, the reasons therefor ?

The Hon. Sri B. GOPALA REDDI :— (a) Yes, Sir,

(b) Because, besides Harijan welfare, the Department also deals with the Welfare of the Scheduled Tribes, Backward Classes and Ex-Criminal Tribes and the present designation is considered more comprehensive and appropriate.

Sri M. RAJESWARA RAO :— May I know, Sir, in converting the Harijan Welfare Department into Social Welfare Department whether the Government have taken into consideration the report of the Harijan Welfare Committee of 1948 which specifically recommended for the constitution of a separate department for Harijan welfare ?

The Hon. Sri B. GOPALA REDDI :— The Department is there and the officer is there. Only the name is changed. So it makes no difference at all.

Sri A. KALESWARA RAO :— మన రాజ్యాంగ చట్టములో హరిజనులకు 10 సంవత్సరములదాకా ప్రత్యేక ప్రాతినిధ్యము ఇవ్వవలసివుండగా, వాళ్ళకోసం ప్రత్యేకంగా పనిచేయవలసిఉండగా, వారిని అందరితో కలపడమువల్ల హరిజనులకు ఇచ్చేటటువంటి ప్రత్యేకలాభము ఒక్కొమ్మడిగా నష్టపడుతారు. అందువల్ల వారిని వేరే వుంచడము మంచిదేమో ప్రభుత్వమువారు ఆలోచిస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI:— ఏ విధమైనటువంటి నష్టము వారికి కలుగడములేదు. Allotmentలో గాని, దేనిలోగాని ఏ విధమైన తగ్గింపు లేదు.

పేరులో మాత్రం మార్పు వచ్చింది. Social Welfare అనేది comprehensive word. అది అందరికి వర్తిస్తుందనే ఉద్దేశ్యముతో పేరు మార్చబడింది. వారికి ఎలాంటి అసౌకర్యములు జరగకుండా చూచుటకు ప్రభుత్వమువారు నిశ్చయించుకున్నారు.

Sri S. VEMAYYA :— ఇప్పుడు Harijan Welfare schools అని కొన్ని వున్నవి. వాటికన్నింటిని Social Welfare schoolsఅని పేరు మారుస్తారా?

The Hon. Sri B. GOPALA REDDI :— సోషల్ వెల్ఫేర్ లేకపోతే లేబరు వెల్ఫేర్ అనవచ్చును. లేకపోతే హరిజన వెల్ఫేరు అనవచ్చును. ఇప్పుడు ఆఫీసరు పేరు department పేరు మాత్రము మార్చబడినవి. ఆ department ను Social Welfare Department అని, డైరెక్టరును Social Welfare Director అని పిలువబడుచున్నారు.

Sri M. RAJESWARA RAO :— ఏప్రిలు 25 వ తేదీన శాసనసభలోని హరిజన శాసనసభ్యుల సమావేశము జరిగినప్పుడు Harijan Welfare అనే పేరు మార్చాలని సూచించారా? ఆ సూచన అనుగుణంగానే department పేరు మార్చినారా? అట్లా మార్చినట్లయితే Harijan Welfare శాఖక్రింద తీసుకున్న సమస్యలన్నింటికీ కూడా ఈ పేరు వర్తింపచేస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI ;— దాంట్లో నాకేమీ అసంతృప్తి కన్పించడములేదు. హరిజనులకు ఏలాంటి నష్టము కలుగడములేదని నేను పదే పదే చెబుతున్నాను. నామధేయములో మాత్రము మార్పువచ్చింది. Harijan Welfare అనే దానికి బదులు social welfare అనే comprehensive word తో పిలుస్తున్నాము. అది tribes welfare కు, criminal tribes welfare కు, backward class welfare కుసంబంధించింది కాబట్టి Director of Social Welfare అని మార్పుచేయడము జరిగింది.

Sri V. KURMAYYA :— ఈ పేరు మార్పు అనేది చాలా ముఖ్యమైన పాలసీ. ఈ పాలసీని నిర్ణయించేటప్పుడు హరిజనులకు సంబంధించినది కాబట్టి, హరిజనుల రిప్రజెంటేటివ్ నుగాఉన్న M.L.A. లను పేరుమార్పుకు పూర్వము consult చేశారా? చేయకపోతే ఈ పాలసీ జాతీయంగా సంబంధించిన పాలసీకాబట్టి ఇకముందు హరిజన M. L. A. లను consult చేసి ప్రభుత్వ నిర్ణయం తీసుకుంటారా ?

The Hon. Sri B. GOPALA REDDI :— కేవలము హరిజన వెల్ఫేరు కాకుండా, Backward Classes Welfare, Criminal Tribes Welfare ఈ డైరెక్టరు చూస్తున్నారు, ఈ మంత్రి చూస్తున్నారు అని చెప్పడం కొరకు Minister for Social Welfare అనడంజరిగింది. లేకపోతే ఇప్పుడు లచ్చన్నగారిని Minister for Harijan Welfare అన్నారనుకోండి. రేపు ప్రొద్దున ఎవరైనా వచ్చి backward classes Welfare చూసేది ఎవరండి? Tribes welfare చూసేది ఎవరండి ? Criminal Tribes welfare చూసేది ఎవరండి అని అడగడము అవసరము లేకుండా Minister for Social Welfare అని, అదేరీతిగా Director for Social Welfare అని అంటే, అందరికి తెలిసేవిధముగా వుంటుందనే ఉద్దేశ్యముతో ప్రభుత్వమువారు ఆ మార్పుచేసినారు.

3rd August 1955]

*Cottage Industries*

311-B.

* 1431-C - Q. :—Sri PRAGADA KOTAIAH :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the Cottage Industries proposed to be developed on co-operative basis and also the nature and extent of aid to be given to such Cottage Industrial Co-operatives ?

The Hon. Sri K. VENKATA RAO :—

The Cottage Industries proposed to be developed on Co-operative basis are mainly Khadi, Hand-pounding of rice, Tanning and Leather Industry, Village Oil Industry, Palm-gur, Toy-making, Basket-making etc. The Cottage Industrial Co-operatives will be given financial assistance in the shape of loans and subsidies to the extent possible.

Sri PRAGADA KOTAIAH:— అధ్యక్షా, గృహపరిశ్రమలను నిర్వహించేవారు చాలా పేదవారు కాబట్టి ఈ వాటాధనమును ఇచ్చే విధానాన్ని రెండు సంవత్సరాలలో తీర్చే పద్ధతిమీద interest free లైసెన్సు ఇచ్చేదానికి ఈ సంఘాలు నిర్మాణముచేసేదానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నదా ?

The Hon. Sri K. VENKATA RAO:— ఆలోచిస్తున్నారు. అసలు సబ్సిడీకూడా ఇస్తున్నారు. ఇప్పటి వరకుకూడా జరుగుతున్న cottage industries కు గవర్నమెంటు పక్షమునుంచి ఎక్కువ సహాయము వెళ్ళుతున్నది.

Sri P. VENKATASUBBAYYA:—ఈ కాటేజి ఇండస్ట్రీలో పనిచేసే వారిని సాంకేతిక విజ్ఞానులుగా తయారు చేసే దానికి technical people ను ఎవరినైనా ఏర్పాటుచేస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO :— చాలా సెంటర్లలో ఇదివరకు పెట్టాము. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలములో వీరికి ట్రైనింగు ఇవ్వడము కోసము ఇంకా ఎక్కువగా పెట్టదలుచుకున్నాము.

Sri C.'SUBBARAYUDU:— దంపుడుబియ్యం పరిశ్రమకు ప్రోత్సాహము ఇవ్వడము కోసం, రైస్‌మిల్లులకు కొత్తగా లైసెన్సులు ఇవ్వకుండా వుండేదానికి ప్రభుత్వము ఏమైనా నిర్ణయించుకుందా ?

The Hon. Sri K. VENKATA RAO:—నిర్ణయించుకుంది.

Sri S. VEMAYYA:—చేతితో దంచే బియ్యానికి సహాయము చేస్తామన్నారు. ఏవిధముగా చేస్తారో తెలియ జేస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO:— చేతితో దంచేవారు ఎవరిచేతితో వారేదంచాలి. ఇంకొకరి సహాయము పనికిరాదు.

Sri S. VEMAYYA :— గవర్నమెంటువారు ఏవిధముగా సబ్సిడీ ఇస్తున్నారో తెలియజేస్తారా ?

**The Hon. Sri K. VENKATA RAO** :— ఎక్కువ మిల్లులకు లైసెన్సులను ఇవ్వకపోవడమువల్ల ఎక్కువమంది దంపుడుబియ్యము తప్పకుండా కొనుక్కుంటారు. అటువంటప్పుడు నిరుద్యోగసమస్య లేకుండా చేయడానికి వీలవుతుంది. దీనికోసం ఎంపోరియం పెట్టుతున్నారు. మీరు ఎవరుఅయినా 10 మంది కలసి కో-ఆపరేటివ్ సొసైటీపెట్టుకొంటే రోళ్ళు, రోకళ్ళు వగైరాలు కొనుక్కోవడానికోసం సబ్సిడీ, గ్రాంటులు ఇస్తున్నారు.

**Sri S. NARAYANAPPA** :— ఈ గృహపరిశ్రమల విషయములో మంత్రిగారు చెప్పినట్లు ఈ ఒక్క పరిశ్రమేకాకుండా కుమ్మరి, కమ్మరి, వడ్రంగము ఇటువంటి వాటికికూడా సొసైటీలు ఏర్పాటు చేసుకుంటే వాటికికూడా సబ్సిడీ, గ్రాంటులు ఇచ్చేదానికి ఏర్పాటుచేస్తారా ?

**The Hon. Sri K. VENKATA RAO**:— వగైరాలంటే అన్నీ కలసే ఉంటాయి.

**Sri D. KONDAIAH CHOWDARY** :— మద్రాసులో దంపుడు బియ్యముమీద సేల్సుటాక్సు తీసివేసినారు. అటువంటి పద్ధతినే మనగవర్నమెంటువారు కూడా అమలుపరుస్తారా ? రెండవది బియ్యమువగైరాలు దంపినప్పుడు ప్రభుత్వమువారు ప్రోత్సహించేదానికోసం ప్రభుత్వంవారు ఈమిల్లుల్లో కొన్నదానికి బదులు దీనిని వుపయోగపెట్టుకుంటారా అని అడుగుతున్నాను.

**The Hon. Sri K. VENKATA RAO** :— రెండింటికి ఆట్టే అభ్యంతరము లేదు.

**Sri T. JALAYYA** :— స్టేటుగవర్నమెంటువారు దంపుడుబియ్యానికి లైసెన్సు ఇచ్చినారా ? సెంట్రలు గవర్నమెంటు దంపుడుబియ్యం సబ్సిడీకోసం మణుగు 1 కి మిల్లింగ్ రైస్‌మీద రు 0-6-0 లు చొప్పన పన్ను వేస్తున్నామని మొన్న 11 వ తేదీన ప్రకటించారు. అందువల్ల రైతులదగ్గర పన్నులువల్ల 6 కోట్ల రూపాయలు నష్టమువస్తున్నది. దాని విషయం ప్రభుత్వంవారి దృష్టికి వచ్చిందా ? ఆలోచిస్తారా ?

**The Hon. Sri K. VENKATA RAO** :— రెండవవిషయం ప్రభుత్వ దృష్టికి రాలేదు. మొదటి విషయము ప్రభుత్వము ఇవ్వడానికి అభ్యంతరములేదు.

**Sri B. SANKARAIAH** :— ఇదివరకు డెల్టాలలో ధాన్యం బాగా పండే చోట్ల లెక్కలేనన్ని రైసుమిల్లులు ఉన్నాయి. ఇప్పుడు కొత్త లైసెన్సులు ఇవ్వనందువల్ల ఇప్పుడు కొత్తగా డెల్టాలువేసే ప్రాంతములో ప్రజలకు చాలా నిర్బంధము కలుగుతోంది. అందువల్ల ఒకప్రాంతానికి 2 వ రకము ఇంకొక ప్రాంతానికి ఇంకొకరకము కాకుండా మళ్ళీరాని విషయము పునరాలోచన చేస్తారా ?

**The Hon. Sri K. VENKATA RAO** :— ఎక్కడ అయితే రైసుమిల్లులు ఎక్కువగా వున్నాయో, ఎక్కడఅయితే డెల్టావున్నదో, ఎక్కడ అయితే చాలామంది జనమువున్నారో అక్కడ నిరుద్యోగ సమస్య ఎక్కువగా వున్నది. వారందరికి పని కల్పించడము కోసం రైసుమిల్లులను క్రమేణాతగ్గించి, ఎక్కువ ఆస్కారము రోకలి తోటి, రోలుతోటి దంపేవారికి ఇవ్వాలని ప్రయత్నం చేస్తున్నాము.

3rd August 1955]

Sri S. VEMAYYA :— లైసుమిల్లుల లైసెన్సులు తగ్గించడమూ అనేది క్రొత్తగా ఇవ్వక పోవడము లేక వున్నవాటిని క్రమేణా తీసుకుంటూ పోవడమా? ఏ విధానమును అవలంబిస్తారు?

The Hon. Sri K. VENKATA RAO :— క్రొత్తగా ఇవ్వము. పాతవి వాటంతటు అవే క్రమేణా అరిగిపోతాయి.

*Granting of Bus Routes*

311–C.

* 1346–A. – Q. : Sri N. C. SESHADRI:—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the procedure adopted by the Government in granting bus routes to applicants ?

The Hon. Sri D. SANJIVAYYA :—

The Regional Transport Officer, invites applications for permits by means of a notification under Sec. 57(2) of the Motor Vehicles Act, 1939. On receipt of applications, he publishes the applications or the substance thereof under Sec. 57(3) of the Act and calls for representations from interested parties before a specified date. The regional tronsport authority gives the applicants and the parties making representations an opportunity of being heard at a public meeting and then disposes of the applications with due regard to public interests and other matters set out in Section 47(1) of the Act.

Sri N. C. SESHADRI:— ఇది వరకు fleet owners గా ఉన్నటువంటి వాళ్ళకే ఇస్తున్నారు. క్రొత్తగా application పెట్టుకున్న వాళ్ళకు ఇవ్వడంలేదని చెబుతున్నారు. ఆ క్రొత్తగా application పెట్టుకున్న వాళ్ళకు ఇవ్వకుండా ఉండటానికి కారణా లేవో సెలవిస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA:— కారణాలు అనేకం ఉన్నాయి. క్రొత్తగా పెట్టుకున్నాడు అనేటటువంటి కారణం చేతనే ఇవ్వకుండాపోరు. చాలా కారణా లున్నాయి.

Sri N. K. LINGAM :— బంజరు భూములను రాజకీయ బాధితులకు ముందు priority ఇస్తున్నారు. అదే ప్రకారంగా రాజకీయ బాధితులు ఎవరైనా bus route లకు పెడితే అటువంటి priority ఏమైనా కల్గ చేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA:—లేదండి. అవకాశంలేదు.

Sri R. JAGANNADHAM:— Bus route లు ఇచ్చేదాంట్లో క్రొత్త వారికి ఇవ్వకూడదని గాని లేక పోతే route కి ఈ applicant touch కాలేదని చెప్పేసి ఇవ్వకూడదని గాని ఇటువంటి hard and fast rule ఏదైనా ఉన్నదా?

The Hon. Sri D. SANJIVAYYA:—అటువంటిది లేదండి.

Sri C. SUBBARAYUDU :— Bus route ఇచ్చినప్పుడు ఒకటే bus లో ముందు seat కు మూడు రూపాయలని, వెనుక seat కు 2-8-0 అని ఛార్జి చేయడం ప్రభుత్వం అనుమతించిందా ?

The Hon. Sri D. SAJIVAYYA:—నాకు తెలిసినంత వరకు లేదు.

Sri C. SUBBARAYUDU:— ఇక్కడనుంచి గుత్తికి పోయేటటువంటి bus లో ఎమ్మిగనూరు వాళ్ళు bus లో ముందు seat లకు మూడు రూపాయలు వసూలు చేస్తున్నారు. వెనుక seat కు2 6-0 వసూలు చేస్తున్నారు. కనుక అటువంటిది చట్టవిరుద్ధంగా ఉండదాండీ ?

The Hon. Sri D. SANJIVAYYA :—అది Express Bus. ప్రత్యేకంగా పెట్టబడ్డది. దానికి ఆ విధంగా అనుమతించారు.

Sri L. LAKSHMANA DASS :— అధ్యక్షా ! ఈ bus route లను గురించి చాలా విపరీతమైన competition ఉన్నది. అందుచేత ఇది వేలం మూలంగా నిర్ణయంచేస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA :— వేలంవేసే పద్ధతి ఇప్పటిదే కాదు, 5, 6 సంవత్సరాలనుంచి కూడా ఆలోచించారు. ఎప్పటికప్పుడు 1937 నుంచీ కూడా చెబుతున్నారు. అప్పుడూ పరీక్షించారు. తరువాత 1946-47 లో పరీక్షించారు. నిన్న మొన్న కూడా పరీక్ష జరిగింది. అది సాధ్యపడేదిగా కాదు. అందువల్ల ప్రభుత్వాని కేమీ లాభదాయకంగా ఉండదని నిర్ణయింపబడ్డది.

Sri P. RANGA REDDI :—అసలు R.T.A. ఈ routes ఇచ్చేటప్పుడు ఫలానా ఫలానా విషయాలు వీరు దృష్టిలో పెట్టుకొని ఆలోచించవలసియుంటుందని ప్రభుత్వ మేమైనా సూచనలు చేసిందా? చేసి ఉంటే ఆ సూచన లేమిటి ?

The Hon. Sri D. SANJIVAYYA :— చట్టంలోనే యున్నది. 47 (1) సెక్షను క్రింద ఈ సూచనలున్నాయి :

"(1) The interest of the public generally.

(2) The advantages to the public of the services to be provided including saving of time likely to be effected thereby and any convenience arising from journeys not being broken.

(3) The adequacy of existing road passenger transport services between the places to be served and the fares charged by those services.

(4) The benefit to any particular locality or localities likely to be afforded by the service.

3rd August 1955]

(5) The condition of the roads included in the proposed route."

Sri P. RAJAGOPAL NAIDU :— Bus route లు వేలం పెట్టడానికి వీలుకాదని చెప్పారు. కారణాలు ఏమిటో చెబుతారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఎవరో ఒక్కరే బాగా ధనం కలిగినటువంటివారు అన్ని రూట్లనూ వేలంలో ఎక్కువ మొత్తం పెట్టి కొనడానికి అవకాశం ఉంటుంది. అన్ని bus లూ కూడా ఒకరిచేతులలోనే ఉంటాయి. అన్ని bus లూ ఒకరి చేతులో ఎప్పుడైతే చేరతాయో అప్పుడు public interest కొంత neglect అవుతుందేమోనని.

Mr. SPEAKER :— The Matter was fully discussed and the Hon. Chief Minister also replied very recently.

## STARRED QUESTIONS

*Amendment of the Constitution of India.*

312—

*116 Q.-Sri S. VEMAYYA :— Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether this Government submitted its recommendations for the amendment of Article 31 of the Indian Constitution in pursuance of the Union Ministers call; and

(b) if so, what the recommendations of this Government in the matter are ?

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) No, Sir,

(b) Does not arise.

Sri S. VEMAYYA:— కేంద్ర ప్రభుత్వంవారు రాష్ట్ర ప్రభుత్వాన్ని అడిగారు. ఇతర రాష్ట్ర ప్రభుత్వాలు కూడా దీన్ని గురించి సిఫార్సులు పంపించాయి. compensation విషయంలో బీహారు ప్రభుత్వం కూడా compensation ఇవ్వకుండానే ఈ చట్టాన్ని సవరించాలని చెప్పింది. మన ప్రభుత్వం ఎందువల్ల జవాబు పంపలేదు. ఏ ప్రాతిపదిక అడ్డంవచ్చిందో తెలుసుకోవచ్చునా ?

The Hon. Sri B. GOPALA REDDI:—అన్ని ప్రభుత్వాలు పంపించినారు. తరువాత పార్లమెంటువారు కూడా దీన్ని గురించి చట్టంచేశారు. అది అమలులోకి కూడా వచ్చింది. ఈ రాష్ట్రప్రభుత్వంవారు సిఫార్సు పంపిచేలోపలనే వారు రాజీనామా పెట్టడం తటస్థించింది.

*Road Development Schemes in the Second Five Year Plan.*

313—

* 525 Q:—Sri P. RANGA REDDI :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether any road development scheme has been prepared by the Highways Department for inclusion in the Second Five-Year Plan; and

(b) if so, the estimated cost of the entire scheme and its particulars?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) The Second Five Year Plan for the State which includes road schemes is under formulation.

Sri P. RANGA REDDI :— National Highways కు సంబంధించినంతవరకూ కేంద్రప్రభుత్వం ఇంత మొత్తం అని నిర్ణయించి ఈ schemes పంపించమనిచెప్పి ఈ ప్రభుత్వాన్ని అడిగిందా? ఆ విధంగా పంపించియుంటే అందులో ప్రధానంగా పేర్కొనబడ్డ schemes ఏవి ?

Mr. SPEAKER :— The details can be discussed in the Planning debate.

The Hon. Sri N. SANJEEVA REDDI :— Printed copies of the draft plan have been supplied to the Members.

Mr. SPEAKER :— Yes, a copy has been supplied to the Members and it contains all information.

Sri C. SUBBARAYUDU :— కరువులు వచ్చినప్పుడు కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టి రోడ్లు వేశారు. రెండోదఫా కరువు వచ్చినప్పుడు కూడా metal collect చేసి పెట్టారు. అటువంటి వాటిని గురించి రెండో పంచవర్ష ప్రణాళికలో వాటి అభివృద్ధికోసం వాటిని fordable గా చేయుటకు ప్రభుత్వం ఏమైనా ఆలోచించిందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఇది plan కు సంబంధించనదే. ఆ పుస్తకాలున్నాయి చూడండి. ఇంకా వాటిలోవచ్చేవన్నీ discuss చేయండి. ఈదినం ఇంకా details finalise చేయలేదని మాత్రమే నేను చెప్పగలను.

*Assignment of Lands to the Poor*

314—

* 9. Q. : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Revenue be pleased to state —

(a) the extent of land so far assigned to the poor in pursuance of G. O. Ms. No. 1142, Revenue, dated 18th June 1954; and

(b) whether it is a fact that the assignment proposals have been kept under abeyance now ?

3rd August 1955]

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) An extent of Ac. 39,269.42 of land was assigned to landless poor persons upto 31-5-55 in pursuance of the orders issued in G. O. Ms. No. 1142, Revenue dated 18-6-1954.

(b) Only the assignment of project affected lands was kept in abeyance pending finalization of Government's policy. Orders have since been issued in June 1956 in regard to their assignment.

Sri S. VEMAYYA:—Project affected areas మాత్రమే నిలుపుదల చేశామన్నారు. పాత project ల క్రిందనే ఉన్నటువంటి భూముల assignmentలో కూడా నిలుపుదలచేయడం జరిగింది. దీన్ని ఎందువల్ల నిలుపుదల చేశారో తెలుసుకో వచ్చునా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— Existing projects క్రింద అటువంటిది ఏమీ చెయ్యలేదండి.

Sri B. SANKARAIAH:—ఈ విషయాన్ని ఇదివరకు కూడా తెలియ జేశాం. ఇప్పుడు కొవ్వూరు తాలూకా ఇదివరకే project క్రింద ఉండే area. ఆ విధంగా రాష్ట్రంలో అనేక చోట్లకూడ నిలుపుదల చేశారు. ఈ విషయం పునరాలో చించి మళ్ళీ orders వేస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— Project క్రిందకు వచ్చే టట్లయితే ఇవ్వరు. రాకపోతే ఉండనేఉంది.

Sri P. RAJAGOPALA NAIDU :— కొన్ని చెరువులక్రింద కూడా ఈలాంటి భూములు ఇవ్వకూడదని చెప్పే orders పంపియున్నారు. వాటిని గూర్చి కూడ పునరాలోచిస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI:— ప్రత్యేకమైనవి ఏమన్నా ఉంటే ఉండవచ్చును. అటువంటివి వ్యక్తిగతమైనటువంటి వ్యవహారాలు కాబట్టి అవి వచ్చినప్పుడు ఆలోచిస్తాం.

*Conversion of Public Step Wells into Draw Wells.*

315—

*163 Q.—Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether there are proposals with the Government to convert public step wells into draw wells ?

The Hon. Sri K. VENKATA RAO :— There are no such proposals before the Government, Sir.

Sri S. VEMAYYA :— అయ్యా! మన రాష్ట్రంలో కొన్ని ప్రదేశాలలో నారికురుపుల బాధ ఉందని ప్రభుత్వానికి తెలుసు. అటువంటి proposal ఆలోచించటానికి ప్రభుత్వానికి ఏ ఇబ్బంది అడ్డంవస్తుందో తెలుసుకోవచ్చునా ?

The Hon. Sri K. VENKATA RAO:— అది వారు వేసిన ప్రశ్నలో యున్న లోపమండి Whether there are proposals with the Government అనడంవల్ల లేవని చెప్పవలసివచ్చింది. దేశంలో లేవనికాదు. ఇప్పుడు Local Development Schemes క్రింద N. E. S. క్రింద మిగిలినవాటి అన్నింటిక్రింద proposals ఉన్నాయి. చాలా విషయాలలో జరుగుతున్నాయికూడాను.

Sri T. G. THIMMAYYA SETTY :— ఇదివరలో వున్న బావులకు conversion క్రిందే 10 వేలు, 15 వేలు, 20 వేలదాకా సెలవైనది కనుక క్రొత్త బావులు త్రవ్విస్తేనే బాగుంటుందనిన్నీ, మార్చడంవల్ల చాలా సెలవవుతుందనీ అన్నారే, అందుకని క్రొత్తబావులు త్రవ్వడానికి ఏర్పాటు ఏమైనా చేస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO:— ఇచ్చిన సలహా ఆలోచిస్తాం.

Sri C. SUBBARAYUDU :— ఇంతకుముందు ప్రభుత్వమే ఈ మార్పంతా కూడా చేస్తూ ఉండింది. అందులో లోతుగా ఉండేటటువంటి బావులుండే ప్రాంతాలలో 15 వేలో 20 వేల రూపాయిలవఱకో ఖర్చవుతోంది. అక్కడ స్థానికంగా ఉండేటటువంటి చిన్నచిన్న గ్రామాలు ఈ సదుపాయం పొందడానికి వీలుండదు కనుక ఇది ప్రభుత్వమే నిర్వహించడానికి పూనుకుంటుందా ?

The Hon. Sri K. VENKATA RAO :— ప్రభుత్వం ఈ పని చేయతేదండి.

*Fresh water Fishery Research Station.*

316—

*699 Q.—Sri P. GOPALAKRISHNA REDDI :— Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of fresh water fishery research stations maintained by the Government and where they are located, and

(b) the total expenditure incurred for each research station in the year 1954-55 ?

The Hon. Sri B. GOPALA REDDI : -

(a) There are no fresh water fishery research stations maintained by the Government in this State but there is a small Hilsa Fishery Research Unit at Dowleswaram in East Godavari District,

(b) The total expenditure incurred on the unit during 1954-55 was Rs. 11,247-14-6.

3rd August 1955]

Sri P. GOPOLAKRISHNA REDDI :– అధ్యక్షా, నెల్లూరులో మంచి రకాలైన చేపలు దొరుకుతాయి. కనుక నెల్లూరులో ఒక Fish Research Station స్థాపించడానికి మంత్రిగారు ఆలోచిస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI.:– ఇది ముందు Second Five Year Plan చర్చలో discuss చేయండి. అటుతరువాత చూస్తాము.

*Ayacut in Andhra under Tungabhadra Low-level Canal.*

317—

*393 Q — Sri P. RANGA REDDI :— Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) the total ayacut that could benefit the Andhra area by the waters of Tungabhadra Low-level Canal;

(b) the number of acres of land brought under irrigation up to the end of March 1955; and

(c) the measures taken by the Government for the speedy development of the ayacut under this project ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The total ayacut in the Andhra area that can be benefited by the waters of the Tungabhadra Low Level Canal is 1,56,913 acres.

(b) The extent of land brought under irrigation up to 3–4–1955 is 3,564 acres,

(c) A *statement is placed on the table of the House.

Sri P. RANGA REDDI :— Sir, I want the Deputy Chief Minister to answer my supplementaries connected with the low level canal.

Mr. SPEAKER :— He had no notice. Without notice, a Minister may refuse to answer a question.

Sri P. RANGA REDDI :— If he can answer let him answer, Sir.

Mr. SPEAKER :— All right, put your question.

Sri P. RANGA REDDI :— ఈ Low Level Canal అసలు ఎస్టిమేటు ప్రకారం ఎన్ని మైళ్ళు తీసుకుపోవాలో అంతవరకు త్రవ్వడం జరిగిందా ? లేకపోతే ఎన్ని మైళ్లు త్రవ్వినారు ? అప్పుడేకదా ఈ పూర్తి ఆయకట్టు irrigation చేయడానికి వీలవుతుంది. ఆ పని జరుగుతున్నదా ?

---

*Vide Appendix I at page 108 infra.

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఇప్పటికి కర్నూలు ప్రాంతపు border వరకు మాత్రమే త్రవ్వినారు. మొత్తం 180 మైళ్ళను (total length of the channel) ఇంకా 30, 40 మైళ్ళు త్రవ్వవలసి వున్నది. Without the aid of my file, I am speaking, Sir. If we complete the other 30 or 40 miles of the canal, we will be able to irrigate the other portions of the land.

Sri P. RANGA REDDI:—అందుచేత ఇంకా త్రవ్వకుండా ఉండేటటు వంటి 30, 40 మైళ్ళ ప్రాంతానికి ఈ statement లో ఇచ్చినటువంటి సౌకర్యాలు అన్నీ ఇప్పుడే extend చేస్తారా అని రివిన్యూ మంత్రిగారిని అడుగుతున్నాను.

The Hon. Sri K. CHANDRAMOULI:— కాలవ త్రవ్వకముందే సౌకర్యాలు ఎట్లు వస్తాయండీ? కాలవ త్రవ్విన తరువాత వస్తాయి.

Sri P. RANGA REDDI:— ఇదివరకు ఆ విధంగా కాలువ త్రవ్వనూ ఉన్నప్పుడే ఈ declaration work తీసుకోక పోవడం వల్లనే ఇటువంటి ఆలస్యం జరగడానికి కారణమైంది. అటువంటి ఆలస్యం జరుగకుండా ఉండడానికి ఇప్పుడే అటువంటి సౌకర్యాలు కలుగజేస్తే మంచిదని భావిస్తున్నాను.

The Hon. Sri K. CHANDRAMOULI:—ఆలస్యమేమీ కాదు. ఎప్పుడు కావాలో అప్పుడు రైతులకు ఇవ్వవలసినటువంటి సౌకర్యాలు ఇస్తాము. దానిని బాగు చేయడానికి సిద్ధంగా ఉంటే సౌకర్యాలు ఇవ్వబడుతాయి.

Sri T.G. THIMMAIAH SETTY:—తుంగభద్ర కాలువనుంచి హైదరాబాదు వాళ్ళు కూడ నీళ్ళు తీసుకొంటున్నారు. కనుక రాజోలిబండ ఆనకట్ట మనవైపు తీసుకొనేందుకు ఆలోచన ఉన్నదా? ఉంటే ఎంతవరకు పనిసాగింది?

The Hon. Sri K. CHANDRAMOULI:—వేరే ప్రశ్న వేయండి.

Sri VIJAYA BHASKARA REDDI:— కాలువత్రవ్వి ఒక సంవత్సరం పైన అయినా కూడ ఎటువంటి benefits, ఆయకట్టు fixation మొదలయినవి పూర్తికానందువల్ల రైతులు irrigate చేసుకోడానికి చాలా ఇబ్బందులు ఉన్నాయి. కనుక రెండు side by side చేస్తే బాగుంటుంది గనుక దీనిని ప్రభుత్వం ఆలోచిస్తుందా?

The Hon. Sri K. CHANDRAMOULI:— ఆలోచనలో ఉన్నదని ఇదివరకే చెప్పాము.

Sri C. SUBBARAYUDU:—ఇప్పుడు ఇంకా కాలువ త్రవ్వవలసినటువంటి ప్రాంతములో localisation అంతా complete అయిందా?

The Hon. Sri K. CHANDRAMOULI:—A separate question may be put.

*Preventive measures to check Guinea worm disease.*

318—

* 164 Q.—Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

3rd August 1955]

(a) the preventive measures taken by the Government to check and put an end to the "Guinea Worm" ("Narikurupu") disease; and

(b) if so, what they are?

The Hon. Sri K. VENKATA RAO :—

(a) & (b) - The following measures are being undertaken to prevent and control the disease.

(1) Super-chlorination of water supplies.

(2) Introduction of Cyclopecidal fishes in tanks, ponds and step wells.

(3) Conversion of draw wells into step wells.

(4) Advising the people by propaganda to use water from wells and tanks after filtration through cloth or boiling.

Sri S. VEMAYYA :— ఈ నారికురుపులు మన రాష్ట్రంలో ముఖ్యంగా ఏ యే ప్రాంతాలల్లో వస్తున్నాయో సెలవిస్తారా?

The Hon. Sri K. VENKATA RAO :— బందరు తాలూకా, కన్నవరం తాలూకా, ఆత్మకూరు తాలూకా, కనిగిరి తాలూకా, పొదిలి తాలూకా, దర్శి తాలూకా, రాపూరు తాలూకా, తాడేపల్లిగూడెం తాలూకా, కొవ్వూరు తాలూకా, కర్నూలు తాలూకా, ఆత్మకూరు తాలూకా, డోన్ తాలూకా, కంభం తాలూకా, గిద్దలూరు తాలూకా, కోయలకుంట్ల తాలూకా, ఆల్లగడ్డతాలూకా, బంగనపల్లి, పత్తికొండ వగైరా తాలూకాలు.

## *Stud–bulls*

319—

* 902 Q.—Sri M. RAJESWARA RAO :— Will the Hon. the Chief Minister be pleased to state —

(a) the number of stud-bulls purchased by the Department of Animal Husbandry during the period from 1st October 1953 to 31st March 1955;

(b) the cost of those bulls;

(c) the number of them either dead or found not useful up to 30th April 1955; and

(d) the number of bulls given to individuals.

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) ... 44.

(b) ... Rs. 19,200.

(c) Only one bull died on 19-5-54. All other bulls have been useful.

(d) 26 bulls were distributed to individuals.

Sri M. RAJESWARA RAO :— ఈ bulls ను అమ్మడానికి గాను కొన్ని private firms ఏర్పడినాయని తెలుస్తున్నది. కనుక ఈ bulls ను అటువంటి private firms దగ్గర కొంటున్నారా లేక individual గా కొంటున్నారా ? ఏ basis మీద ఈ bulls ను purchase చేస్తున్నారో సెలవిస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI :— The above bulls were purchased at the following rates.

16 Ongole bulls

| | | | |
|---|---|---|---|
| 2 | bulls at | 1,580 | each |
| 1 | ,, | 1,350 | |
| 4 | ,, | 1,300 | ,, |
| 2 | ,, | 1,100 | ,, |
| 1 | ,, | 1,200 | |
| 5 | ,, | 1,000 | ,, |
| 1 | ,, | 1,050 | |

13 Morra buffallo bulls

| | | | |
|---|---|---|---|
| 4 | bulls at | 900 | each |
| 5 | ,, | 800 | ,, |
| 2 | ,, | 850 | ,, |
| 2 | ,, | 800 | ,, |

ఈ మాదిరిగా వాటియొక్క సామర్థ్యమునుబట్టి కొంటూ ఉంటారు.

Sri M. RAJESWARA RAO:— అసలు ఈ bulls ను అమ్మడానికి కొన్ని private firms ఏర్పడినట్లుగా ఉన్నది. వారివద్ద కొంటున్నారా లేక individual గా కొంటున్నారా ?

The Hon. Sri B.GOPALA REDDI:—Male Live stockDistribution Scheme అని ఉన్నది. దానిక్రింద కొంటున్నారు. అదిఎట్లా కొంటున్నారో వివరాలు లేవు.

Sri B.V. SUBBA REDDI:- ఈ కొన్న ఆబోతులు బజారులో మూడు వందల రూపాయలు ఖరీదు అయితే అధికారులు పదమూడు వందలకు కొంటున్నారనేది తెలుసునా ?

The Hon. Sri B. GOPALA REDDI:—కాదండీ. శాస్త్రనిపుణులందరు చూచి దానికి సరియైన మదింపుచేసే కొంటున్నారని ప్రభుత్వంవారు అభిప్రాయ పడుతున్నారు.

3rd August 1955]

Sri V. VISWESWARA RAO :—Individuals కు 26 ఇచ్చామని చెప్పారు. Individuals కు ఇవ్వకుండా పంచాయితీ బోర్డులకు గాని లేక అక్కడ స్థానికంగా ఉన్న సంఘాలకుగాని ఇస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI:—ఆలోచిస్తాము.

Sri P. SREERAMULU:— ఇప్పుడు కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు (Artificial Insemination Centres) open చేసిన తరువాత ఈ bulls కొరకు ఖర్చుపెట్టే డబ్బు తగ్గిందా !

The Hon. Sri B. GOPALA REDDI :— ఇంకా ఆ పద్ధతి విస్తారం కాలేదు. ఇప్పటికేమి ఖర్చుతగ్గినట్లులేదు.

Sri CHITHAMBARA REDDI:—ఈ bulls ఎట్లా కొంటున్నారో తెలియదు అన్నారు. అందులోనే కిటుకున్నదని అంటున్నాను. 1954 సంవత్సరము మార్చినెలలో కొన్నటువంటి ఎనిమిది sturd bulls కు ప్రభుత్వంనుంచి పోయినటువంటి అధికారి ఎనిమిదివేల రూపాయలవరకు ఖర్చు పెట్టారు. ఇవి అంత వెల చేయవని మంత్రిగారికి తెలుసునా ?

The Hon. Sri B. GOPALA REDDI:—ఎద్దువిలువ కట్టడంలో ఒకరు చెప్పినట్లు ఇంకొకరు చెప్పరు. అందువల్ల కొంతఅభిప్రాయ భేదముఉంటే ఉండవచ్చును.

*Assignment of lands covered by Projects.*

320—

* 402 Q.—Sri P. RANGA REDDI :— Will the Hon. the Minister for Revenue be pleased to state whether it is a fact that the lands covered by projects which have been executed or proposed to be taken up would be excluded for assignment to the landless poor ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

The answer is in the negative.

Sri P. RANGA REDDI :— భూములులేని పేదవారికి ప్రాజెక్టుక్రింద భూములు ప్రభుత్వంవారు ఉచితముగా యిస్తారని అర్థముచేసుకోమంటారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :– ప్రాజెక్టు క్రింద వున్న భూములు ఉచితంగా మాత్రం ప్రభుత్వమువారు ఎవ్వరికినీ యివ్వనే యివ్వరు.

Sri M. R. APPA RAO :–Forest area లో వున్న భూములు ప్రాజెక్టు ఏరియాలో వున్నను, అవి cultivation కు యిస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :– Forest area లో వున్న భూములు forest purposes కు మాత్రమే వుంచబడుతాయి.

Sri A. KALESWARA RAO:—1955వ సంవత్సరము జూన్ 6-వ తేదీగల జి. ఓ. లో project affected area అంటే, దానికి definition యివ్వడములో

ఆ యేరియాలో వున్న భూములన్నీ అందరికీ యివ్వవచ్చునని తీర్మానం ప్రభుత్వము చేసి వున్నదా ?

The Hon. Sri K. CHANDRAMOULI :- ఇదివరకు ఎల్లా వున్న ప్పటికినీ యిప్పుడు ప్రభుత్వముయొక్క నిర్ణయము ప్రకారము project affected land ఉచితంగా మాత్రము యివ్వబడదు.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, వివిధ ప్రాజెక్టులక్రింద వున్న భూములకు ఏవిధమైన ధరలు నిర్ణయించారు ? భూదానోద్యమాన్ని బలపరిచేటటువంటి యీ ప్రభుత్వం భూములు అమ్మటము అనేది సరియైనవిధానమనే అనుకుంటున్నదా?

The Hon. Sri K. CHANDRAMOULI :- భూములు వున్న ప్రదేశాలను బట్టి భూసారాన్నిబట్టి రెవిన్యూబోర్డువారు రేట్లు నిర్ణయిస్తారు. ఆ రేట్ల ప్రకారమే వసూలుచేస్తారు. భూదాన యజ్ఞానికి యిది యేవిధంగానూ contradictory అని ప్రభుత్వమువారు భావించడములేదు. ఇది complimentary అనే అనుకుంటున్నారు.

*Special staff for preparation of the Second Five-Year Plan.*

321—

* 478 Q.—Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) Whether any special staff has been appointed by the Government to prepare the Second Five-Year Plan ; and

(b) if so, the extra cost involved in the year.

The Hon. Sri K. VENKATA RAO :—

(a) Yes.

(b) About Rs. 1,80,000/-

Sri S. VEMAYYA :— Special staff ఎంతకాలమువరకూ యీపనిలో నిమగ్నులై వుండాలి ? వారిని ఎప్పుడు disband చేస్తారో తెలియజేస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO :— ఆపని అంతా అయిపోయింది. Special staff యీ వేళకు వెళ్ళిపోయే వుంటుంది.

Sri SHEIK MOULA SAHEB:— అధ్యక్షా, Special Staff లో వున్నవారు యిదివరకు Revenue Department లో గుమాస్తాలుగా వున్నవారున్నారు. వారు సర్వీసు కమీషన్ పరీక్షకు అర్హులు కారని, అంగులో రెండు, మూడు, సంవత్సరాలు సర్వీసు చేసినవారినికూడా నిలిపివేసియున్నారు. అట్టివారికి ప్రాధాన్యత యిందులో యిస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO :— వారిని వేయడం, యీపాటికి వాళ్ళు యింటికి వెళ్ళిపోవడంగూడా జరిగివుంటుంది. ఇప్పటికి ఆ పనిఅంతా అయిపోయి వుంటుంది. కాబట్టి యిప్పుడు ప్రాధాన్యత ఎవరికియిప్పించమంటారో, నాకు అర్థము కావడంలేదు.

3rd August 1955]

*Tents for Government Servants at Kurnool*

322—

* 1034 Q.—Sri A. KALESWARA RAO :— Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of Government tents in Kurnool in which the Government servants are still living ;

(b) whether the Government are aware that most of the residents in tents have been sending away their families from Kurnool during summer, due to great inconveniences ; and

(c) the time and money required to provide all the Government servants living in tents with pukka buildings ?

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) 489.

(b) Some representations were made.

(c) It will take about eight months and will cost about Rs. 32,28,000/-

Sri A. KALESWARA RAO :— ఇంతవరకు డేరాలలో వున్నవారికి సౌకర్యాలు యేమి కలిగించకముందే యింకా క్రొత్తఆఫీసులు తీసుకొనిరావటానికి ప్రభుత్వము ప్రయత్నించడము న్యాయమేనా ? వారిని తీసుకొనివస్తే వచ్చినవారందరికి యిబ్బంది కాదా ?

The Hon. Sri B. GOPALA REDDI :— ఇబ్బంది కలుగకుండా వుండడానికే, యిప్పుడు క్రొత్త ఆఫీసులు ఏవీ కూడా యిక్కడికి తీసుకొనిరావడము లేదు.

Sri VIJAYA BHASKARA REDDI :— ఈ buildings అన్నీ కట్టటము పూర్తికావటానికి యింకా ఎనిమిదిమాసములు పటుతుందని అంటున్నారు. అయితే యివి ఎప్పుడు మొదలుపెట్టుతారు ?

The Hon. Sri B. GOPALA REDDI :— 800 యిళ్ళు త్వరలోనే తయారుఅవుతాయి. తక్కిన యిళ్ళకు ప్రభుత్వము శాంక్షనుచేయవలసివున్నది. అవికూడా శాంక్షను అయినతరువాత ప్రారంభింపబడుతాయి.

Sri P. VENKATA SUBBAYYA :— కొంతమంది ప్రభుత్వోద్యోగులకు యీ టౌనులో స్వంతయిళ్ళు వున్నప్పటికినీ వారు వాటిల్లో కాపురము వుండకుండా ప్రభుత్వము requisition చేసిన యిళ్ళలో వుంటూ, యితర ఉద్యోగస్థులకు యిళ్ళు రాకుండా యిబ్బంది కలుగజేస్తున్నారు. ఈ విషయము ప్రభుత్వానికి తెలుసునా ? ఆ విధంగా యిబ్బందులు కలుగజేయకుండా చేస్తారా ?

The Hon. Sri B. GOPALAREDDI :- సభ్యుని ఉద్యోగము, వారు ఎక్కడ బాడుగలకు యిచ్చుకుని యిక్కడ వుంటున్నారనా? అయితే అది విచారిస్తాము.

*Capital loans under cess schemes.*

323--

*717 Q.- Sri PRAGADA KOTAIAH :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state-

[a] the working capital loans sanctioned under the cess schemes during the past two years for providing working capital to the Weavers' Co-operative Societies;

[b] the amount actually disbursed to the Societies; and

[c] the steps proposed to be taken to provide the required working capital to the Societies ?

The Hon. Sri K. VENKATA RAO :-

(a) Rs. 25 lakhs.

(b) Rs. 25 lakhs.

(c) A sum of Rs. 65,66,000 has been provided during 1955-56 for the working capital of the societies.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా! రిజిస్ట్రారుగ యిచ్చిన అంచనాల ప్రకారమే, డబ్బు రెండు కోట్లవరకు పెట్టుబడి కావాలంటూంటే, ఆ డబ్బు సమీకరించటానికి ప్రభుత్వము ఏమి చేస్తుంది?

The Hon. Sri K. VENKATA RAO :— మనము అడిగిన డబ్బు ఎంత అయినప్పటికినీ, ప్రభుత్వము యిచ్చింది 15 లక్షలే. 15 వేల looms కు, 15 లక్షలు రూపాయలు యిచ్చారు. మనకు అవసరము కలిగినకొద్దీ అడుగుతూ వుంటాము. వారు యిచ్చినదంతా మనము ఉపయోగిస్తూ వుంటాము.

*Minimum wages of Industrial Workers*

324—

* 755 Q.—Sri P. GOPALAKRISHNA REDDI :— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) in how many industries in the State minimum wages were fixed for the employees ; and

(b) the names of such Industries and other details thereof ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) In 12 industries.

(b) A statement* is placed on the table of the House.

* Vide appendix II at page *111* infra.

3rd August 1955]

Sri P. GOPALAKRISHNA REDDI: —Mica mines లో జంపర్ కూలీలకును, plastering మేస్త్రీలకు రోజుకు రెండురూపాయలు fix up చేసి యిస్తున్నారు. వీరు చేసేపని చాలా ప్రమాదపరిస్థితులలో చేస్తూవుంటారు. ఇటువంటి పరిస్థితులలో ప్రభుత్వము యీ రేటును enhance చేయటానికి ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA :— అటువంటి విషయము యింత వరకూ ప్రభుత్వం దృష్టికి రాలేదు. వస్తే విచారిస్తాము.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—Motor Transport Department లో salaries, allowances అన్నీ చేరి చిన్న చిన్న మొత్తాలుగా fix చేసి యిస్తున్నారు. అంటే scavengers కు పది రూపాయలు peons కు 18 రూపాయలు యిస్తే యీ నాడు cost of living పెరిగినప్పుడు ప్రస్తుత ధరలనుబట్టి వారికి యిచ్చే జీతాలు సరిపోతాయని ప్రభుత్వం అనుకుంటున్నదా ?

The Hon. Sri G. LATCHANNA :— ప్రభుత్వము అప్పటి పరిస్థితులను బట్టి విచారించి నిర్ణయముచేశారు. కాని యిప్పుడు మార్పులు ఏమైనా వస్తే, ఆ విషయము ప్రభుత్వ దృష్టికి వస్తే ప్రభుత్వము విచారిస్తుంది.

Sri M. NAGI REDDI:—అధ్యక్షా, పన్నెండు పరిశ్రమలలో minimum wages fix చేశామని అంటున్నారు. అలా fix చేసి అతిఖచ్చితముగా అమలుపరిచారా? ఆ విధంగా అమలు పరచడములేదని ఏమైనా petitions ప్రభుత్వానికి వచ్చాయా ?

The Hon. Sri G. LATCHANNA :—అమలుపరచడం లేదనే ఫిర్యాదులు ప్రభుత్వానికి యింతవరకు రాలేదు.

Sri P. SUNDARAYYA :— Public Motor Transport లో scavengers కు sweepers కు watchmen కు ఒక్కొక్కరికి నెలకు 10 రూపాయలు ప్రకారము నిర్ణయించారు. ఈ పది రూపాయలు ఏపద్ధతిమీద కనీసవేతనం క్రింద ప్రభుత్వం గుర్తించింది ?

The Hon. Sri G. LATCHANNA :— స్థానిక పరిస్థితులను బట్టి వారి వారి వృత్తులను ప్రభుత్వం దృష్టిలో పెట్టుకుని వారికి రేట్లను నిర్ణయిస్తూ వుంటుంది.

Sri P. SUNDARAYYA :— Municipal scavengers కు నెల 1 కి 18 రూపాయలవంతున యిస్తూన్నప్పుడు, Public Transport లో scavengers కు, sweepers కు, అందులో ముఖ్యంగా వుదయమునుంచి సాయంత్రం వరకు, తరువాత తెల్లవార్లు కాపలా కాసే watchman కు 10 రూపాయలే fix చేశారు. ఇంత చిన్న జీతములో వారి కుటుంబాలు, వారు జీవించటానికి ఏవిధంగా చాలుతుందని ప్రభుత్వము నిర్ణయించారు ?

The Hon. Sri G. LACHANNA :— కుటుంబాలకు సరిపోతుందో లేదో అది వేరే సమస్య. స్థానిక పరిస్థితులనుబట్టి ఆ యా ప్రదేశాలలో వారి వారి వృత్తులకు సంబంధించి వస్తున్న ఆదాయాన్ని దృష్టిలో పెట్టుకుని రేట్లు ప్రభుత్వము నిర్ణయించింది. ఈ జీతము చాలదు, మార్పుచేయండి అని యింతవరకు ప్రభుత్వ దృష్టికి రాలేదు. వస్తే విచారిస్తాము.

[3rd August 1955

Sri P. SUNDARAYYA :—ఇదేరకంగా employment in Tanneries and Leather Manufacture క్రింద 7, 8 తరగతుల ఉద్యోగు లున్నారు. Helpers, buffing, machine operators, emeregial operators, glazing machine operators, trimmers, pressing-machine operators, hand ironers, borders, అనేటటువంటివారు పనిచేస్తున్నారు. వీరికి ఒక్కొక్కరికి దినకూలి పది అణాలు fix చేశారు. ఈ విధంగా యిస్తే అది వారికి సరిపోతుందని ప్రభుత్వముయొక్క అభిప్రాయమా ?

The Hon. Sri G. LATCHANNA:—పది అణాలు మాత్రమే నిర్ణయించారు. యిది నూకు సరిపోవడము లేదు అనే ఫిర్యాదు ప్రభుత్వ దృష్టికి యింతవరకు రాలేదు. వస్తే విచారిస్తామని చెబుతున్నాను.

Sri P. SUNDARAYYA:— బహుశ ఈ పది అణాలుకూడా యివ్వకుండా వుంటున్నారు కాబోలు. అప్పుడు ప్రభుత్వానికి complaint చేసినా కూడా ఏమి ప్రయోజనము వుండదని వూరకున్నారేమో అనుకుంటాను. ఇప్పటికైనా ప్రభుత్వము విచారిస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA:— అటువంటి విషయము యేదైనా వుంటే అది ప్రభుత్వ దృష్టికి తెస్తే తప్పకుండా విచారిస్తామని సనవి చేశాను.

Sri S. VEMAYYA:—ఇక్కడ చివరిపేజీలో transplantation కు 12 అణాలు మాత్రమే ప్రభుత్వము ఇస్తోందని చెప్పారు. 12 అణాలకు కూలీలురారు. తరువాత 12 అణాలకు ఎక్కువ చేయమని రిప్రెజెంటేషన్సు వచ్చినాయి. దానిని చేయడానికి ప్రభుత్వము ఏమైనా వూనుకుంటుదా ?

Sri G. LATCHANNA:—ఇంతవరకూ నాదగ్గరకు రిప్రజెంటేషన్సు రాలేదు.

325— *Text Books for Elementary and High Schools.*

*1144 Q.— Sri A. KALESWARA RAO :— Will the Hon. the Chief Minister be pleased to state–

(a) whether the Sub-Committee of the Congress Legislature Party recommended that all text books for the Elementary and High Schools should be got written, printed and sold by the Government; and

(b) the action taken by the Government this year to carry out above recommendation ?

The Hon. Sri B. GOPALA REDDI :—

[a] Government are not aware of any such recommendation. But the Government are aware that the Kuppuswami Committee made that recommendation.

3rd August 1955]

[b] Government have constituted a committee to go into the question of publication of text books by the State in greater detail and to suggest ways and means for implementing it

Sri A. KALESWARA RAO :— ప్రభుత్వమువారు ఈ కమిటీద్వారా పుస్తకాలు వ్రాయించేటప్పుడు భారతదేశముయొక్క, ఆంధ్రదేశముయొక్క ఉజ్వలమైన వెనుకటి చరిత్రలను, స్వతంత్ర్య పోరాట చరిత్రను, నైతిక పునరుద్ధరణకు, సోషలిస్టు సమాజ పునర్నిర్మాణమునకు కావలసిన భావములన్నీ పిల్లలకు నేర్పేటట్లుగా మీరు వ్రాయించవలసిందని ఏమైనా instruction ఇస్తారా? లేకపోతే ఏదో ఒక పద్ధతిన భాష బాగుందో లేదో మాత్రమే చూస్తారా?

The Hon. Sri B. GOPALA REDDI :— అన్ని మనస్సులో పెట్టుకుని వీరు సిఫార్సు చేయండి అని ఒక కమిటీని వేసినారు. ఆ కమిటీవారు పరిస్థితులన్నీ దర్యాప్తుచేసి నివేదిక ఇస్తారని ఆశిస్తున్నాను.

Mr. SPEAKER :— I am very happy to announce that the Hon. Chief Minister and the other Ministers of Hyderabad are now with us in the Assembly and the House will welcome them.

Sri P. SUNDARAYYA :— ఆగస్టు 3 వ తేదీ అయినప్పటికి కూడా ఇప్పటివరకు కృష్ణాజిల్లాలో సెకండరీ స్కూల్సులో గాని, బోర్డు స్కూల్సులో గాని, Text-Books ఇంతవరకు నిర్ణయించలేదన్న సంగతి ప్రభుత్వ దృష్టికి వచ్చిందా?

The Hon. Sri B. GOPALA REDDI :— నేను పత్రికలలో చూచాను. నేను రేపు బందరు, విజయవాడ వెళ్ళుతున్నాను. అవన్నీ తప్పకుండా దర్యాప్తు చేస్తానని హామీ ఇస్తున్నాను.

Sri P. SUNDARAYYA :— దర్యాప్తు చేయడమే కాదు. వెంటనే పుస్తకాలు నిర్ణయించి వాళ్ళ చదువులకు నష్టములేకుండా చేయాలి.

The Hon. Sri B. GOPALA REDDI :— తప్పకుండా ఆలోచిస్తాను. కాని ఇప్పుడు ఆగస్టులో వున్నాము, జులైలో రావలసిన పుస్తకాలు ఇంతవరకు రాలేదు అంటే అది చాలా పెద్ద సమస్య అని గవర్నమెంటువారు ఆలోచిస్తారు. దానికి తగినటువంటి చర్యలు తోడనే తీసుకొంటాము.

Sri P. SUNDARAYYA :— ఈ జిల్లాలో ఎక్కువమంది S.S. L.C. లో fail అయ్యారని చెప్పారు. దానికి ఇలాగే Text-Books 2 నెలలు, 3 నెలలకు గాని సరఫరా లేక పోవడమే కారణమని ప్రభుత్వము గుర్తించిందా?

The Hon. Sri B. GOPALA REDDI :— ఒక్క జిల్లాలో ఈ ఒక్క సంవత్సరము Text-Books విషయం కొంచెముఆలస్యముఅయింది. దీనికినీ కృష్ణాజిల్లాలో S.S.L.C.లో తక్కువమంది pass కావడానికి సంబంధములేదు. బహుశ ఇది S.S.L.C. సంబంధించిన విషయముకాదు. ఇది ఎక్కువగా సెకండరీ, ఎలిమెంటరీ education, ఇంకా I Form, II Form వగైరాలు వున్నటువంటి క్లాసులకు సంబంధించింది అనుకొంటాను.

Sri A. KALESWARA RAO :- ఉన్నతమైనటువంటి భావములను ఈ పుస్తకాల ద్వారా విద్యార్థులకు బోధించడమే కాకుండా ప్రభుత్వమునకు ఈ Text Books ను వారే అచ్చువేయించి అమ్మడమువల్ల చాలా లాభమువస్తుందని ప్రభుత్వానికి తెలుసా ? దీనివిషయం ఏమి ఆలోచిస్తున్నారు ?

The Hon. Sri B. GOPALA REDDI :-లక్షలమీద పబ్లిష్ చేసేవిషయము కాబట్టి లాభమువిషయముకాదా సరియైనటువంటిదే. మంచి బొమ్మలు కలిగినటువంటి పుస్తకాలను ఇచ్చి పిల్లలకు అభిరుచికలిగేట్టుగా చేయాలనే మా ఉద్దేశ్యము. తిరువాన్కూరు కొచ్చిన్ ప్రదేశములో వున్నది. అందుకుగాను ఇటీవల ఒక కమిటీని ఏర్పాటుచేసి రెండు మాసములలో రిపోర్టు తయారుచేయమని ప్రభుత్వం కోరింది.

*Government Hospital, Vijayawada.*

326—

*1019 Q.— Sri A. KALESWARA RAO :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government have granted a new site for the construction of new buildings for the Government Hospital, Vijayawada, as the existing buildings are very congested;

(b) whether the Hospital Advisory Committee have collected by subscription of Rs. 1,10,000 and gave it to the Government;

(c) when the construction of the new buildings will be taken up and the amount required; and

(d) whether the Government propose to assign the old hospital site (which falls vacant by the shifting of the present hospital) to the Vijayawada Municipal Council for construction of their office buildings ?

The Hon. Sri K. VENKATA RAO :—

(a) As the existing facilities are quite inadequate in the Government Hospital, Vijayawada, the Government have decided to construct new buildings for the Hospital on the Government site bearing T. S. No. 440/1-B6 in the Vijayawada Municipality.

(b) The Honourable Member is presumably referring to the offer of a sum of Rs. 70,000/- by the Bezwada Hospital Association for the construction of new buildings for the Hospital on the Government site which has been accepted by the Government.

(c) As soon as the plans and estimates are technically approved, the construction of the buildings will be taken up. It is estimated that the new buildings will cost about Rs. 6 lakhs.

(d) Whenever the Municipal Hospitals were provincialised, the site and buildings of the Hospitals were transferred to the Government and the transfer was an outright transfer, right title and possession vesting absolutely with Gevernment. The Municipal Councils were saved a substantial amount of recurring expenditure on the maintenance of the Hospitals. The Government have all along resisted requests for the transfer of the hospital buildings to the Local Bodies concerned when they fell vacant on account of transfer to newer and larger buildings etc., often built at much expense. The existing buildings cannot therefore be assigned to the Vijayawada Municipal Council.

Sri A. KALESWARA RAO:—1928 సం॥లో విజయవాడ ఆస్పత్రికి తాలూకా status ఇచ్చారు. ఇప్పుడు అది ఆంధ్రదేశములో కల్లా పెద్దపట్టణము గనుక 6 లక్షలు అనేది మానేసి District ఆస్పత్రి కంటేకూడా ఎక్కువ status ఇవ్వడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. VENKATA RAO :— అలాంటి ఏర్పాట్లు చేయడానికి వీల్లేదు. ఆ జిల్లాలో పెద్దపట్టణము మచిలీపట్టణము. గనుక అక్కడ District Headquarters ఆస్పత్రివుంది. అటువంటి status గల ఆస్పత్రి రాష్ట్రములో ఎక్కడాలేదు. విజయవాడకు అసలేరాదు.

Sri A. KALESWARA RAO:—ఆస్పత్రులు అనేవి ప్రజలయొక్క ఉపయోగము కొరకు. అచ్చట 2 లక్షల జనసంఖ్య ఉన్నది. కాబట్టి టెక్నికలుగా మాట్లాడము ప్రభుత్వానికి సరియైనదికాదు.

The Hon. Sri K. VENKATA RAO:— విజయవాడ పట్టణములో 2 లక్షల జనాభావున్నదని ప్రభుత్వ లెఖ్ఖలలోలేదు. కాని కాళేశ్వరరావుగారి నియోజకవర్గములో ఎక్కువ కృషి జరిగిందేమో నాకు తెలియదు.

*District Wholesale Co-operative Stores.*

327—

*1159 Q:— Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state whether the Government are proposing to convert the District Wholesale Co-operative Stores into District Marketing Societies ?

[3rd August 1955

The Hon. Sri D. SANJIVAYYA :— With reference to a recommendation of the All India Rural Credit Survey Report that District Marketing Societies might be formed on a territorial or commodity basis according to local conditions, the Registrar of Co-operative societies has under consideration the question of converting the existing District Co-operative Whole-sale Stores into District Marketing Societies. No proposals as yet have been received by the Government from the Registrar in this regard.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— ఈ మార్కెటింగు సొసైటీలు రాబోతున్నాయనే వుద్దేశ్యముతో, స్టోర్సులలో వున్న స్టాఫ్‌ను తీసివేస్తున్నారు. అసలు కో ఆపరేటివు ఉద్యమం శాశ్వతంగా ఉండబోతున్నది గనుక జిల్లా బోర్డుల మాదిరిగా వాటికికూడా ఒక కేడరు ఇప్పించే ప్రయత్నం ప్రభుత్వం ఏమైనా చేస్తుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :— కేడరు ఇప్పించే ప్రయత్నం వేరు. ఈ హోల్ సేల్ స్టోర్సుల స్థానే మార్కెటింగు సొసైటీలు వస్తున్నాయి. ఆ సొసైటీలను నిర్వహించడానికి వుద్యోగులు కావలసి వస్తారు. అందులో వారిని తీసుకుంటారు.

Sri K.SUBBA RAO:— ఈ హోల్ సేల్ సొసైటీలు నడుస్తున్నప్పటి అవి సంపాదించినటువంటి లాభాలు ఏమైనా ధర్మకార్యాలకు వెంటనే మేము ఖర్చుపెడు తాము మాకు వుత్తరువులు ఇవ్వవలసిందని ప్రభుత్వమువారిని అడిగినట్లయితే దానికి వుత్తరువులు దయచేస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఎవరూ ఇంతవరకు అడగ లేదు. అడిగితే ఆలోచిస్తాము.

Sri VAVILALA GOPALA KRISHNAYYA:— ఈ మార్కెటింగు సొసైటీలు ఎన్నేళ్ళలో ఏర్పడుతాయి ?

The Hon. Sri D. SANJIVAYYA :— క్రమేణా వస్తాయి. దాదాపు ఇప్పుడు 170 ప్రైమరీ కో-ఆపరేటివు స్టోర్సులు వున్నాయి. జిల్లా వారీగా త్వరలో వస్తాయి.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా ! ఈహోల్ సేల్ కో-ఆపరేటివు స్టోర్సులను, District మార్కెటింగు స్టోరులుగా convert చేస్తాము అంటున్నారు. ఇప్పుడు వున్నటువంటి మార్కెటింగు సొసైటీలు కూడా పనిచేస్తాయా?

The Hon. Sri D. SANJIVAYYA :— అవునండి. అదేఅభిప్రాయము. ప్రైమరీ స్టోర్సుగా వున్నటువంటివి మార్కెటింగు సొసైటీలుగా వుంటాయి. వీటికి కేంద్రముగా జిల్లాలో ఒక సంఘం వుంటుంది. వీటన్నింటికి రాష్ట్రస్థాయిలో ఒక సొసైటీ స్థాపించాలని ఈ సిఫార్సుయొక్క వుద్దేశ్యము.

3rd August 1955]

*National Dramatic Hall.*

328:—

*1153 A Q:—Sri A. KALESWARA RAO :— Will the Hon. the Chief Minister be pleased to state whether the Government propose to start a National Dramatic Hall at Vijayawada ?

The Hon. Sri B. GOPALA REDDI:—The answer is in the negative.

Sri A. KALESWARA RAO :— ప్రభుత్వమువారు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నాటక కళాభివృద్ధి కొఱకు, విజయవాడలో కాకపోయినా ఇంకా ఎక్కడ అయినా సరే ఆంధ్రరాష్ట్రంలో జాతీయ నాటకకళకు ఇందులో కళాత్ము లైనటువంటి మన ప్రధానమంత్రిగారి హయాములోను ఒక నాటక శాలను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వమువారు ప్రయత్నము చేస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI:—దానికి ముందు కాస్త ఉపో ద్ఘాతముగా ఈ సంగీత నాటక అకాడమీయొక్క బ్రాంచి ఆంధ్రదేశములో ప్రభుత్వము వారి ఆధ్వర్యము క్రింద పెట్టాలని కుతూహల పడుతున్నది. పెట్టిన తరువాత నాటకకళకు ఎటువంటి పోషణజరగాలో National Dramatic acadamy ఎక్కడ అవసరమో అవన్నికూడా ఆ సంగీత నాటక అకాడమీవారు ఆలోచించి సిఫార్సు చేయవలసి ఉంటుంది. అందువల్ల ప్రభుత్వమువారి దృష్టిలో ఇప్పుడు ఏమీలేదని చెప్పినామేగాని, ఏమిచేయకూడదనే ఉద్దేశ్యముకాదు.

Sri M. R. APPA RAO:—మద్రాసు గవర్నమెంటులో నాటకకళాభివృద్ధికి ఒక కమిటీని అప్పాయింటు చేసినారు. అది మన ముఖ్యమంత్రిగారు మద్రాసు గవర్న మెంటులో ఆర్థిక శాఖామాత్యులుగా వుండగా జరిగింది. ఆ రిపోర్టును మనము వారిదగ్గర నుంచి తెప్పించి ప్రింటుచేస్తే బాగుంటుంది. దానిని గురించి ఆలోచిస్తున్నారా ?

The Hon. Sri B. GOPALA REDDI:— చాలా కాలమునుంచి అది ప్రింటు చేస్తే బాగుంటుందని కుతూహలంగా వున్నది. కాని ప్రస్తుతం మనకు వున్నటువంటి గవర్నమెంటు ప్రెస్సులోని ఇబ్బందులవల్ల తోడనే అది ప్రింటుచేయ లేక పోతున్నాము. ఆ రిపోర్టును తెప్పించి దాని ప్రచురణ కోసము ప్రయత్నాలు తోడనే కాకపోయినా చేయాలనే సంకల్పం వున్నది.

Sri N. VENKAYYA :— మంత్రిగారు సూచించిన economy ఎంత త్వరలో కార్యరూపము ధరిస్తుందో తేదీ చెప్పగలరా ?

Mr. SPEAKAR :— లేదన్నారండి. కార్యరూపము ఎక్కడనుండి వచ్చింది?

The Hon. Sri B. GOPALA REDDI :— All India Sangeetha academy అధ్యక్షులు అయిన జస్టిస్ రాజమన్నారుగారి దగ్గరకు దాని constitution పంపబడింది. వారు approve చేసి పంపించగానే దానిని ఏర్పాటు చేయాలని ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యము.

Sri L. LAKSHMANA DAS :— అధ్యక్షా ! ఈ dramatic hall ఇప్పుడుకంటే మనకు కొద్ది రోజుల్లో విశాలాంధ్ర ఏర్పడుతుంది కాబట్టి అంత అందమైన Hyderabad పట్టణములోనే కట్టడానికి ప్రయత్నము చేస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI :— హైదరాబాదు ముఖ్యమంత్రిగారు ఇక్కడ ఉన్నారని కాబోలు గౌరవ సభ్యులు ఆ ప్రశ్న వేశారు. భవిష్యత్తు ఎట్లా ఉండునది మనము ఎవరము చెప్పలేము. ఈ విషయము రాజకీయ జోతిష్యము.

Sri R. B. RAMAKRISHNA RAJU :— Madras లో ఏర్పాటు చేసిన committee report ఇక్కడకు వచ్చిందా ?

The Hon. Sri B. GOPALA REDDI :— రాకపోతే ప్రయత్నిస్తాము. దానికేముంది ? వ్రాస్తే పంపిస్తారు. ఇప్పుడు పంపించమంటే పంపిస్తారు. బహుశా ఇక్కడే ఉండవచ్చు. లేకపోతే తెప్పించడానికి అభ్యంతరమేమీలేదు.

Sri R. B. RAMAKRISHNA RAJU :— వెనక దానిని తెప్పించి ఎవరికైనా కావాలంటే యిస్తాము అన్నారు. అందువల్ల మీరు తెప్పించారా అని అడుగుచున్నాను.

The Hon. Sri B. GOPALA REDDI :— శ్రీ అప్పారావుగారు, శ్రీ స్థానం నరసింహారావుగారు 5 మాసాలు కూర్చొని ఆరిపోర్టుతయారుచేశారు. అది మేము అనుకొన్నదానికంటే పెద్ద రిపోర్టు అయినది. మేము మద్రాసులో ఉండగా దాని ప్రింటింగుకు 4, 5 వేలు అవుతుందని అంచనావేశినాము. Type కాపీ కావాలంటే రామకృష్ణరాజుగారు, వారిలాంటి వారి కలాగూ ఇస్తాము.

The Hon. Sri K. VENKATA RAO :— ఆయన నాటకము వేస్తారేమో.

Sri R. B. RAMAKRISHNA RAJU :—కావాలండి. అందువల్ల తెప్పించారా అని నేను అడుగుచున్నాను.

The Hon. Sri B. GOPALA REDDI :— తెప్పించడానికి తప్పక ప్రయత్నము చేస్తాము.

Sri P. THIMMA REDDI :— అధ్యక్షా ! సంగీతకళాశాలను ఏర్పాటు చేసే పక్షంలో అది సంగీతంలో వెనుకబడిన ప్రాంతాలలో పెట్టడానికి ఏర్పాటు చేస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI:—ఇది dramatic hall విషయం కాని, సంగీతము విషయముకాదు. ఎక్కడ అభిరుచి ఎక్కువగా ఉన్నదో అటువంటి వాతావరణము ఉన్నచోట్ల పెడితే బాగుంటుంది అని ప్రభుత్వ అభిప్రాయము.

Sri PRAGADA KOTAIAH :— నాటక కళతోబాటు, తోలుబొమ్మల ఆట కూడా ప్రోత్సహిస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI :— Folk dances, folk songs అన్నిటినీ encourage చేయాలని ఉన్నది.

3rd August 1955]

*Audit of the Accounts of National Extension Service Blocks.*

329—

*1087 Q.—Sri PRAGADA KOTAIAH :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the steps taken to audit the accounts of the National Extension Service Blocks ?

The Hon. Sri K. VENKATA RAO :– One Accounts Officer has been appointed for maintaining accounts relating to Community Projects, Community Development and National Extension Service Blocks. He is auditing the accounts of the National Extension Service Blocks.

Sri PRAGADA KOTAIAH :– అధ్యక్షా ! ఈ accounts ఇంతవరకు ప్రారంభం కాలేదని చాలా దుబారాగా జరుగుతున్నదని వదంతి ఉన్నది. ప్రభుత్వం ఈవిషయములో ఏమి జోక్యము కల్పించుకుంటుంది ?

The Hon. Sri K. VENKATA RAO :— వదంతులు మాదాకా అందలేదు. కోటయ్యగారు ఆ రకంగా జరుగుచున్నదని రుజువుచేస్తే తప్పకుండా ప్రభుత్వం విచారణ చేస్తుంది. Audit మాత్రము జరుగుతుంది.

*Road from Parvathipuram to Narayanapatnam.*

330—

*606 Q.—Sri P. GUNNAYYA :– Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

[a] whether the Government are aware of the fact that the road from Parvathipuram to Narayanapatnam is in a bad condition; and

[b] if so, whether the Government proposed to entrust the repair and maintenance of the road to the Public Works Department to be done departmentally ?

The Hon. Sri A. B. NAGESWARA RAO —

(a) The answer is in the affirmative.

(b) The matter is under consideration.

(a) రోడ్డు బాగాలేనిమాట నిజము.

(b) ప్రభుత్వాలోచనలో వున్నది.

[3rd August 1955

*Stoneware Factory.*

331—

*1090 Q.—Sri SHAIK MAHAMMAD RAHMATHULLAH:- Will the Hon. the Minister for Planning and Industries be pleased to state where the proposed Stoneware factory will be located ?

The Hon. Sri K. VENKATA RAO:- A factory for the manufacture of stoneware pipes will be located at Rajahmundry.

337—Sri SHAIK MAHAMMAD RAHMATHULLAH:–ఇంతకు ముందు సం॥లలో ఒక Stone ware factory పెట్టవలెనని Cyramics department వారు investigation చేశారు. అదిఏమైనది.

The Hon. Sri K. VENKATA RAO:— వేరే ప్రశ్న వేయండి.

## II. HALF-HOUR DEBATE REGARDING

*Assignment of Banjar Lands.*

Mr. SPEAKER:— The hon. Member Sri P. Sundarayya wants a half-hour debate regarding assignment of banjar lands. We will have the debate tomorrow at 6.00 P. M. after the debate on Planning is over.

[Note:—An asterisk *at the commencement of a speech indicates revision by the Member.]

## III. GOVERNMENT MOTION. Re:

*Second Five Year Plan for the State of Andhra.*

The Hon. Sri K. VENKATA RAO:—Mr. Speaker, Sir, I beg to move :

"That the draft proposals of the Second Five year Plan for the State of Andhra be taken into consideration."

Sri B. RAMAKRISHNA REDDI:—On point of order, Sir మంత్రిగారు ఇచ్చిన informationలో ఒక్క మొత్తము ఉంది గాని detailed గా లేదు. 230 కోట్లుగల plan Centre కు పంపించాలి అని చెప్పారు గాని (irrigation 78 కోట్లు, electricity 40 కోట్లు అని యిచ్చారుగాని) మాకు detailed గా plan లేక పోయినప్పుడు ఎట్లా discuss చేయాలో మాకు తెలియడంలేదు. అక్కడనుంచి తాలూకా plans, village plans జిల్లా plans పంపించారు. ఆతర్వాత provincial లో కూడ వీరు ఆలోచించారు. Centre కు వీరు ఆ ప్లాన్సు పంపించేముందు మాకు కూడా detailed information ఇవ్వాలని కోరుతున్నాను.

Mr. SPEAKER:—There is no point of order. You want some information. As we proceed on with the debate you will understand what the plan is.

The Hon. Sri K. VENKATA RAO :—వారికి కావలసిన సంజాయిషీ తయారు అయినప్పుడు పంపబడుతుంది. భారతదేశానికి స్వరాజ్యము ప్రపంచములో యితర రాజ్యాలలో వచ్చిన విధానములో గాక నూతనమైన మార్గంలో వచ్చిన సంగతి అందరికి తెలిసిందే. ఈ నూతనమైన మార్గము కీర్తిశేషులైన బాపూజీ మనకుచూపించారు. కాని మనదేశానికి స్వాతంత్ర్యము రావడముతో మనదేశము అంతా స్వర్గతుల్యము అయినదని అనుకొనేటటువంటి పరిస్థితులు ఏర్పడలేదు. భారతదేశము విచ్ఛిన్నమైనది. అంతే కాకుండా దేశము అంతా దారిద్ర్యము ప్రబలి ఉన్నది. అంతే కాకుండా దేశాన్ని ఎదుర్కొని అనేకమైన ఆర్థిక సాంఘిక సమస్యలు వెల్లివిరివిగావున్నవి. కాని యిటువంటి పరిస్థితులలోనుంచి మనదేశాన్ని సాంఘిక ఆర్థిక అభ్యుదయమునకు తీసుకువెళ్ళే యత్నము చేయవలసినటువంటి ధర్మం మరి నూతనంగా ఏర్పడినటువంటి భారతదేశ స్వతంత్ర ప్రభుత్వముపై ఉన్నది. అన్నిటికంటె ముఖ్యముగా అంతవరకూ కూడ పరదేశ పరిపాలకులు ఈ దేశాన్ని ఎక్కువగా police State క్రింద అట్టిపెట్టిరి. దీన్ని శ్రేయోరాజ్యంగా మార్చుకొనే బాధ్యతకూడా కొత్త ప్రభుత్వాల మీద పడింది. 1950 సం॥లో మన దేశానికి నూతన రాజ్యాంగ విధానము ఏర్పాటు చేసుకొన్నప్పుడు ఆ రాజ్యాంగ విధానములో మనము కొన్ని పునాది సిద్ధాంతములను జన్మసత్వ హక్కులను నిరూపించు కోవటమే కాకుండా రాజ్యాంగముయొక్క పరిపాలన ఏమార్గముమీద జరగాలనే విషయాన్ని కూడా directive principles క్రింద నిరూపణ చేసుకొని ఉన్నాము. ఆ directive principlesను మన Constitutionలో ఉన్నటువంటి ఇతర వ్యవహారములను దృష్టిలో పెట్టుకొని యీ దేశముయొక్క భావిస్వరూపము నిర్ణయించే బాధ్యత మనపైన పడింది. అంతేకాకుండా ఊరికే రాజ్యాంగ చట్టము పెట్టుకుంటే లాభములేదు. దానిలో కొంత స్వరూపము కల్పించాలి. దానికి అలంకారము చేయడమే కాకుండా దానిలో బలము పుష్టి కల్గించుకొని దానియొక్క అందుబాటును మామూలు ప్రజలదగ్గరకు తీసుకు రావలసిన అవసరము కూడా ఏర్పడవలసి వచ్చింది. ఈ సమస్యా పరిష్కార విషయములో మన దేశములో చాలా యత్నములు జరిగినవి. ఈసంగతి మనకు తెలిసినదే.

మన పుణ్యవశాత్తు యీ దేశానికి నాయకుడుక్రింద గొప్ప భావాలు కలిగినటువంటి, ఆ భావాలను ఆచరణ రూపంలో పెట్టడానికి అనంతమైన శక్తి కలిగినటువంటి నాయకుడు పండిట్ జవహర్లాల్ నెహ్రూ మనకు లభించాడు. వారి యొక్క ఆధ్వర్యంక్రింద మనం మొట్టమొదట పంచవర్ష ప్రణాళిక తయారు చేసుకున్నాం. ఈ పంచవర్ష ప్రణాళిక రూపాన్ని తయారు చేయడములో ప్రపంచంలో యిదివరకు పంచవర్ష ప్రణాళికలు తయారీలో అవలంబించిన పద్ధతులను గాని ఆర్థిక సాంఘిక పురోభివృద్ధిలో అవలంబించినటువంటి మార్గాలుగాని పూర్తిగా పండిట్జీ ఈ దేశంలో అవలంబించలేదు. మనకు ఎదురుగా రష్యావున్నది; చైనావున్నది; అమెరికా వున్నది; ఇంగ్లండు వున్నది; ఇంకనుఅనేక దేశాలున్నాయి. కాని నెహ్రూ ఒక నూతన పంథాను గాంధీగారిలాగే ఏర్పాటు చేశారు. ఆ దేశాలలో అవలంబించినట్టి పద్ధతులు మనసంస్కృతికిగాని, సంప్రదాయంకుగాని ఉపయోగించనటువంటి సందర్భంలో ఈనూతనమైనటువంటిపద్ధతిని ఆయన అవలంబించవలసివచ్చింది.

ఈ పద్ధతి నిర్ణయించుకోవడంలో ఆయన అనేక శతాబ్దాల పాతచరిత్రనూ భావిలోవచ్చే నూతనరూపంలో తనకున్నటువంటి అనంతమైన విశ్వాసాన్ని కూడా ప్రకటించారు. నేను తమకు మనవిచేశాను—స్వరాజ్యంవచ్చినా దేశం స్వర్గధామం కాలేదని. దేశంలో మన రాజ్యాన్ని మనం హస్తగతం చేసుకున్నప్పుడు దేశంలో, తిండిలేమి కావలసినంత వున్నది. భారతదేశంలోలేదు. Rationing అన్ని చోట్ల వున్నది. అనేక మయినటు వంటి వుత్పత్తి కావలసిన పదార్థాల విషయంలో controls వున్నాయి. అంతే కాకుండా దేశం అంతటా ఎక్కువగా నిరుద్యోగం, వున్న వుద్యోగులకు పూర్తిగా పనిలేకపోవడం మనవారసత్వంక్రిందవచ్చి యీ దేశంలో ఏర్పడివున్నాయి. అందుచేత ఆయన యిటువంటి పరిస్థితులలోనుంచి భారతదేశాన్ని ముందుకు తీసుకొని వెళ్ళాలనే సంకల్పముతోటి ఆయన కొన్ని నిరంకుశత్వ అధికారాలు కలిగినటువంటి పద్ధతులకును laissez faire అంటే తనంతట తానే ఆర్థిక ప్రతిపత్తి కలిగినటువంటి పద్ధతికిమధ్యే మార్గాన్ని అవలంభించారు. అందువలన మనదేశానికి మొట్టమొదట ఏర్పడినట్టి పంచవర్ష ప్రణాళికయొక్క భావాలన్నీకూడా మనం యిదివరకే అర్థం చేసుకున్నాం. ఆ పంచ వర్షప్రణాళికయొక్క భావాలు ఏమిటంటే జనంయొక్క జీవనపరిమాణాన్ని ఎక్కువగా పెంచడం. రెండు, వివిధరూపాలతోటి దేశంలో నివసించిన ప్రతి పౌరుడూ కూడా తన యొక్క జీవితాన్ని సంస్కరించుకోవడం, తరువాత దేశంలో నున్నటువంటి మనుజ సంపత్తిని, ద్రవ్యసంపత్తిని, వీటన్నిటిని వినియోగించుకుని ఎక్కువగా కావలసినటు వంటి పదార్థాలను ఉత్పత్తిచేసుకోవడం, దేశంలో పరిపాలన ఎక్కువగా అమలులోకి తీసుకురావడమున్నూ. అంతే కాకుండా ధనం విషయంలో ఆదాయం విషయంలో అవకాశం విషయంలో వీలయినంతవరకు అందరికీ సమాన అవకాశాలు కల్పించడం, ఇవన్నీ కూడా మొదటి పంచవర్షప్రణాళిక ఆదర్శముల క్రింద ఏర్పడినవి. మన దేశంలో ఉత్పత్తి శక్తి చాల తక్కువగా ఉన్నది. దేశంలో వ్యవసాయకంగా వుండేటటువంటి భూముల holdings యొక్క పరిమితి చాలా స్వల్పంగా వున్నది. దేశంలో వున్న కుటీరపరిశ్రమలు కొంచెం హెచ్చు తక్కువగా నశించిపోయాయి. నేను యిందాక చెప్పినట్టు నిరుద్యోగసమస్య ఎక్కువయినది. ఉన్నట్టి ఉద్యోగులనెవరినైనా మారుద్దామా అంటే మార్పు తీసుకువచ్చే పరిస్థితి కూడా దేశంలోలేదు. వ్యక్తులకు వచ్చేటటువంటి ఆదాయము అతి స్వల్పముగా నున్నది. మొట్టమొదటి పంచవర్ష ప్రణాళికలో 2 వేల పైచిలుకుకోట్లు పెట్టుబడిక్రింద పెట్టాము. ఈ రెండువేలకోట్ల పైచిలుకు పెట్టుబడి వచ్చే మార్చి నెలాఖరుకు పూర్తికావలసి వున్నది. చాలవరకు ఖర్చుపెట్టగలుగుతామని, short fall అతి స్వల్పంగా వుంటుందని మనం ఆశిస్తున్నాము. ఇంకా ఏమయినా, మనకు కావలసిన పెట్టుబడి, సరిపోయినటువంటిది అప్పులరూపంలోగాని, ఆదాయం రూపంలోగాని, యితర దేశాల సహాయం రూపంగా గాని ఏర్పడకపోయినట్లయితే ఆ లోటును deficit finance వల్ల పూర్తిచేసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఈ deficit finance గురించి చివర మళ్ళీ తిరిగి మాట్లాడుతాను. ఇప్పుడు అంతా పనిచేసినతరువాత మొట్టమొదటి పంచవర్షప్రణాళికలో ప్రధానమైనటువంటి స్థానం వ్యవసాయంకు మనం యిచ్చాం. మిగిలిన వాటికి ద్వితీయ, తృతీయ వగైరా స్థానాలు లంభించాయి. ఇప్పటికి 4 సంవత్సరాల 6 మాసాలు పూర్తిఅయినవి. కనుక దీనియొక్క ఫలితం ఏమి జరిగిందో ఆలోచించుకోవచ్చు. ముందుకు వెళ్ళేముందర మనకు ధాన్యా

3rd August 1955] (Sri K. Venkata Rao)

దుల యొక్క ఉత్పత్తి పెరిగింది. Rationing పోయి ఆహార పదార్థాలు చాలా మందికి అందుబాటులోకి వచ్చాయి అని మనం సగర్వంగా చెప్పుకోవచ్చు. అంతే కాకుండా దేశంలో నున్న పారిశ్రామిక ఉత్పత్తి 1951 కంటె 40% యిప్పుడు అధికంగా పెరిగింది. ఎక్కువగా దేశంలో Irrigation Project లు electricity వగైరా ప్రాజెక్టులు తయారైనవి. Community Development Blocks Community Projects, National Extension Services, యీ మూడూ కూడా దేశంలో ప్రవేశపెట్టబడి చాలా భాగానికి అప్పుడే అమలులోకి వచ్చాయి. దేశంలో 12 పరిశోధన కేంద్రాలు స్థాపించబడ్డాయి. చిత్తరంజన్ లో దేశంలో సాలుకు 100 ఇంజన్లు తయారుచేస్తున్నారు. ఇంక రోజుకు ఒక engine చొప్పున తయారు చేయడానికి ఏర్పాట్లు వారు చేస్తున్నారు. సింద్రిలో 3 లక్షల 60 వేల టన్నుల ఎరువులు ఉత్పత్తి చేసే factory స్థాపించారు. రోజుకు ఒక వేయి టన్నుల ఉత్పత్తి కొనసాగుతున్నది. తరువాత మనయొక్క రైల్వేలలో ప్రయాణ సౌకర్యాలు చాలా కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి అభివృద్ధిలోకి తీసుకువచ్చారు. మొత్తం వాటిమీద వచ్చే ఆదాయం 2,300 కోట్ల రూపాయలకు పెరిగింది. ఈ దేశీయ పరిశ్రమలు ఆరంభించే విషయంలో పెట్టుబడి చాలవరకు ఎక్కువ అవుతుంది. సాలుకు 200 కోట్లు యిదివరకంటే యిప్పుడు 400, 600 వరకు పెరిగింది. ఇవన్నీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు శుభచిహ్నాలుగా మనం తీసుకోవాలి. ఆంధ్రకు మొట్టమొదట పంచవర్ష ప్రణాళిక అని లేనేలేదు. దానికి కారణం పంచవర్ష ప్రణాళిక తయారుచేసిన నాటికే ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా లేకపోవడమే. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మొట్టమొదట పంచవర్ష ప్రణాళిక తయారైనది. 1953 October లో మన రాష్ట్రం వేరుపడినప్పుడు ఆంధ్రజిల్లాలలో ఆ పంచవర్ష ప్రణాళికలో ఏ ఏ పనులు ఏర్పాటు అయి వున్నవో అవే మనకు పంచవర్ష ప్రణాళిక క్రింద ఏర్పాటయినది. ఒక సిద్ధాంతం మీద మనంతటమనం ఏర్పాటు చేసుకున్నట్టిది ఆంధ్రకు లేకుండా పోయింది. ఆవాటా క్రింద మనకు వచ్చినటువంటి మొత్తం 54 కోట్ల రూపాయలు. తరువాత యీ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఆంధ్ర ప్రభుత్వం ఢిల్లీ ప్రభుత్వంతో సంప్రదించి తిరిగి 16 కోట్ల రూపాయలు తెచ్చుకోగల్గింది. ఇవన్నీ పెట్టడం వల్ల తుంగభద్ర project పూర్తి కావడం, Machkhund పూర్తయి యింకో 15 రోజులలో అది అమలులోకి వచ్చే పరిస్థితి వగైరాలువచ్చాయి. ఈవివరాలన్నీకూడా తమకు ఇచ్చిన draft Second Five Year Plan 10వ పేజీ 11వ పేజీ, 12వ పేజీలలో వున్నాయి. కనుక తమకు పునరుచ్చారణ చేయవలసిన అవసరం లేదనుకుంటాను. ఇవ్వాళ యీ పరిస్థితులల్లో మనం యీ రెండో పంచవర్ష ప్రణాళికను ఎదుర్కోవలసి నటువంటి పరిస్థితి ఏర్పడింది. కాని-ఒక విషయం సంతోషదాయకం. ఏమిటంటే, 1951 సంవత్సరములో దేశాన్ని ఆవరించి వున్నటువంటి ప్రత్యేకమైన కష్టాలు యివ్వాళలేవు. ఇవ్వాళ మనం మంచి పరిస్థితులలో నూతనమయిన ఆదర్శముతో వ్యవహారం చేసుకోవచ్చు. అటువంటి physical improvements కాకుండా ఆదర్శ పూర్వకంగా దేశంలో క్రొత్తభావాలు వచ్చాయి. గత కాంగ్రెసులో భారతదేశ ఆదర్శం Socialistic Pattern of Society అని మనం నిర్ణయంచేశాము. ఆ నిర్ణయంవల్ల యిప్పుడు రెండో పంచవర్ష ప్రణాళిక మనం అమలులోకి తీసుకువచ్చే పరిస్థితి ఏర్పడింది. అందుచేత మనం కొంచెము

(Sri K. Venkata Rao) 3rd August 1955

మంచి అభివృద్ధి చెందినటువంటి ఆర్థిక సాంఘిక పరిస్థితులే కాకుండా ఆదర్శప్రాయమైన పరిస్థితులు మనం కల్పించుకోవడంవల్ల ఒక సమగ్రమైనటువంటి రూపం ఆంధ్రరాష్ట్రంలో ఏర్పడుతుంది. ఉత్పత్తి ఎక్కువ చేసుకోవడం, ఎక్కువమందికి ఉద్యోగం కల్పించడానికి తరువాత దేశంలోవున్న ఆర్థిక అసమానత్వాన్ని వీలయినంతవరకు తొలగించే వ్యవహారం మనం తీసుకురావలసి యున్నది. కాని ఒక విషయం మనందరం ఆలోచించుకోవలసినది, ముఖ్యమయినది ఏమిటంటే దేశంలో పారిశ్రామిక అభివృద్ధి 40 per cent పెరిగినా, దేశం మొత్తంమీద దానివల్ల ఎక్కువమందికి ఉద్యోగాలు లభించలేదు. Unemployment problem ఎక్కువ industrial production వల్ల solve కాలేదు. ఉన్నటువంటి జనాభాలో 1/100 వంతుకు తక్కువగా ఉద్యోగావకాశాలు లభించుతున్నవి. మిగిలినవారికి లభించలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రధానంగా యీ విషయాలు దృష్టిలో పెట్టుకోవలసిన ఆవశ్యకత ఏర్పడుతోంది. ఇప్పుడు తమకు యిచ్చినటువంటి గ్రంథంలో మొట్టమొదట చూచేవుంటారు, రెండవపంచవర్ష ప్రణాళికయొక్క ప్రధానమైన ఆదర్శాలు ఏమిటో మొట్టమొదటి ఆదర్శం మనయొక్క మొత్తం జాతీయ ఆదాయమును పెంచుకోవడము. ఇప్పుడు 10 వేలకోట్ల రూపాయలుంటే దానిని 13, 14 వేల కోట్ల రూపాయలకు పెంచుకోవడం ఒక ఉద్దేశ్యము. రెండోది మనం ముఖ్యంగా పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించుకుంటూ వాటిని అభివృద్ధిలోకి తీసుకురావడం—అది ఒక ప్రత్యేకత. మూడోది ఎక్కువమందికి ఉద్యోగాలు కల్పించడము. నాలుగోది social justice. దేశంలో వున్న అసమానత్వం సాధ్యమయినంతవరకు తొలగించి అందరికి సమానమయినటువంటి అవకాశాలు కల్పించేయత్నం మనం యీ పంచవర్ష ప్రణాళిక ద్వారా చేయుడానికి ప్రయత్నిస్తున్నాము.

ఇప్పుడు మనకు కావలసింది, ఆంధ్ర రాష్ట్రములో మనయొక్క పరిస్థితి. ఆంధ్ర రాష్ట్రము 63 వేల చదరపు మైళ్ళ విస్తీర్ణము కలిగియున్నది, రెండు కోట్ల పైచిలుకు జనాభావుంది. భారతదేశము మొత్తము వైశాల్యములో 5వ వంతు, మొత్తముజనాభాలో 18 వ వంతు, దేశం మొత్తముమీద వున్నటువంటి నీటి వనరులలో మనకు 100 కి 15 వున్నాయి. అంటే మన రాష్ట్రం వైశాల్యముకంటె మన జనాభాకంటె కూడా నీటి వనరుల పరిస్థితి చాలా బాగుంది అన్నమాట. ఆంధ్రదేశములో 100 మిలయన్ acre feet of water ప్రతి సంవత్సరము లభిస్తుంది. Acre feet అంటే ఒక ఎకరముమీద ఒక అడుగు ఎత్తున నీరునుగనుక నిలబెట్టినట్లయితే దానిని Acre feet అంటారు. అంటే వేయిలక్షల ఎకరాల విస్తీర్ణముపై ఒక అడుగు ఎత్తు నింపగలిగిన నీరు ఆంధ్రదేశములోని నదులలో గాని ఆంధ్రదేశంలో వున్న నూతులలో గాని చెరువులలోగాని వానలవల్లగాని మనకు లభిస్తుందిఅన్నమాట. కాని యింతవరకు మనము నదులలోని నీరును 100 కి 20 వంతులు చొప్పున అంటే 5 వ వంతు మాత్రము వినియోగించు కుంటున్నాము. మిగిలినదంతా సముద్రములోనికో భూమిలోనికో వెళ్ళిపోతోంది. ఈ నీటిని గనుక మనము వినియోగించు కున్నట్లయితే యిందులో చాల భాగము మన నీటివనరులుకలిగిన పంటపండే ఎకరాలను ఒకకోటిఎకరాలు చేసుకోవచ్చును. అంతేకాకుండా 5 లక్షల కిలోవాట్స్ electricity ని మన దేశములో యీ నీటి వల్ల ఉత్పత్తి చేసుకోవచ్చును. 16 వేల గ్రామాలలో 100 కి 2-కి మాత్రము విద్యుచ్ఛక్తి ఇప్పుడు మనకు వుంది. లెక్కవేసి చూస్తే భారతదేశములో సగటున మనిషికి 14

కిలోవాట్స్ వుంటే మన ఆంధ్ర రాష్ట్రములో మనిషికి 5 kilo-wats మాత్రము వుంది. అందుచేత ఇవన్నీ మనస్సులో పెట్టుకుని తమరు పుస్తకాన్ని పరిశీలించవలసిందని నా కోర్కె. ఇదే ఆంధ్రరాష్ట్రానికి మొట్ట మొదటిలో లభించినటువంటి సదవకాశము. మనయొక్క ఆర్థిక రాజకీయ సాంఘిక పరిస్థితులను అభివృద్ధి చేసుకొనేందుకు మొట్ట మొదటి సాటిగా లభించినది. ఎందుకంటే క్రిందటిసారి మనము పంచవర్ష ప్రణాళికను తయారు చేసుకోలేదు గనుక. ఈ పరిస్థితులలో అంకెలను బట్టే గాక మన యొక్క ప్రత్యేక పరిస్థితులను గుర్తులో పెట్టుకొని ఇండియా ప్రభుత్వమువారు మన planning కు కావలసినటువంటి అవకాశాలను కల్పింప చేయవలసిందని మనము ప్రత్యేకంగా వాదింప వచ్చును. అటువంటి వాదనకు తమ అందరియొక్క ఆమోదము వుంటుంది అనే నేను అనుకుంటున్నాను. మీరు మూడవ పేజీ గనుక తీసి చూచుకున్నట్లయితే ఈ priorities దేనికివ్వాలో ఎంతెంత చేయాలనే విషయము తమకు కనిపిస్తుంది. ఈ సందర్భములో ఇంకొక విషయము తమకు మనవి చేయవలచుకొన్న దేమిటంటే మన ఆంధ్రరాష్ట్రములో తయారైనటువంటి plan అఖిల భారత planning కమిషన్ వారిచ్చినటువంటి నిర్ణయాల ప్రకారము తూచా తప్పకుండా తయారు చేశాము. ప్రత్యేకంగా ఈ విషయములో ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ప్రతి గ్రామమునుంచి కూడా మనము plans తెప్పించాము. భారతదేశములో ఎన్ని రాష్ట్రాలలో యీలాగు తెప్పించారో మనకింకా తెలియదు. మనకు వచ్చిన private information ప్రకారము చాలా రాష్ట్రాలు యీరకంగా పనిచేయనట్టు కనిపిస్తుంది. దీనిని ఇంగ్లీషు భాషలో planning from grass roots అంటారు. గడ్డివేరులనుంచి plan తయారు చేయడమన్నమాట. అంటే అట్టడుగునుంచి పైకి తీసుకరావడము. ఇక్కడ కర్నూలులో కూర్చొని Irrigation కు 10 కోట్లు ఇంకొక దానికి 10 కోట్లు అని చెప్పి లెక్కలు వేయకుండా ప్రతి గ్రామానికి ఏవేవి కావాలో ఏ అవకాశాలు కావాలో ఏ ఏ ఉత్పత్తి విధానాలు కావాలో ముఖ్యంగా గ్రామముయొక్క అభివృద్ధి పథకాలు తయారుచేసుకునే హక్కు తీసుకెళ్ళి ప్రతి గ్రామములో పెట్టాము. మనమొక statement యిచ్చి ఒక అచ్చుపుస్తకములో అన్ని విషయాలు చెప్పి మీకు ఏమేమి కావాలో ఆ విషయాలన్నీ ఈ పుస్తకములో వ్రాసి పంపమన్నాము. నేనీ సందర్భములో గౌరవ సభ్యులకు ఒక మనవి చేస్తున్నాను. 16 వేలు ఈ plan యొక్క కాపీలు ఇప్పుడు Secretariat లో ఒక ప్రత్యేకమైనటువంటి room లో పెట్టాము. తాలూకా plans క్రింద జిల్లా plans క్రింద ఎలా intigrate చేశామో రాష్ట్రమొత్తముమీద యీ పద్ధతి ఎలా కొనసాగించామో సాగించ బోతున్నామనే విషయాలు అన్నీకూడా ఒక చిన్న exhibition క్రింద అక్కడ పెట్టాము. గౌరవ సభ్యులు వెళ్లి దానిని తప్పకుండా చూచి జరిగినటువంటి పనిని ఆమోదించడమో విమర్శించడమో చేయవలసివున్నదని చెప్పి నేను కోరుతున్నాను. ఈ వేళనుండి మీరెప్పుడైనాసరే ఇంటికి వెళ్ళే లోపున మాత్రము తప్పకుండా చూచి వెళ్ళవలసిందని నా కోరిక. Secretariat లో Home Department room ప్రక్కనే వుంది. దానిని కమిటీ room అంటారు. మొన్న మనకు meeting కూడా ఐంది. మిగిలినవారందరిని రమ్మని కోరుతున్నాను. Speaker మహాశయులు కూడా ఒక్కసారి వెళ్లి చూడవలసి యున్నదని నా కోరిక. ఇది అంతా మీరు చూస్తే సలహాలు బాగా యివ్వగల్గుతారు. లేకపోతే మేమిచ్చిన 80 పేజీల

పుస్తకము పంచుకొనేటప్పుడో లేచినప్పుడో చూచి దానిలో ఇది లేదు, దీనిలో ఇది లేదు అనే విమర్శలోనికి దిగవద్దని నాకోర్కె. వెళ్లి చూడండి. మీమీ constituency లో నుంచి ఏ ఏ పూరునుంచి ఏమేమి అడిగారో మీకు తెలుసా ? ఆ list వ్రాసుకొన్నారా ? మేము దీనిలో ఎంత పెట్టామో చూశారా ? పెట్టడానికి వీలు ఏలాగో మీరు సలహా చెప్తారా ?

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :— Point of order Sir, ఇదివరకే తమరు సెలవు యిచ్చివుంటే ఇదివరకే చూచివచ్చి వుందుము. అప్పుడు విమర్శించడానికి బాగుండును. ఇదివరలో తాము సెలవు యివ్వలేదు. అందుచేత ఇంకొక గోజు సెలవు యిప్పిస్తారా ?

Mr. SPEAKER :— ఏముంది Point of order అందులో.

The Hon. Sri K. VENKATA RAO :— Order ఏలాగులేదు. కానివ్వండి గౌరవనీయ సభ్యులు నాదగ్గరకు ఒక పదిమాట్లు వచ్చారు. ఒకసారి ప్రక్కకు వెళ్లితే కనిపించేవుందును. అంతేకాదు. అసలు విషయాల గురించి ముందు చెప్పబోతున్నాను. ఈవేళ మనమివంతా ఎలాతయారు చేశామో చెప్పుతున్నాను. దీనిని ఢిల్లీకి పట్టుకవెళ్ళాలి. ఢిల్లీలో చర్చించాలి, చర్చించిన తర్వాతేమో ఏకాకింత యిచ్చామ, ఈరకంగా ఖర్చుపెట్టుకోండని చెప్తూతారు. అప్పుడు యీ plan అంతా ఇంకొక స్వరూపములోనికి తీసుకరావాలి.

ఇది మంచిసమయము రాజాగారు శ్రద్ధ పుచ్చుకొనేఅందుకు. ఒక 15 రోజులు యీ పూరిలో మకాముచేసి వారి constituency యే కాకుండా మిగిలినవాటిని చూచుకొని నా constituency విషయములో కూడా పూర్ణమైన సలహా రాజావారు తెప్పిస్తారని నేను ఆశిస్తున్నాను. తర్వాత యీ జిల్లా Plans అన్నీ కూడా ఏలాగు integrate చేశాగో 4-వ పేజీలో 2-వ para లో చూడవలసిందని కోరుతున్నాను. మన plan మొత్తము మీద ఒకే ఏకైనటువంటి ఆశయముతోటి ఒకే దృక్పథముతోటి దేశము మొత్తముమీద యీ ఆర్థిక సౌష్ఠవాన్ని సాంఘిక సౌష్ఠవాన్ని పెంపొందించే టటువంటి దృష్టితోటే మన ఆంధ్ర plan తయారుచేశాము. అది తమరు సమగ్రంగా విచారించవలసి యున్నదని నా కోర్కె. ఇంతేకాకుండా మన plan లో 5-వ పేజీ 4-వ item లో చూడండి. అక్కడ కొన్ని supporting policies అడిగాము. అంటే ఏమిటి పూరికే అంకెలువేసి గాలికి వదలివేస్తే ఏమి లాభములేదు. దీనిని అమలులో పెట్టాలంటే ఇంకా కొన్నిపనులు కూడా చేస్తేనే యిందులో చాలవరకు అమలులోకు వస్తుంది. వీటిని supporting policies అంటారు. అవేమో 5-వ పేజీలో వున్నాయి. అందులో ముఖ్యమైనవి మనవిచేస్తున్నాను. మనయొక్క వ్యావసాయక పదార్థాలకు ధరలు స్థిరపడాలని, రెండవది మనయొక్క ముడిపదార్థాలను పంటలను విదేశాలకు ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేసుకొనే సౌకర్యాలు యివ్వాలని, తర్వాత రాష్ట్రములో భూసంబంధమైనటువంటి సంస్కరణలు కొన్ని తీసుకరావాలని, తర్వాత Co-operative movement, సహకార విధానంలో, 100-కి ఆరుగురికి మాత్రమే అప్పు లభిస్తుంది, ఇంకా ఎక్కువమందికి లభించేటట్లు ఆవిధానాన్ని అమలులోనికి తీసుక

3rd August 1955]  (Sri K. Venkata Rao)

రావాలని రాష్ట్రమందు N.E.S. blocks ఎక్కువగా పెట్టాలని, నందికొండవగైరా పెద్ద ప్రాజెక్టులనే కాక మధ్యతరగతి చాలా ప్రాజెక్టులను కూడా దేశములో పెట్టే యత్నము చేయాలని, electricity కి ప్రత్యేకమైన సహాయము చేయాలని, పరిశ్రమలు - పెద్ద వాటిని, చిన్నవాటిని, కుటీర పరిశ్రమలను ప్రోత్సహించాలని, తర్వాత communications, road development వగైరాలు ప్రత్యేకంగా జరపాలని వున్నది. ముఖ్యమైన విషయమేమిటంటే కేంద్ర ప్రభుత్వమువారు మనకిచ్చే grants వగైరా లున్నాయి. అవి ఒక స్థిరమైన విధానముక్రింద యీ ఏటికి 10 యిస్తే రేపటికి 20 యిస్తే పై ఏడు 5 యిస్తాననకుండా ఎంత వస్తుందో ఒక స్థిరమైనటువంటి నిర్ణయరూపకముగా Central aid రావాలనేది ముఖ్యమైనది. తర్వాత వారి పన్నులలో కొన్ని Finance కమిటీవారు యిచ్చిన ప్రకారము ఆ resources ను ప్రతిఏడు మనకు పంచిపెట్టుతారు. అది ఒక సిద్ధాంతిముమీద ఏర్పడినట్టు మన వాటా మనకు యిచ్చే టటువంటి ఏర్పాటు చేయవలసియున్నది. ఇది పరిస్థితి. ఇన్ని ఉద్దేశాలు పెట్టుకొని ఇన్ని షరతులు పెట్టి యీ విధమైనటువంటి ఆదర్శము పెట్టుకొని ఆంధ్రలో 2 వ పంచ వర్ష ప్రణాళిక తయారైంది. ఇంత ప్రణాళిక యింత స్వల్పకాలములో ప్రభుత్వము అధికారములోనికి వచ్చి 4 నెలలు ఐంది. నాలుగునెలలలోపల అంతక్రితము చేసినపని నంతా వినియోగించుకొని దీనికొక స్వరూపము కల్పించి ప్రతిగ్రామమునుంచి ఒక Plan, District Plan, తాలూకా Plan యింతేకాకుండా StateHeads of Departments తయారుచేసినవన్నీ సమీకరణచేసి వీటి కొక రూపమిచ్చి వారు చెప్పినటువంటి సిద్ధాంతాలను లోబడి మనము దీనిని తయారుచేసుకొనేందుకు రాష్ట్రములో చాలమంది సహాయము చేశారు. అధికారేతరులు, ఎక్కువగా అధికారులు కూడా తోడ్పడ్డారు. వారికి నేను ప్రభుత్వము తరపున కృతజ్ఞత సమర్పించవలసియున్నది.

ముఖ్యంగా నా అదృష్టం ఏమోకాని, నేను Minister ఐనప్పుడల్లా నాకు మంచి సెక్రటరీలు దొరకుతున్నారు. నేను Revenue Minister గా ఉన్నప్పుడు అప్పుడు మంచి Revenue Secretary, Law Secretary దొరికి ఒక మంచి సంస్కరణ తీసుకు వచ్చేటటువంటి సహాయం వారు ఆరోజులలో చేశారు. అప్పుడు కూడా శాసనసభలో ఆ విషయం నేను చెప్పాను. ఇప్పుడు మళ్ళీ తిరిగి నాకు మా సెక్రటరీ, ఇతర department లలో యున్న సెక్రటరీలు, Provincial Heads Departmental Heads, జిల్లా కలక్టర్లు ఇంకా చాలామంది ఉద్యోగస్థులు, మా ఆఫీసు staff వీరంతా రాత్రింబగళ్ళు పనిచేశారు దీనికి స్వరూపం ఇవ్వడానికి. ఈ మధ్య నాకు తెలుసును మొన్న రాత్రి ఈ Book 6 గంటలకు ఇస్తానన్నాను. ముందే అనధికార్ల విషయం చెప్పానండి. తమకి అప్పుడే compliment ఇవ్వవలసివచ్చింది. మీరు ఎంతపనిచేశారో ఆ మిఠాయి ముందు మీకు పంచిపెట్టి ఇంకొకళ్ళకు పెడుతూంటం. ఈ draft second five year plan మొన్న సాయంత్రం ఇద్దామనుకుంటే రాత్రి ఒంటిగంటవరకూ press వారూ, office లో వాళ్ళూ కృషిచేస్తేగాని బైటకురాలేదు. అందువల్ల ఇటువంటి కృషి చేసిన మా కార్యదర్శి, సిబ్బంది, బైటపనిచేసినవారందరికీ కృతజ్ఞత తెలుపుతున్నాను. నా తోడి మంత్రుల విషయం కూడా చెప్పాలి. కొన్ని జమాబందీ వగైరా urgent పనులన్నీ కూడా మానేసుకుని దీనిమీదే దృష్టి పెట్టుకుని చేయడంవల్ల April 15 వ తేదీ May 15 వ తేదీ మధ్య గ్రామ plan లూ, 15 మొదలుకొని నెలాఖరులోపుగా తాలూకా plan లూ తరువాత జిల్లా plan లూ,

(Sri K. Venkata Rao) [3rd August 1955

వగైరాలన్నీ ఈవేళ ఈ సమగ్రమైన స్వరూపంలో తమ ముందరికి తీసుకురావడం జరిగింది. ఈ సందర్భంలో ఇంకొక విషయం నేను మనవిచేయవలసిందేమిటంటే ఊరికే 500 కోట్లకో, 600 కోట్లకో వచ్చింది plan, అన్ని items కూడేస్తే. కాని దానిలో అనేకం కలిసి ఉన్నాయి. ఒకటే విషయం ముగ్గురు వ్రాశారు. ఇవన్నీ సమీకరణ చేసుకోవడం, మనకున్నటువంటి స్తోమతెంత, ఆర్థికంగా దీని ప్రకారం మనం ఎంత plan వేసుకుంటే మనం Centre నుంచి తెచ్చుకోగలం, మనకి అవసరాలు ఎన్నున్నాయి, వీటినన్నిటినీ సమీకరణచేసి ఈ స్వరూపంలోకి తీసుకురావడం జరిగింది. అందువల్ల నేనిప్పుడు తమకు మిగిలిన విషయాలు మనవిచేస్తున్నాను.

13 వ పేజీలో ఈ state plan యొక్క outline అంతా సమగ్రంగా వ్రాయబడింది. అది నేను తిరిగి చదవదలచలేదు. ఎందుకంటే మీకు ఎక్కువకాలం పట్టకు ఇవ్వాలనే ఉద్దేశ్యంతో నా ఉపన్యాసం ఎంత కుదిమట్టం చేసుకోవాలో అంతా చేసుకునేందుకు యత్నం చేస్తున్నాను. 13 వ పేజీలో ఉన్నవి తమరు పరిశీలించవలసినదని కోరుతున్నారు. తరువాతి విషయం ఏమిటంటే మేము అక్కడ వేసినటువంటి అంకెలు కొన్ని మారాయి. ఇదివరకు దరిదాపు 230 కోట్ల రూపాయిలకూ అనగా 229 కోట్ల పైచిలుకు వేసినటువంటి అంకె ఇచ్చాము (మీరు 4 వ పేజీలో చూడండి) అక్కడవివరాలన్నీ ఉన్నాయి. 13 వ పేజీలోనే totals అన్నీ ఉన్నాయి. మొత్తం 230 కోట్ల రూపాయిలకు వేసింది. మళ్ళీ దరిమిలాను పార్లమెంటుసభ్యులు advisory committee లు వగైరా అన్నిటితో సంప్రతించిన తరువాత department లో మళ్ళీ revise చేసుకున్న తరువాత ఈ plan ని 244 కోట్ల రూపాయిలకు పెంచాం. మీరు వేరే cyclostyle తీసిన కాగితం ప్రతి book లోనూ మీకు ఇచ్చాం. దానిలో ఆ మార్పు ఉంది. ఇందులో తమ దృష్టికి తీసుకురావడానికి చేసినటువంటి మార్పు మనవిచేస్తున్నాను. Irrigation క్రింద 6 కోట్లు ఎక్కువ కలిపాం. పరిశ్రమలక్రింద 5 కోట్లు ఎక్కువ కలిపాం. Minor ports క్రింద ఇదివరకు ఉన్నదాని కంటె 25 లక్షలు కలిపాం. Public Health క్రింద ముఖ్యంగా water supply schemes కోసమని 1½ కోట్లు ఎక్కువ కలిపాం. Publicity క్రింద 24 లక్షలు కలిపాం. Labour క్రింద క్రొత్తగా కోటి 95 లక్షలు కలిపాం. Social Welfare Board కు 25 లక్షలు కలిపాం. ఒక్కచోటే reduction ఉంది. అది scheduled areas లో 5 కోట్ల 3 లక్షలనుంచి 4 కోట్ల 76 లక్షలకు తగ్గింది. తగ్గడానికి కారణ మేమిటంటే, ఈ మొత్తాన్నంతా తీసివెయ్యలేదు. Plan లో ఇంకో Head లో తీసుకువెళ్ళి కలపడంవల్ల ఇక్కడ తగ్గింపు కనిపించింది. అదేనో soil conservation ని గురించి. అది agriculture లోనికి తీసుకువెళ్ళి కలపడమో, ఏదో జరిగింది. అందుచేత ఇప్పుడు over all plan అంతా కూడా 244 కోట్ల 43 లక్షల రూపాయలకు తయారయింది. ఈ మార్పును తమరు గమనింపవలసిందని కోరుతున్నాను. ఇంక ఇందులో ఉన్నటువంటి items అన్నింటినీ గురించి నేను మాట్లాడడం మొదలుపెడితే చాలాసేపు పడుతుంది. అందువల్ల ప్రత్యేకత ఉన్నటువంటి విషయాలను మాత్రం నాలుగైదింటిని చెప్పదలచుకున్నాను. ఇందులో ప్రధానంగా మొట్టమొదట చెప్తాను. ఆంధ్రరాష్ట్రానికి నీటివనరులు చాలమంచివి. మంచి నదులున్నాయి. గోదావరి, కృష్ణ, పెన్న తుంగభద్ర పెద్దనదులు. తరువాత నాగావళి, వంశధార, వరాహ, శారద, తాండవ, గుండ్లకమ్మ ఇట్లాంటివి 35, 36 చిన్నచిన్న నదు లున్నాయి. తరువాత ఎర్రకాల్వ, బుడమేరు, వగైరా

3rd August 1955] (Sri K. Venkata Rao)

ముంపు నదులున్నాయి. ఇంకా ఇలాంటివి చాలా ఉన్నాయి దేశంలో. వీటన్నిటినీ మనం వినియోగించుకోవడంలోనే మన ప్రత్యేకత ఉంది. ఆంధ్రరాష్ట్రానికి ఉన్నటువంటి పరిస్థితి భారతదేశంలో ఏ ఇతర రాష్ట్రానికి లేదని మనం చెప్పవచ్చు. అందుచేత ఇప్పుడీ పంచవర్షలో పరిశ్రమలనుగురించి ప్రత్యేకమైనటువంటి stress ఇచ్చినా కూడ Planning Commission ఆంధ్రకు సంబంధించి సంతవరకూ ఇంకా కొన్ని సంవత్సరాలవరకూ ఈ Irrigation ని గురించి ప్రత్యేకమైనటువంటి పరిస్థితి కలగజేయ వలసినదని చెప్పి మనం కోరవలసిన విధానం ఉన్నది. ఆ రకంగానే కూడా ఈ 244 కోట్లలో ఎక్కువభాగం ఈ irrigation క్రిందనే పెట్టడం తటస్థించింది. గత మొదటి పంచవర్ష ప్రణాళికలో మొదలు పెట్టిన scheme లు, Krishna Barrage, తైరవానితిప్ప, నాగార్జున సాగర్, రాళ్ళపాడు, నారాయణపురం, K. C. కాలువ వంటివి. అన్నీ పూర్తికాలేదు. అవి రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో కూడా మనం ఉపయోగించుకోవలసి యుంది. ఇదిగాక క్రొత్త వాటిలో పెద్దవి తుంగభద్ర ఎగువకాలువ, వంశధార ఉన్నవి. ఇప్పుడు ఒక కొత్త పేరు పెట్టాం, అన్నీ కలిపి, ఎందుచేతనంటే అన్నీ కలిపితేగాని project అవదు కనుక సిద్ధేశ్వరం, సోమశిల, గండికోట అన్నీ ఒకటే project. సిద్ధేశ్వరం వస్తేగాని సోమశిల రాదు, గండికోటా రాదు. అందువల్ల యీ మూడింటినీ సమన్వయంచేసి ఒకటే project క్రింద records లో మార్చాం. సిద్ధేశ్వరం, సోమశిల, గండికోట project, పులిచింతల, ఇంకా వచ్చే వరదను అరికట్టడంకోసం కొన్ని schemes పెట్టవలసి వచ్చింది. గోదావరి, సోమశిల, బుడమేరు, తమ్మిలేరు, ఏలూరు కాలువ, ఉప్పుటేరు, స్వర్ణముఖి వగైరా స్కీము లున్నవి. ఇవిగాక కొన్ని కోట్ల రూపాయిలు medium schemes, minor schemes కోసం పెట్టాం. అంటే ఈ చిన్న నదులమీద ఆన కట్టలు కట్టడానికి వాటివివరాలన్నీ కొంతవరకూ 38 పేజీలో 5 వ పేరాలో ఉన్నాయి. మొత్తం ఈ రకముగా irrigation క్రింద ప్రత్యేకంగా మనం దెబ్బఅడిగాం.

రెండో ముఖ్యమైనటువంటి విషయం విద్యుచ్ఛక్తిని గురించి. ఇదివరకు అమలులో యున్నటువంటి plan లు పూర్తి చేయడానికి ఇంకా 15 కోట్ల రూపాయిలు పడుతుంది. ఇది కాకుండా కొత్తగా 24 కోట్ల రూపాయలు దరిదాపుగా 40 కోట్ల రూపాయిలు రెండో పంచవర్ష ప్రణాళికలో ఖర్చు పెట్టడానికి ఏర్పాటు జరుగుతోంది; Machkund 19 వ ఆగస్టు 55 వ సంవత్సరం తారీఖున తెరుస్తారు. తుంగభద్ర 1956 లో తెరుస్తారు. Hydro electric project ల క్రింద సీలేరు, నందికొండ ముందువస్తాయి. వాటికి దీనిలో ప్రొవిజన్ ఉంది. ఇంతేకాకుండా thermal stations ఉంటాయి. ఈ hydro electricity తీసుకు వెళ్ళడానికి వీలులేని ప్రదేశాలన్నిటిలోనూ కూడా ఈ thermal stations నుంచి electricity సప్లై చేసేవీ ర్పాట్లు కూడా ఉన్నాయి. ఇవన్నీ తయారై పట్టణాలలోనే వాడిగించుకు కూర్చుంటే అంతం లేదు కనుక ఉత్పత్తి ఎక్కువ చేస్తాం. కనుక రోజుకు ఒక్కొక్క ఊరు చొప్పున వచ్చే 5 సంవత్సరాలలో అన్ని రోజులూకూడా ఒక్కొక్క గ్రామానికి electricty పంపించడం కోసం దీనిలో ఏర్పాట్లున్నాయి.

(Sri K. Venkata Rao) [3rd August 1955

తరువాత జిల్లాలవారి తాలూకాలవారి plans లేవుగాని ఒక ఆదర్శంమాత్రం ఉన్నది. ప్రతి తాలూకా సెంటర్‌కు electricity మాత్రం తప్పనిసరిగా అందుబాటులో వచ్చితీరుతుంది.

మూడవది వ్యవసాయాన్ని గురించి ఒక కమిటీ ఏర్పాటుచేశాము. ఏర్పాటుచేసినటువంటి ఈ కమిటీయొక్క వ్యవహారము గురించి త్వరలోనే ఆ రిపోర్టు వస్తుందని ఇదివరకే చెప్పిఉన్నాను. ఇప్పుడు వ్యవసాయముయొక్క అభివృద్ధికి ప్రత్యేకంగా irrigation కు కొత్త fertilizers కొత్తరకమైన seeds, Japan పద్ధతి ఇవన్నీ సరిపోవు అని నమ్మినవాళ్ళలో నేను ఒకడను. దీనికి fiscal అంటే వస్తురూపంగా ఇచ్చేటటువంటి సహాయమే కాకుండా, కొంచెము మనోరూపంగా ఉన్నటువంటి ఉద్యోగాన్ని కల్పిస్తేనేగాని చేసినదాని ప్రతిఫలముకాదు అని నమ్ముచున్నాను. అదే మా ప్రభుత్వముయొక్క నమ్మకముకూడా. ఎవరైతే వ్యవసాయము చేస్తున్నారో, వారికి ఆ వ్యవసాయము చేసేటటువంటి భూఖండము వారియొక్క హక్కుభుక్తాల్లో ఉండాలి అనే భావము మనుష్యులకు కలగకపోతే, ఈ ఉత్పత్తి అంత చురుకుగా కొనసాగదని ప్రభుత్వ నిశ్చయం. అందువల్ల ఆ పరిస్థితి కలుగజేసినరోజునే ఇప్పుడు plan లో వేసుకొన్నప్రకారం ఇప్పుడు ఉత్పత్తి అయ్యే సరుకులు రెండురెట్లు కావాలి మూడు రెట్లువెళ్ళాలి అనేటటువంటి వ్యవహారానికి irrigation projects fertilizers వగైరాలే కాకుండా ఎక్కువగా మనము ఇంకొక కృషికూడా చేయాలి. ఈ భూసంస్కరణలేమో మొత్తముమీద ప్రవేశపెట్టాలి. అందుకోసం, వచ్చే అయిదు సంవత్సరాలలో Planning Commission వారు ఇచ్చినటువంటిసిద్ధాంతాలప్రకారం మనరాష్ట్రములో ఈ భూసంస్కరణలను తప్పకుండా తీసుకువస్తామని మనవిచేస్తున్నాను. మిగిలిన వివరాల్లోకి ఇప్పుడు నేను వెళ్ళదంలేదు. వాటిని గురించి ఆయా Bills వచ్చినప్పుడో, లేక మరొకప్పుడో చర్చించుకోవచ్చు. కాని First Five Year Plan లో అవన్నీ వివరంగా చూడవచ్చును. వాటికి తగ్గకుండా మనముకూడా ముందుకువెళ్ళి ఈ సంస్కరణలు తీసుకువస్తామని మనవిచేస్తున్నాను. పరిశ్రమలనుగురించి నా దగ్గర అంతా notes ఉన్నది, కాని నేను ఎక్కువ మాట్లాడదలచుకోలేదు, ముఖ్యమైన విషయాలు మాత్రం చెప్తాతాను. మన ఆంధ్రరాష్ట్రములో పరిశ్రమలు లేవు. ఉన్నటువంటివి ప్రతిరోజు ప్రశ్నోత్తరసమయంలో బయటికి వస్తున్నాయి. ప్రభుత్వమువారితరఫున నడపబడుతున్న రాజమండ్రీ పేపరుమిల్లు, గూడూరు పింగాణిఫ్యాక్టరీ, ఈ రెండుమాత్రమే ఉన్నవి. Private section లో చెప్పుకోదగ్గ పెద్ద Industries ఏమి లేవు. ఆ ఉన్నవేమో తమకు తెలుసుననుకొంటాను. వైజాగ్‌లోని హిందూస్తాన్ షిప్‌యార్డు, తరువాత కొన్ని Sugar Factories, రెండుమూడు Cement Factories, అయిదారు బట్టలమిల్లులు ఉన్నవి. వాటి నన్నిటిని అభివృద్ధిచేయాలి. వాటిని అభివృద్ధి చేయాలనేదానికి మరొక ముఖ్య కారణమున్నది. మన రాష్ట్రంలో వ్యవసాయమే వృత్తిగా కలిగినటువంటివారు చాలామంది ఉన్నారు. వారిలో కొంతమందిని ఇతరవృత్తులలోకి ముఖ్యంగా పరిశ్రమలలోకి లాగుకొనిరాకపోయినట్లయితే ఈదేశములో అశాంతి, అసంతృప్తి అలాగేఉంటాయి. మొట్టమొదట మన ఆదర్శమని చెప్పినట్లు జీవనప్రమాణాన్ని పెంచేటటువంటి భాగ్యము మనకు ఎప్పటికీ లభించదు. అందువల్ల పరిశ్రమల అభివృద్ధిని ప్రధానమైన దృష్టితో పెట్టుకొనితీరాలి. కొన్ని సంవత్సరములదాక వ్యవసాయము మనకు తప్పదు. వ్యవసాయము ఎప్పటికీ తప్పదు. కాని ఇంకా ఎక్కువమందికి వృత్తి కలిగించాలంటే

3rd August 1955] (Sri K. Venkata Rao)

నిరుద్యోగసమస్యను పరిష్కరించేందుకు వుండే రెండవ పంచవర్ష ప్రణాళికలో భారత దేశంలో ఒక కోటి, పది లక్షల మందికి క్రొత్తగా పని కల్పించాలి అంటున్నారు. అందులో ముఖ్యమైనటువంటి భాగము మనము తీసుకోవాలి. కనుక ఎక్కువమందిని organised industries లోకి తీసుకురావడానికి ప్రయత్నించాలి. కాని organised industries ఎన్ని పెట్టినా చాలమందికి వృత్తి కలిగించలేము. అందుచేత కుటీర పరిశ్రమలను, చిన్న చిన్న పరిశ్రమలను అభివృద్ధిలోకి తీసుకురావాలి. ఇప్పటికి మాకు వచ్చిన సంజాయిషీ ప్రకారం 48 వ పేజీలో కొన్ని వివరాలన్నీ దీనినిగురించి వున్నాయి. ఇంకా వాటినిగురించి 32 నుంచి 44 పేజీలవరకు చూడవలెనని కోరిక. అందులో sugar factories అన్నికూడ co-operative schemes గా తయారైనాయి. ఇప్పటికి ఏడు sugar factories కు దరఖాస్తులు వచ్చాయి. అందులో మూడు limited liability concerns క్రిందవచ్చాయి. సిమెంటు గురించి ఇదివరకు రెండు కంపెనీలవారికి అప్పుడే లైసెన్సులు ఇవ్వబడినాయి. ఇంకొక కంపెనీ దరఖాస్తు ఆలోచనలోఉన్నది. ఇంకా రెండు కంపెనీల దరఖాస్తులు గురించి proposals వస్తున్నాయి. అంతే కాకుండా గరివిడిలో ferro manganese కు గాను ఒక దరఖాస్తు వచ్చి ఉన్నది. వీటన్నిటినీ కలుపుకొన్నట్టయితే కొన్ని కోట్ల రూపాయలు పెట్టుబడివస్తుంది.

తరువాత మనం యింకొకటి ముఖ్యంగా కోరవలసియున్నది. ఆంధ్రదేశంలో అధమపక్షం ఒక All India industry అయినా పెట్టేటట్లు చూడాలి. ఆవిధంగా కోరడానికి మనకు మంచి కారణముకూడా ఉన్నది. మనము ధాన్యాములు పండిస్తుంటే ఇతర రాష్ట్రాలవారు తింటున్నారు. మనకేమో ధరలు స్థిరీకరణకాలేదు. తక్కువధరకు వాళ్ళకు అమ్ముతూ, మనమేమో ఇక్కడ unemployment కు గురిఅవుతున్నాము. కాబట్టి మన unemployment ను తీర్చు బాధ్యత మననుంచి లాభముపొందే వాళ్ళ మీదనే ఉన్నది. వాళ్ళే మన ప్రాంతంలో industries పెట్టాలి. అంటే కేంద్ర ప్రభుత్వంవారు పెట్టాలన్నమాట. ముఖ్యంగా మనము విజయవాడలో fertilzers factory, విశాఖపట్నంలో steel fabricating factory, ఇలాంటివి మనము అడుగుతున్నాము. వీటిలో అధమపక్షము ఒకటైనా మన ప్రాంతములో పెట్టేటట్లు కృషిచేయాలి. దీనికి మీ అందరియొక్క సహకారము సంపత్తి ఉన్నదని నమ్ముచున్నాను.

తరువాత cottage and small scale industries గురించి 44 వ page లో వివరాలున్నాయి. వీటిని మేము ఎలా provide చేస్తున్నామనేదాన్ని గురించి అయిదు సూచనలు చేశాము. అది 4 to 5 pages లో చూడవచ్చును. అవన్నీ నేను చదివితే ఆలస్యమవుతుంది. Cottage industrial co-operative ను తయారు చేయడం గురించి ఇప్పుడే ఒక ప్రశ్నకు సమాధానంగాచెప్పాను. వీటిలో చర్మం తయారుచేయడం leather work, నూనె తీయడం, hand pounding of rice ఖాదీ making, basket making వగైరాలున్నాయి. ఇంతే కాకుండా ప్రత్యేకంగా మన ఆంధ్ర రాష్ట్రంలో అయిదు లక్షల ఎనభై వేల మందికి వృత్తి కల్పించేటటువంటి చేనేత పరిశ్రమ ఉన్నది. ఈ పంచవర్ష ప్రణాళికలో దానియొక్క అభివృద్ధికి కూడా యత్నం చేస్తున్నాము. ఈ సందర్భంలో T. T. క్రిష్ణమాచార్లుగారు "I am a convert to this Industry" అని చెప్పుతూ నిన్న paper లో ఒక statement ఇచ్చినదాన్నిబట్టి చూస్తే వారిసహాయం మనకు ఎక్కువ లభిస్తుందని, పరిశ్రమ

మంచి అభివృద్ధికి వస్తుందని మనవిచేయవలసియున్నది. కనుక ఇక్కడ ఉన్నటువంటి శాసనసభ్యులందరు దయచేసి తమతమ జిల్లాలలో అందుచుకూడ కృషిచేసి జిల్లాకు కనీసం ఒక Medium Industry, (అంటే 10 లక్షలు మొదలు 25 లక్షలవరకు ఉండేది) అయినా పెట్టవలసిందని కోరుతున్నాను. మీరు ఈలాంటి Industries స్థాపించినట్లయితే సగము డబ్బు ప్రభుత్వము ఇస్తుందని చెప్పుచున్నాను. ఈ డబ్బు అప్పుక్రింద కాక share capital క్రింద ఇస్తుంది. ఈవిధంగా ఇవ్వడంవలన ఆ పరిశ్రమయొక్క మేనేజ్‌మెంట్ కూడ ప్రభుత్వము guarantee ఇస్తుందన్నమాట. ఈ సందర్భంలో ఇంకొక విషయం మనవిచేస్తున్నాను. ఇదివరకు 1½ కోట్లే దీనికి ప్రత్యేకించబడి ఉంటే, మాకల మనవాళ్ళందరి సలహాను బట్టి ఇప్పుడు మూడు కోట్లు ఎక్కువచేశాము. కనుక ఈవేళ కాకపోయినా రేపైనా మీ అందరి సహాయంతోటి అభివృద్ధికి వస్తుందని నమ్ముచున్నాను. కనుక మీరందరు అన్ని జిల్లాలలో కూడ ఇలాంటి పరిశ్రమలు పెట్టేటటువంటి యత్నం చేయవలసిందనీ, ఈ విషయంలో మీయందరి సహాయాన్ని కూడ నేను అర్థిస్తున్నాను.

ఈ సందర్భంలో ఇంకొక విషయంకూడ మనవిచేస్తున్నాను. మొన్న జపానుకు వెళ్ళి వచ్చినటువంటి స్నేహితులు ఈ చిన్న పరిశ్రమల విషయంలో కొన్ని సలహాలిచ్చారు. ఉదాహరణకు ఇప్పుడు ఈ mike ఉందనుకోండి దీనిలో ఈ కొడ, base, screw, loud speaker ఇవన్నీకూడ ఒకే కంపెనీలోనే తయారు అవుతున్నాయి. అలా కాకుండా వీటిని తయారుచేయడానికి ముఖ్యంగా కావలసింది ఉక్కు. గనుక ప్రభుత్వముగాని ఇతర పెద్ద సంస్థగాని ఆ ఉక్కును తయారుచేసి process చేసి ఇచ్చేటటువంటి పరిశ్రమలు ఏర్పాటుచేస్తే, దానివల్ల ఈ industrial గా ఆదాయము వచ్చేదేకాకుండా, ఎక్కువ మందికి పని దొరుకుతుంది అనే భావముతో వారు ఆ సలహా ఇచ్చారు. దానిని ఇప్పుడు examine చేయిస్తున్నాము. ఇకముందు Industries ను తయారుచేయడంలో ఈ పద్ధతిని అవలంబించడానికి కూడ మేము ప్రయత్నం చేస్తాము.

మిగిలిన విషయాలు దానిలో వున్నవి. ఇక రోడ్లు, communication విషయములో యీ పంచవర్ష ప్రణాళిక బుక్కులో 46, 47 పేజీలలో వ్రాసి వున్నది. మన రాష్ట్రంలో యీ పంచవర్ష ప్రణాళిక క్రింద పెద్ద వంతెనలు కట్టడం పూర్తి అవుతుంది. తరువాత village development, national extensions క్రింద చిన్న చిన్న రోడ్లనుగురించిన పనులు అన్నీకూడా చేయించుకోటానికి వీలు అవుతుంది. ఇంతేకాకుండా ఎక్కువగా National Highways, Provincial Highways, District Board Roads వీటినన్నిటినీ అభివృద్ధి చేసే పథకాలు యిందులో వున్నవి. వీటితోబాటు inland water transport అంటే కాలవల ద్వారా సరకులు తీసుకొని వెళ్ళినట్లయితే, ఖర్చులు చాలా తక్కువ అవుతాయి. ఇప్పుడు కాకినాడ దగ్గరనుంచి బయలుదేరితే యీ కాలవల ద్వారా, అంటే ఆ Buckingham Canal ద్వారా మద్రాసుదాకా వెళ్ళవచ్చు. ఇటువంటి transport Communication బాగుచేసుకోటానికి యత్నం జరుగుచున్నది. తరువాత minor ports విషయము వున్నది. చిన్నచిన్న ఓడరేవులు అభివృద్ధిచేసుకోటానికి 75 లక్షల దాకా కేటాయించాము. 'Education గురించి 53, 54 పేజీలలో చెప్పబడివున్నది. దీనిలో కొంతవరకు ఉపాధ్యాయుల వేతనాలను అభివృద్ధి, విద్యాభివృద్ధి ఇవన్నీ చేసుకోటానికి కూడా provision యిందులో వున్నది. తరువాత Medical,

3rd August 1955] (Sri K. Venkata Rao)

Public Health వీటిని గురించి 55 నుంచి 59 పేజీలలో వివరాలు వున్నవి. Schedule Castes, Backward Classes, వీళ్ళకోసము నాలుగు కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టటానికి బుక్కులో యింకొక పేజీలో వున్నది. ఇంకను Women Welfare, Social Welfare Board వీటి విషయములో ఢిల్లీవారి కోరిక ప్రకారం యింకొక 25 లక్షల రూపాయలు allot చేశాము. వీరు యింకొక 75 లక్షలదాకా యిస్తారు. అంతాకలసి సుమారు ఒక కోటి రూపాయలు యీ విషయములో ఖర్చు పెట్టటానికి వీలు అవుతుంది. తరువాత 32 నుంచి 34 పేజీలలో community development ను గురించి చెప్పబడియున్నది. వీటినిగురించి నేను విశేషంగా చెప్పనవసరము లేదు. వానియొక్క object యీ బుక్కులోనే వుంది. అదేమిటో చదువుతాను—'The object is to develop objective out-look among the villagers and to create necessary conditions whereby they can improve their conditions through their effects with Government assistance" ఇందులో అఖరు విషయముగురించి నేను ప్రత్యేకంగా చెప్పేది యేమిటంటే, యిందులో "through their effects with Government assistance" అని వున్నది. ఇక్కడ చాలాసార్లు "ఏమండీ, ½ మాత్రమే పుచ్చుకుని చేయకూడదా, ½ మాత్రమే పుచ్చుకొని చేయకూడదా! సగము ఎందుకు" అనే ప్రశ్నలు అప్పుడప్పుడు వస్తూన్నవి. ఈ సందర్భంలో నేను చెప్పేది యేమిటంటే, మామూలుగా బడ్జెటుక్రింద ప్రభుత్వము ఖర్చుపెట్టేది నడుస్తూనే వుంటుంది. దీన్నిగురించి యితర contributions అక్కరలేదు. Increased provisions అన్నీ వుండనేవున్నవి. ఇదికాకుండా యింకా ఎక్కువచేసే వుద్దేశ్యముతో తీసిపెట్టారు. దీన్ని పెట్టటానికి ఉద్దేశ్యమేమిటంటే "నీవు ఒక అడుగువేయి, నేను ఒక అడుగువేస్తాను" అన్నట్లుగా వుంది. అదికాకుండా యిప్పుడు ఒక కోటిరూపాయలు రోడ్లమీద ఖర్చుపెట్టతామని అంటున్నారు. ఈ కోటి రూపాయలు ఖర్చు పెట్టుతూనే వుంటారు. ఇది కాకుండా యింకో addition. మనకు speed గా development కావాలంటే యిప్పుడు యీ new system ప్రకారము అది Community Project అనండి, Village Block అనండి, Village Extension Service Block అనండి, village work అనండి. లేకపోతే Local development works అనండి, యివన్నీ వేరు వేరు పేర్లతో వున్నప్పటికి అందులో అవి చేసే పని మాత్రం అంతా ఒకటే. అందువల్ల మీ దృష్టికి ప్రత్యేకంగా తీసుకొని వచ్చేది యేమిటంటే యీ community development, National Extension Service యివన్నీ 16 కోట్ల రూపాయలు ఖర్చుఅవుతుంది. ఇందులో 11 కోట్ల పైచిల్లర Government of India వారు యిచ్చే సొమ్ము మనగవర్నమెంటు యిచ్చేది. నాలుగు కోట్లు మన రాష్ట్రానికోసం ఖర్చుపెట్టి యీ National Extension Service Community Development వ్యవహారము అంతా పూర్తిచేస్తాము. ఇంకా Local Development అనే పేరు వుపయోగించనేలేదు. ఇది వరకు జరిగినపని కూడా మీకు నేను చెప్పదలచుకున్నాను. ఎందుకంటే ప్రజలలోనుంచి ఉత్సాహము ఎట్లా వస్తుందో అది మీకు చూపించాలని నా ఉద్దేశ్యము. Community Project area లో యింతవరకు రు. 61,11,000 ఖర్చు అయింది. ఇందులో రు. 27,66,000 లు ప్రజలదగ్గరనుంచి అనేక విధాలుగా contribution క్రింద వచ్చింది. అంటే నూటికి 45.2 వచ్చింది అన్న

(Sri K. Venkata Rao) [3rd August 1955

మాట. Community development block లో రు. 3,95,000 లు ఖర్చు పెట్టారు. గవర్నమెంటువారు రు. 2,96,000 లు Peoples Contribution క్రింద వచ్చింది అంటే అది 75% అయింది. National Extension services మొత్తం ఇప్పటివరకు ఎన్నో వున్నవి. వీటికిగాను రు. 28,50,000 లు గవర్నమెంటువారు యిచ్చిన సొమ్ము. ఇదికాక రు. 25,33,000 లు Peoples Contribution వచ్చింది. మొత్తము నూటికి 95.9% వచ్చింది. ఇప్పుడు మన స్కీము యేమిటంటే మనరాష్ట్రం మొత్తముమీద యింకమీదట Community projects అనేవి వుండవు. ఇప్పుడున్న రెండు వచ్చే సంవత్సరముతోటి ఆఖరు. రాష్ట్రము అంతటా కూడా National Extension Service Blocks పెట్టాలి. ఈ National Extension Service Blocks మన రాష్ట్రము మొత్తము మీద 237 పెట్టితాము. ఈ సంవత్సరము యింకా కొన్ని పెట్టడానికి యత్నం జరుగుచున్నది. అప్పుడు అన్ని Blocks కూడా రాష్ట్రములో వున్న 16 వేల గ్రామాలకు యిది వెళ్ళుతుంది. ఒక్కొక్క Extension Service Blocks లో 7½ లక్షల రూపాయలు పెట్టుబడి వుంటుంది. ఇంకొక విషయము యీ సంవత్సరములో చెప్పవలచాను. ఇందులో సగము పళ్ళీ Community Development Blocks క్రింద మారుస్తారు అంటే యింకా 15 లక్షలో యింకొక 75 లక్షలు అక్కడ ఖర్చుపెట్టుతారు. ఈ రకంగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రధానమైన అంశముగా వాను పట్టించుకోవలసింది యిది ఒకటి.

ఇప్పుడు యింకొకవిషయము ఉన్నది. Local Development అనేది ఒకటి ఉన్నది. అంటే గ్రామాలయొక్క అభివృద్ధివిషయము. National Extension Service Blocks లో లేనటువంటి ఆ గ్రామాలకు యివి వుద్దేశింపబడినవి. Government of India వారే మనకు గ్రాంటుక్రింద యిస్తున్నారని మొన్న నేను చెప్పాను. ఆ యిచ్చిన గ్రాంటులో నూటికి 75 జనాభాప్రకారము నూటికి 25 వెనుకబడిన ప్రాంతాలకోసం ప్రత్యేకించి, ఆ రకంగా ఖర్చుపెట్టితున్నాము. ఇది యీ సంవత్సరమే బాగా progress లోకి వచ్చింది. గత రెండు సంవత్సరాలలో అది అంత బాగలేదు. పోయిన సంవత్సరాలలో జరుగుతున్న పనులమీద పెట్టుబడిపెట్టినది అంతా యీ సంవత్సరము వరల ఖర్చుపెట్టుకోమని అన్నారు. ఆ allotment lapse కానివ్వలేదు. అందువల్ల ఆ పని జరుగుచున్నది. అయితే రాబోయే Plan లో మేము ప్రత్యేకంగా ఒక విషయము ఆలోచించాము. అది యేమిటంటే రాష్ట్రములోని అన్ని గ్రామాలలోను ప్రతి గ్రామములోను ఒక స్కీముఅయినా పూర్తిచేయాలిగదా ! అందుకు మనము యేమిచేయాలి అనేది దృష్టిలో పెట్టుకోవలసి వున్నది. National Extension Service వస్తుంది. దానిని యింకా ఎక్కువ చేయటానికి మనకు 11 జిల్లాలు వున్నవి. ఈ 11 జిల్లాలకు block grant కోటిరూపాయలు ఉన్నవి. అవి ఫలానా పనికి యివ్వవలెనను నిర్ణయము లేదు. ప్రతి గ్రామానికి అందుబాటులోకి తీసుకొని సెశ్శిటట్లుగా ఒక్కొక్క కోటిరూపాయలు ఖర్చుపెట్టితాము. దానికి Village Extension Service Blockగా కోటిరూపాయలు, అధమపక్షము contribution ఒక కోటిరూపాయలు, ఎంత తక్కువ లెక్కవేసుకున్నప్పటికినీ, జిల్లాకు యింతవచ్చిన మూడుకోట్లరూపాయలు వచ్చే అయిదు సంవత్సరాలలో Local Development కు గాను ప్రత్యేకంగా గ్రామీణప్రాంతాలకు సహాయము చేయడానికి గ్రాంటుక్రింద అడిగాము. ఈ సొమ్మును పట్టుబట్టి తెచ్చుకోవాలి. ఎందుకంటే Government of

3rd August 1955] (Sri K. Venkata Rao)

India వారి ఆదేశము ప్రకారము ఎక్కువగా గ్రామీణప్రాంతంలో అభివృద్ధిచేయాలి. కాబట్టి వారికి యింతవరకు అలాంటి పద్ధతిని గ్రామాలకు తీసుకొనివస్తే చాలామట్టుకు గ్రామీణసమస్యలు తీరుతాయి. ఇవి యింతవరకు జరిగేపనులు. మరొక ముఖ్యమైన విషయము వున్నది. ఈ రెండు విషయాలు మాత్రము, నేను నాకు యిప్పుడు వున్నటైము లోపలనే మాట్లాడుదామని అనుకున్నాను. ముఖ్యమైనది మాత్రము మనవిచేస్తాను. ఇసెంతొసరకు బాగానేవున్నది. ఇక మనకు కావలసినది డబ్బు. ఇది ఎట్లా వస్తుందని ఆలో చించాలి. మనకు వున్న ఆర్థిక స్తోమతు ఎట్లావున్నదో చూచుకోవాలి. మనము ప్లానింగు కమీషనువద్దకు మన plan తీసుకొనివెళ్ళాము. అసలు మన పరిస్థితి ఏమిటి? ఢిల్లీలో మాత్రము Treasury లో డబ్బు వున్నదాంటే, అక్కడ కోట్లకొద్ది రూపాయలు లేవు. మనము చెక్కుసంపిస్తే వారు అక్కడి Treasury లో నుంచి తీసి పంపుతారనుకొంటానికి డబ్బు అక్కడ లేదు. కాబట్టి యివన్నీ దేశములో రాష్ట్రాలకు, ప్రభుత్వాలకువచ్చిన ఆదాయములన్నీ కలిపి చూచుకోవాలి. అప్పులు పుచ్చుకోవాలి పన్నులు వేయాలి. ఇంకా అనేకరకాలంగా వసూలుచేయాలి. వీటికిగాను మనము లెక్కలు తీసిచూస్తే, యిప్పుడు యిక్కడ మన పరిస్థితి ఏ విధంగా వుంటుందంటే, ఇప్పుడు మనము చూచుకున్నవి final figures కావు. అన్నీ అంచనాలే. మనకు రాబోయే అయిదు సంవత్సరములలో 110 కోట్లు యీ రాష్ట్రానికి ఆదాయము వస్తుంది. ఇదికాక Government వారు యిచ్చే గ్రాంట్లు వేరుగా వున్నవి. కాని యీ 110 కోట్లు రావాలంటే యీ క్రింది పనులుచేస్తేనే వస్తుంది. అవి యేమిటంటే, మనము యీ రోజున వున్న పన్నులతోబాటు సంవత్సరానికి 130 కోట్ల రూపాయలు ఆదాయమువచ్చే పన్నులు వేసుకోవాలి. అంతేకాకుండా కొత్తగాపెట్టిన irrigation schemes వల్ల 50 లక్షల రూపాయలు, electricity development వల్ల 275 లక్షలు వస్తుందని అంచనాలు వేశాము. ఈ విధంగా వేసి, Centre నుంచి తీసుకోకుండా చూస్తే మనకు 110 కోట్ల రూపాయలు వస్తుంది. ఇంకను యీ రోజున వున్న ఖర్చు, కొత్త schools పెట్టకుండా, కొత్త hospitals పెట్టకుండా, యిప్పుడు వున్నది వున్నట్లుగా వుంచి, development expenditure తోటి నడిపించినట్లయితే, మనకు 119 కోట్ల రూపాయలు ఖర్చు వుంటుంది. అంటే తొమ్మిదికోట్ల చిల్లర యింకా మనకు బాకీ మిగిలివుంటుంది అన్న మాట. అయితే యిప్పుడు మనము వేసుకున్న అంకెలు స్థిరమైనవి కావు. స్థిరమైనవి కావని ఎందుకు చెబుతున్నానంటే మనకు Government of India వారు ప్రతి సంవత్సరము యిచ్చే contributions కొన్ని వున్నవి. తరువాత యీ కొద్ది సంవత్సరాలలో మనకు industries నుంచి రావలసిన ఆదాయము వస్తే దానిలో మనకు Income tax లో యింకా యెక్కువ భాగము వస్తుంది. ఇటువంటి imponderables అన్నికూడా మనము లెక్కవేసుకోలేము. ఇంకా మనము వేయవలసిన పన్నులు వున్నవి. మన స్నేహితులు ఒక కమిటీ రిపోర్టులోనివి 20, 30 విషయాలను గురించి చెప్పారు. ఈ రోజున చెప్పబోతున్నారు. ఇంకా రేపు చెప్పబోతారు. వాటి అన్నిటినీ ఆలోచించి తెచ్చుకునే ఆదాయాలు యింకా కొన్ని ఉండవచ్చు. ఇదీ మనకు వున్న ఆర్థికస్తోమతు. అందుచేత యిదికూడా దృష్టిలో పెట్టుకొని మనము plan వేసుకోవాలిగాని వూరకనే 800 కోట్ల రూపాయలు మనకు కావాలని అడిగితే, యివ్వటానికి అక్కడ ఢిల్లీ treasury లో డబ్బు యేమీ లేదని సభవారికి మనవి చేస్తున్నాను

ఇప్పుడు ఈ పనులు జరగాలన్నట్లయితే మనము చేయవలసిన పని ఏమిటంటే, మనముకొంత ధైర్యంగా చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతోంది. ఇదివరకు మనము చాలా దూరము వెళ్ళకుండా జపానువంటి దేశమును చూస్తే (జపానును ఎందుకు చెబుతున్నానంటే రష్యాలో వచ్చిన anuual progress investment కంటె జపానులో కొన్ని సంవత్సరములలో ఎక్కువ వచ్చింది.) వాళ్ళు అవలంబించినటువంటి పద్ధతులు ఏమిటి అన్న విషయము చూస్తే ప్రపంచము అంతా చూసినప్పటికి కొంచెము హెచ్చు తగ్గుగా ఇది Common system క్రింద వున్నది.

In Japan in the initial period of development the state dominated the scene providing capital for public works and industrial expansion by strict taxation of the agricultural population, occassionaly by forced loans imposed on the commercial middle classes in the towns and also by credit expansion which was not inflationary to the extent that it reflected an increase in the monetary sector of the economy."

అంతదూరము మనము వెళ్ళవలేదు. కొంత భాగము వెళ్ళకపోవచ్చు. అందువల్ల మనము చేసే పని అంతా మనము ఈ గోజు పెట్టుబడి కావాలంటే అనేక రకాలుగా రావాలి. బలవంతముగా నైనా పుచ్చుకోవాలి. లేకపోతే ఐచ్ఛికంగా నైనా రావాలి. బలవంతముగా పుచ్చుకోవడము అంటే పన్నులు వేసి పుచ్చుకోవడము ఐచ్ఛికంగా పుచ్చుకోవడము అంటే అప్పులు తీసుకోవడము రెండిటిని కలిపితేగాని అది జరుగదు. అందువల్ల ఈరోజున మనము ఈ దేశాన్ని అభివృద్ధిలోకి తీసుకు రావాలంటే ప్రతివ్యక్తి maximum saving చేయాలి. మనము మామూలుగా ఖర్చుపెట్టుకోవచ్చు 5 చొక్కాలు మనకు సాధారణంగా కావాలనుకోండి, 8 చొక్కాలు తీసుకుంటాము. అట్లాకాకుండా ఈ 8 చొక్కాలకు ఈ యేడాదిలో తగ్గించుకోవాలి. 4 జోళ్ళు తొడుక్కుంటామనుకోండి. 2 జోళ్ళతోనే కాలక్షేపము చేయాలి. ఇలా సేవ్ చేసి దేశములో దానిని మనము ఇన్వెస్టు చేసినట్లయితే గవర్నమెంటు బాండ్సులోనో, లేక ప్రైవేటు సెక్యూరిటీల్లోనో ఏకంపెనీలోనో పెట్టుకోండి మనము అనుకొన్న రీతికంటె శుభ్రంగా మనము ముందుకు కొనసాగుతాము. అందులో ఆంధ్ర రాష్ట్రంలో మనము పారిశ్రామికంగా చాలా వెనుక బడివున్నాము. ఈ దృష్టిని బట్టి వున్నటువంటి ప్రజానీకానికి మనమే అవసరంగా వున్న వ్యవహారమును మనము పూర్తి చేసుకోవాలి. మనకు డబ్బే సంపాదన (అది సంపాదన అని అనుకోము గాని ఖర్చు కోసము వచ్చేఅలవెన్సు అనుకోండి.) నెలకు 6 రూపాయలు తీసి పోస్టలు సేవింగ్సులో పడేయండి. మీ యింటిదగ్గర ధనము వున్నవారయితే ఏకోఒక భాగము ఇవ్వండి. ఖర్చుఅలాగే మేమూ చేస్తాము. ఇది ఇలా అందరు అన్నిరకాలుగా తగ్గించుకొని దేశము యొక్క అభివృద్ధి కోసము ఇవ్వకపోతే మనకు ఈ లోన్సురావు. అన్నిదేశాలలోనూ చేశారు. లేకపోతే రెండవ totalitarian system లోకి వెళ్ళాలి. నువ్వు ఒకే జోడును ఈ యేడాది అంతా తొడుక్కో, రెండవ జోడు కొనడానికి వీల్లేదు అని గవర్నమెంటు చెప్పనైనా చెప్పాలి. అంతబలవంతముగా ప్రజాస్వామ్య సిద్ధాంతాలు వొప్పుకోనేందుకు వీల్లేదు గనుక మనము ఐచ్ఛికంగా అర్థం చేసుకోవాలి. నా దేశము

3rd August 1955] (Sri K. Venkata Rao)

బాగుపడుతోంది. నేను ఈ సహాయముచేశాను. అని చెప్పుకోవాలి. స్కౌటువారు మెడలో ఒక గుడ్డను కట్టుకొంటారు. వారు ఏదైనా ఘనకార్యము చేసినప్పుడు చిగురున ముడివేస్తాడు. అలాగే మనము ప్రతి రోజూలేచి ఈ సత్కార్యాన్ని నేనుచేశాను. అని అనిపించుకోవాలన్నట్లయితే మన అందరముకూడా శాసనసభలో లేనటువంటికాలాన్ని ఎక్కువగా ఈఅభివృద్ధి కార్యక్రమాల్లోపాల్గొనేందుకు కలిగినవసర్లను, అవసర్లనుఅన్నింటినీ తయారు చేయడానికి కృషి చేయాలి. దీనిని గురించి విపులంగా చెప్పడానికి తమకాలాన్ని తీసుకో దలచుకోలేను. ఇంకొక విషయం ఈ సందర్భములో మనవి చేసేది ఏమిటంటే ఇప్పుడు రేపు 16 వ తేదీన ప్రభుత్వము 2½ కోట్ల రూపాయలు అప్పు అడిగింది. తమరు అంతా పత్రికలలో చూచేవుంటారు. ఇవాళ ప్లానింగును discuss చేసి ఎవరి దారిని వారు ఎల్లుండి వెళ్ళిపోతారు. 16 వ తేదీనాటికి దీనిని గురించి మరచిపోయినట్లయితే 2½ కోట్లు ప్రభుత్వానికి రావు. దీనిని బలవంతముగా వసూలుచేయదలచలేదు. దీనిని ఐచ్ఛికంగా తిసుకురావాలి. ఆంధ్రరాష్ట్రం వచ్చింది అనే మనము, అయ్యో తెలుగు తల్లి అని పాటపడే మనము, ఈ తెలుగు తల్లిని అలంకరించాలన్నట్లయితే, శోభాయమానము చేయాలన్నట్లయితే మనము కృషిచేయక తప్పదు. దీనికి మీరు ఏమిచేస్తారు? నాకు అధికారము లేదు కాని నేను గనుక ముఖ్యమంత్రిని అయితే ఒక నిర్ణయంచేయించి వుండేవాడిని. రేపు సెప్టెంబరు నెలలో మళ్ళీ మీరు ఇచ్చటకు వచ్చినప్పుడు ప్రతివారు నేను ఇంత లోను వసూలుచేశాను అని కాగితముమీద వేసి ఇవ్వాలని చెప్పేవాడిని. శాసనము అక్కరలేకుండా ఇప్పుడు చేయమని కోరుతున్నాను. ఇది మనయొక్క ధర్మము అని నెత్తిమీదకూడ పెట్టుకొని ఈ కార్యసందర్భంలో మనము కూడా చేయూత ఇవ్వక పోయినట్లయితే ఈ పంచవర్ష ప్రణాళికలో అచ్చువేసిన కాగితాలు అన్నీకూడ మనకు ఎందుకు వుపయోగము లేకుండాపోతాయి. అందువల్ల నేను దేశంలోవున్న ప్రజలకు, శాసనసభ్యులందరకూ మీద్వారా చెప్పేది ఏమిటంటే మనయొక్క ధర్మాన్ని మనము నిర్వర్తించి దీనిని విజయవంతము చేయాలి. (దీనికే కాదు, రేపు ప్రొద్దున మనకు ఇంకొకటి కావలసివస్తుంది) కాబట్టి మనము ఈ .44 కోట్ల ప్లాను వేసుకొని వెళ్ళి ఢిల్లీలో వాగ్వివాదాలుచేస్తాము. అనేక విషయాలను ఇక్కడ అక్కడ చూపుకుందాము. పార్లమెంటులో వున్న మన సభ్యులు సహాయము చేస్తాము అని చెప్పారు. ఇన్నీ చేసినా మీరు తగ్గించానని అంటారు అనుకోండి. ఆ లోటును మనము పూర్తిచేయడానికి ఏమి చెప్పాలి. ఈ లోను తీసుకువస్తున్నాము, allow చేయండి అని చెప్పాలి. నాకేమి కష్టము నేను డబ్బు ప్రోగుచేసుకో వలసిందనే పద్ధతిలోవుండాలి. కాబట్టి మనకు ముందుకూడా ఇది చాలా అవసరమైన విషయము. ఈ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ గౌరవసభ్యులు చూపించాలని నేనుకోరుతున్నాను.

ఈవాళ రేపు తమరు ఈ ప్లానుగురించి చర్చిస్తారు.

ఇందాక రామకృష్ణా రెడ్డిగారు ప్లానులో ఫలాన స్కీము అని వేశారు, మిగిలిన వివరములు ఏమిటి అని అడిగారు. ఈవేళ వివరములు ప్రచురించడానికి ఏమీ కష్టములేదు. దీనిలోవున్న తేడా ఎక్కడ వున్నదంటే 244 కోట్లు లెక్కవేసిన వివరాలు వున్నాయి అనుకోండి, అచ్చువేస్తాము, పంచిపెడతాము. ఈ 244 కోట్లు 200 చేస్తే ఇందులో కొన్ని తీసివేయాలి. తీసివేస్తే బాధ సభ్యుల కంటెపెనకాల వున్నవారి

(Sri K. Venkata Rao) [3rd August 1955

దగ్గరనుంచి ఎక్కువగ వస్తుంది. అందువల్ల ఢిల్లీ వెళ్ళివచ్చినతరువాత ఎంత వుంటుందో చూచుకొని రివైజుచేయవలసివుంటే చేసి యిస్తాము. December లో Draft ప్లాను publish చేస్తాము అన్నారు. చేసినతరువాత అప్పటికి మనకు కొన్ని స్థిరమైనటువంటి రూపము కలిగి, మన రిసోర్సెస్ మన ప్రోగ్రాము, ప్లాను, ప్రచురించి ఇవన్నీ మనము నిర్ణయము చేసుకొని తరువాత మీ అందరిముందర సభలో చర్చించడానికి పెట్టడానికి నా కేమీ అభ్యంతరము లేదు. ఇది రహస్యముగా చేయదలచలేదు. గూఢపురాణీలంటూ పట్టుకువచ్చి మీ దగ్గరకు discussion కు పెట్టునావా అంటారు. మనం ముందు విచర్చించాలి. ఈ శాసనసభలో ఎందుచేత పెట్టాము అంటే మన ప్రధాన మంత్రిగారు widest possible discussion కావాలని చెప్పారు. ఒక మనిషికి 10 మంది మనుష్యులు, 7గురు మంత్రులు మన సెక్రటేరియట్ మన Heads of Departments brain లో నున్నటువంటి క్రొత్త ఆలోచనలు ఏమైనా ఇక్కడ వున్న మెంబర్లకు వుండవచ్చును. దేశములో ప్రజలకు వుండవచ్చును. అంత వారు ఒక మంచిమాట చెబితే అది తీసుకోకపోతే అది అధర్మము అవుతుంది. అందువల్ల కొంత inconvenience వున్నదని నాకు తెలుసు. వున్నప్పటికి కూడా broad గా వున్న విషయాలుఅన్నీ మన ఆదాయాన్నిగురించి చెప్పాను. మనకు ఎంత కావలసివుంది. ఈనాడు ప్లానులు వచ్చాయి. దీనిలో అక్రమపక్షము ఏదైనా చేసుకోవాలి. Over all picture ఏమిటి? మన income ను ఎలా వృద్ధిచేసుకొంటాం. Expenditure ను ఎలా ఖర్చుపెడదాము. ఏ ఏ ప్రాజెక్టులమీద discuss చేసి ముందర భోజనము పెడదామా, లేకపోతే గోడ్డు వేసుకుందామా, పరిశ్రమలను పెట్టుకోవడము మంచిదా, పరిశ్రమలలో పెద్ద పరిశ్రమ ఏది, చిన్న పరిశ్రమ ఏది, ఏరకంగా దీనికి employment ప్రయత్నము చేయాలి, ఇవన్నీ పరుపులుగావున్నాయి. Broad based గా తమ అందరి గొప్ప సలహాలను ఈ స్టేజీలో ఇప్పించాల్సింది అని కోరుతున్నాను. నేను దీనిలో ఫలానిది పెట్టలేదు అని మనస్సులో ఏమీ పెట్టుకోకుండా అన్నీ చెప్పి దీనిని final shape అంతా మనకు అందిన తరువాత చేసుకోవలసివుంది. అప్పుడు కావాలంటే మనము శాసనసభలో చర్చించుకుందాము. ఈనాడు నేను చెప్పినటువంటిది ముందుగా విశాలమైనటువంటి దృష్టితో ఆంధ్రదేశాన్ని దృష్టిలో పెట్టుకొని మీరు చర్చ చేయాలని సభ్యులందరిని ప్రత్యేకంగా కోరుతున్నాను. ఏమైనా అనుమానాలు వుంటే చివరకు నేను జవాబు చెప్పడానికి ప్రయత్నిస్తాను. తమరు ఇచ్చినటువంటి సలహాలను కూడా తీసుకొని ఢిల్లీకి వెళ్లి చేయవలసినటువంటి చర్చ చేయడానికి యత్నము చేస్తామని కూడా తమకు మనవిచేస్తున్నాను. ఇది మనకు మొట్టమొదటి ప్రణాళిక కాబట్టి దీనిని పునరభివృద్ధికి మొట్టమొదటి యత్నములోనే తీసుకువెళ్లినట్లయితే పరిపూర్ణమైన బాధ్యతతోటి, వుత్సాహముతోటి, త్యాగబుద్ధితోటి మనము ముందుకు వెళ్ళాలి. ఆ విషయంలో సభ్యులందరూ తోడ్పడవలసిందని తమద్వారా కోరుతూ నేను రెండవ పంచవర్ష ప్రణాళికను చర్చలోకి తీసుకోవలసిందని కోరుతున్నాను.

Mr. SPEAKER :—Motion moved

"That the draft proposals of the Second Five Year Plan for the State of Andhra be taken into consideration."

Sri Vavilala Gopalakrishnayya will begin the debate.

3rd August 1955]

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా ! ఎన్నాళ్ళనుండో తపస్సుచేసి సాధించిన ఆంధ్రరాష్ట్రంయొక్క భవిష్యత్తు నిర్మాణమునకు నఃకము plan వేసుకుంటున్నాము అని వెంకట్రామాగారుచెప్పినప్పుడు మనమంతా ఆనందించాము.

Sri B. ADINARAYANA :— As there are several Members who wish to take part in the debate, I request that a time limit of five minutes be fixed for each Member.

Mr. SPEAKER :— Five minutes may be too short.

Sri B. ADINARAYANA :— Then ten minutes may be fixed for each Member.

Sri L. LAKSHAMANA DAS:— ఈవేళ 10 నిమిషముల time అన్నారు. అవసరమయితే ఈవేళ, రేపుకూడా ఇంకొ ఒక గంట, కూర్చోడానికి సిద్ధముగా ఉన్నాము. కనుక కనీసము 10 నిమిషములైనా time ఇస్తేగాని చర్చించుకోడానికి అవకాశము ఉండదు.

Mr. SPEAKER :— I shall fix ten minutes for each Member. At the outset I wish to mention to the Members that it is only the broad principles that we have to discuss and not go into particulars, not go into local needs and not go into district needs. As the Minister himself said, the House may get another opportunity to discuss all those details, I wish to emphasise that hon. Members should confine themselves only to the principles of the Plan.

Sri P. SUNDARAYYA:— మీరు చెప్పిన విషయమును మనసులో పెట్టుకొన్ననూ 5 నిమిషములలో general policy మీద ఏ ఒక్క విషయము మీద ఎవరూ కూడా చెప్పడం సాధ్యముకాదు. అందుచేత Assembly లో వివిధ పార్టీలున్నాయి కాబట్టి పార్టీ తరఫున ఇద్దరుగాని ముగ్గురుగాని ఉన్నప్పుడు మీరు time ను పంచుకొన్నట్లయితే కనీసము 10 నిమిషములైనా ఉండాలని కోరుచున్నాను.

Mr. SPEAKER:—I will take that aspect into consideration.

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :— proportional గా తీసుకుంటే మా పార్టీ చాలా పెద్దది time చాలదు.

Mr. SPEAKER;— I will consider all those things.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:— మన ఆంధ్రదేశము ఆర్థికంగా వ్యవసాయకంగా ముందు ఉన్నప్పటికి పారిశ్రామికంగా చాలా వెనుకబడి ఉన్నాము. అని మనము అనుకుంటున్నాము. భారతదేశము మొత్తములోకి లెక్కవేస్తే మనమే వెనుకబడి ఉన్నామని తెలుస్తుంది. మనకు ఉన్నటువంటి సహజ సంపద నదులు

(Sri Vavilala Gopalakrishnayya) [3rd August 1955

కావలసిన సౌకర్యాలు ఇచ్చే వనరులు; ఉన్నవి. అటువంటి [illegible] పోషించే వ్యవసాయ పరిశ్రమ అభివృద్ధి చేసుకోవలసి వున్నది. ఆ విధముగా ఇప్పుడు చేసిన plan లో ఎక్కువ భాగము irrigation కు ఉపయోగిస్తున్నాము అని చెప్పినప్పుడు దానిని కాదనలేకపోయినా ఇంకా ఎక్కువ చేయవలెనని చెప్పవలసిన అవసరము ఉన్నది. ఈనాడు ఉన్నటువంటి జనము; వ్యవసాయ దేశములోని జనము వారలకు మరొక పని చూపించే అవకాశము లేకుండా ఉంటే చాలా ప్రమాదము వస్తుందని తెలుసు. అందువల్ల పరిశ్రమను వృద్ధి చేయవలెనని కోరుతున్నాను. అధికారులుగా కేంద్ర ప్రభుత్వమును ఒక పరిశ్రమను పెట్టమని అడుగుతానని మంత్రిగారు చెప్పారు దానికి పూర్తిగా ఏకీభవిస్తున్నాము. అవి గాక మనము.........

(At this stage Mr. Deputy Speaker occupied the Chair)

నిర్వహించ వలచిన నందికొండ ప్రాజెక్టు ఒక్క రాష్ట్ర ప్రాజెక్టు కాదు రాష్ట్రాల ప్రాజెక్టు. అంతేకాకుండా మనము కేంద్ర ప్రభుత్వము భాక్రానంగల్, దామోదరవాలీ వీను కొన్నట్లు దానిని కూడా కేంద్రప్రభుత్వమే నిర్వహించి ఉంటే (నిర్వహణలో మనము సహకరించవచ్చు) మన sector లో కావలసిన డబ్బులో కొంత మిగల్చుకోవడానికి అవకాశము ఉంటుందని దాని పరిశ్రమలకు వినియోగించవచ్చు. ఆ విధముగా మనము కేంద్ర ప్రభుత్వము దానిని national project గా తీసుకోవలసినదిగా కోరుచున్నాను. మనయొక్క రాష్ట్ర అవసరములను ప్రాతిపదికగా తీసుకొని ముందు కేంద్ర ప్రభుత్వమును అడిగితే అది వచ్చిన తరువాత అప్పుడు మాకు కావాలంటే మాకు కావాలి అని వివాద పడవచ్చు కాని అడగే టప్పుడే పోట్లాడితే కోర్టుకు పోయినవాడు ముందు పోట్లాడుకొని కోర్టులో కేసు పాడుచేసుకొన్నట్లు అవుతుందని భయపడుచున్నాను. అందువల్ల యీనాడు ముందుపడిన ప్రాంతాలు వెనుకబడిన ప్రాంతాలు అన్నీ ఉన్నవి. మన ఆంధ్ర రాష్ట్రములో అంటే యీ 11 జిల్లాల రాష్ట్రములోనే కాదు. ఈ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేలోగానే లేక ఈ వర్షమే బహుశా మనము విశాలాంధ్రలోనే ఉంటామని ఆశ మనకు ఉన్నది. ఆ విధముగా సమన్వయము చేసినప్పుడే యీ నందికొండ ప్రాజెక్టుగాని రామపాద సాగర్ గాని ఏ యితర ప్రాజెక్టుగాని ఏకముగా ఒక్కటే రాష్ట్రము నడిపితే చిక్కు లేకుండా పోతుంది. ప్రాజెక్టుల నిర్మాణందృష్ట్యా చూచిన వెంటనే విశాలాంధ్ర అవసరము. ఆ ప్రాతిపదికతోనే ఇవి స్వీకరించాలని నా అభిప్రాయము. ఆ విధముగా స్థానికంగా ఉన్నటువంటి భేదాలు మరచిపోవాలని కోరుతున్నాను.

ఈ రోజున మనకున్న 205 లక్షల జనాభాలో 15 లక్షలు యితర వృత్తులవల్ల జీవనము సాధించుకొన్నట్లు లెక్కలద్వారా తెలుస్తున్నది. ఒక లక్ష మాత్రమే organised labour ఉన్నదని చెప్పుచున్నారు. కనుక మిగిలినవారికి వృత్తులను కల్పించుటకై పరిశ్రమలను వృద్ధిపొందింపవలెను. ఉద్యోగాలకు పోయేవారి సంఖ్య చాలా తక్కువగా నున్నది. మన మిా పంచవర్ష ప్రణాళిక ప్రకారము సం॥ 5% నిరుద్యోగము పోతుందని, దాని ప్రకారం ప్రణాళిక కాలము పూర్తి అగునాటికి 25% మందికి ఉద్యోగాలు చూపించగలమని చెప్పుచున్నారు. ఈ 25% ప్రతివ్యక్తి తన జీవితములో ప్రతిఫలింపబడినప్పుడే అది జీవన ప్రమాణము పెరుగుదల కాగలదు.

రెండవ ప్రధానభాగము పరిశ్రమలుకు యివ్వవలెనని అన్నారు. పరిశ్రమలకు అప్పులు తీసుకొని రావలెనని చెప్పారు. దానికి నేనుకూడా తగుసహాయము చేయలేక

3rd August 1955]   (Sri Vavilala Gopalakrishnayya)

పోతినని బాధపడుచున్నాను. కాని నేను ఇచ్చునది ఏమీకనబడుటలేదు. నేను కేంద్ర ప్రభుత్వమునకు ఒకసారి జాబు వ్రాసితిని. మీరు నందికొండ ప్రాజెక్టును తీసుకొనండి. ఆమాటతో మేము ఊళ్ళల్లోకి వెళ్లి "మీ దగ్గర 100 రూపాయలు ఉంటే 5 రూపాయలు నీ దేశమునకు యివ్వమని అడుగుదాము అన్నాను. అది అప్పుడు జరుగలేదు. నా దేశముకొరకు నేను యిస్తున్నాను, యిది నా ప్రాజెక్టు, నా ఇల్లు నిర్మాణముకొరకు చేస్తున్నాను, అనే ఆశ ప్రజలలో తప్పనిసరిగా కలుగునట్లు చేయాలి. అందుకొరకు తహశ్శీల్దార్లు ఊరులలోకి వెళ్ళినప్పుడు మనముకూడా వారితోపాటు వెళ్ళి, వసూలుచేసి వారికి యివ్వవలసిన బాధ్యత మనపైన వేసుకోవలసి వుంది. అయితే ఇది ఎంతవరకు ప్రయత్నము చేస్తాము అన్నది చెప్పలేను. మనము చిన్న చిన్న కార్మికుని నుండి చిన్న ఉద్యోగస్థునివరకు మనమే మార్గము చూపించినప్పుడే దాని ప్రయోజనము గలదు. ముఖ్యంగా ధనవంతులనుండి అధికముగా ఈ ప్రణాళికకు ధనము వసూలు చేయవలసి ఉంది.

రోడ్ల విషయాము వచ్చినప్పుడు ఆంధ్రరాష్ట్రము చాలా వెనుకబడి ఉన్నది. రోడ్ల అమలు జరుపుటకు 10 కోట్ల రూపాయలు local development క్రింద కేటాయించాము అని చెప్పారు. Village రోడ్లు చాలా అధ్వాన్న స్థితిలో వున్నవి. మిగిలిన రోడ్లు provincial level లోనే ఉన్నాయి. కాని planning వచ్చిన తరువాత ప్రజలలో చాలా ఉత్సాహము వచ్చినది. ప్రతివారు "నా ఊరుకు రోడ్డు లేదే మనముకూడా వేసుకుంటే బాగుంటుంది" అని అనుకొనుచున్నారు. కనుక రోడ్ల విషయము రెండవ పంచవర్ష ప్రణాళికలోనైనా బాగుపరచవలెనని కోరుచున్నాను. తరువాత భూస్వామ్య విధానము వెంటనే రద్దుచేసే పద్ధతి ఆలోచించాలి. ఇందులో అందుకు తగిన విధానము కల్పించడములేదు. అని మనవిచేయుచున్నాను. మన మీనాడు చిన్నరైతు దగ్గరకుగాని, కూలివాని దగ్గరకుగాని డబ్బుకొరకు వెళ్ళినప్పుడు మా కాలు దాకే బిల్లు ఏమైనది అని అడుగుచున్నారు. మాకు భృతి కల్పిస్తారా అని అడుగుచున్నారు. కాని మేము చూపిస్తాము అనడములో లాభములేదు.

ఇవ్వాళ ప్రధానంగా ఆంధ్రదేశం ఎట్లాఅయితే వ్యవసాయికదేశం అనుకుంటున్నామో అట్లాగే భూమి విధానదేశం అనుకుంటున్నాము. వ్యవసాయ దేశంమీద జరుపవలసిన విధానం చూడండి. రెండోది గ్రామ పరిశ్రమలున్నాయి. ఇవ్వాల్టిరోజున అందరికి ఉద్యోగం చూపించే పద్ధతి సాధ్యమవుతుందనుకోను. పెద్ద plan గురించి మాట్లాడితే academic discussion అవుతుందేమోనని భయం. గ్రామ పరిశ్రమలలో ఏవేవి తీసుకురావాలో, దానికోసం వున్న డబ్బులో ఎక్కువ ఉపయోగపరచాల్సి వున్నది. విశ్వేశ్వరయ్య ప్రణాళిక వున్నది. co-operative ప్రణాళిక వున్నది. ఈ రెండింటినీ సమన్వయపరచే పద్ధతిలో తీసుకువచ్చినట్లయితే గ్రామాలలో వస్తూత్పత్తి పరిశ్రమలతో మనం పనిచేయగలుగుతాము. గ్రామ పరిశ్రమలలో నిజముగా ఇప్పుడు 200 కోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నాము. 260 కోట్లలోనూ కాని వాటిని చేసినప్పుడు కొన్ని చోట్ల మాత్రమే పనివస్తున్నది. తక్కినచోట్ల ఏమి పనిచూపిస్తాము ? ఆ పని చూపించడానికి యివ్వాల్టిరోజునుంచీ ప్రయత్నం చేస్తే ఒక్కొక్క ఊళ్లో వున్న సాధకబాధకాలన్నీ చూడాలి. ప్రణాళికలన్నీ ఎవరితోటీ జరుపబడవు. ప్రజలచేతనే జరుపబడతాయి. తమ రక్తంతోటి, తమ మాంసంతోటి తమ కండరాలతోటి నిర్మించుకున్నప్పుడే యిది నాది అనుకోగలుగుతారు. అట్లాంటి విశ్వాసం యివ్వకలిగినప్పుడే యిది పంచవర్ష ప్రణాళిక

అవుతుంది. అందుకోసం యిప్పటిరోజున అధ్యక్షునిద్వారా మీరా అందరికీ మనవిచేసేది యేమిటంటే చైనాలో ఏ పద్ధతిలో జరిగిందో K. L. Rao, కన్వార్సేన్ చైనానుంచి వచ్చినపుడు ఒకపెద్ద పుస్తకం యిచ్చారు. దాంట్లో చైనావారు ఎట్లా పనిచేస్తున్నారో చూపించారు. జనం లక్షల కొలది 3 నెలలు పడుతుందనుకున్నది 10 రోజులలో త్రవ్వారని వారు చెబితే దానికి వెనుక వుండేటటువంటి base యేమిటో ఆలోచించాలి. అది చైనా కావచ్చు, రష్యా కావచ్చు, ఇంగ్లండు కావచ్చు. కాని దాని వెనుకనున్నది ప్రజలు అనేది మరిచిపోకూడదు. ఆ ప్రజలే మనకు కూడా యిక్కడ వున్నారు. వాళ్ళకు కావలసిన సాధన యేమిటంటే ప్రభుత్వం చేసినటువంటి ప్రతి విధానంకూడా ప్రజలయొక్క ఉత్సాహం పురికొల్పేదిగా వుండాలి. వివరాలు వచ్చినపుడు మాట్లాడుతాను. చాలా వివరాలలోకి వెళ్ళవలచను. ఈ పూట వివరాలు మాట్లాడడం యిష్టంలేదు. వెంకట్రావుగారు మాట్లాడినటువంటి ఉన్నత అభిప్రాయాలతో చర్చ జరుగుతున్నపుడు దానిని మరీ క్రిందికి లాగేసి పాడుచేయటం నాకు యిష్టంలేదు. అందువల్ల కొన్ని లోపాలుండ వచ్చు, ఉండకపోవచ్చు. మనమందరముకూడా కేంద్రప్రభుత్వందగ్గర ఒత్తిడిచేసి తీసుకు రావలసిన డబ్బు తీసుకురావడమే కాకుండా మనంకూడా కొంత సహాయంచేస్తే నేను పెట్టిన డబ్బుకు కొంత విలువ వచ్చింది అనుకుంటాను. లేకపోతే ధర్మసత్రం డబ్బు వచ్చింది ఊరికే పోయింది అనే అభిప్రాయం వస్తుంది కనుక మనం అందరంకూడా కలిసి దీనిని జయప్రదం చేయాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

**Sri M. R. APPA RAO** :—అధ్యక్షా, ఈరోజున యీ debate మొదలు పెట్టేటప్పుడు వెంకట్రావుగారు చాల చక్కని ఉపన్యాసము నిచ్చి మనకు కావలసిన విషయాలన్నీ తెలియజేశారు. దాని తరువాత అన్ని విషయాలలో యితరంగా ఎక్కువ మాట్లాడవలసిన అవసరం కనపడడంలేదు. కాని మనకు యీ plan చేయడంలో దాదాపు 244 కోట్లు మనకు plan లో ఏర్పాటు చేసియున్నారు. ఇందులో నందికొండ project కలిపినట్లయితే తగ్గిపోయేటట్లు కనిపిస్తుంది. అందుచేత వారు చెప్పినట్లుగా మనం అందరముకూడా చేయతగ్గ కృషి యేమిటంటే యీ నందికొండ ప్రాజెక్టును Central Government వారే చేయవలసిన అవసరం వున్నది. ఇదివరకు చేసినట్లుగా హీరాకుడ్ డాము, భక్రానంగల్ డాము అసలు చేసినట్లుగా అదికూడా దేశం అంతకీ ఉపయోగించేది కాబట్టి ఒకరినే భరించమనడం న్యాయం కాదు. మన మందరమూ చేయ తగ్గ కృషి అదే. అట్లాచేస్తే దాదాపుగా అన్ని జిల్లాలనుంచి planning కు 500 కోట్లు చిల్లరయిందని చెబుతున్నారు. 250 కోట్లు ఖర్చుపెట్టినట్లయితే మనం కోరిన విషయాలు అయ్యేటట్లు వీలుకల్గించవచ్చు అనడానికి సందేహం లేదు. నందికొండ project విషయంలో ఆలోచించినట్లయితే మెరక ప్రాంతాలకు ఎక్కువ ఉపయోగంలో వుండే ప్రాజెక్టయిది. దీని left side canal లో కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలోని మెట్ట ప్రాంతాలు రాకపోయినట్లయితే అవిశాశ్వతంగా మెరకప్రాంతాలుగానే వుండిపోతాయి. కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలోని M. L. A. లం మేమందరమూ కాబట్టి నూజివీడు, తిరువూరు, చింతలపూడి తాలూకా, తాడేపల్లిగూడెం తాలూకా, కొవ్వూరుతాలూకాలనుకూడా నందికొండ ప్రాజెక్టుక్రింద చేర్చవలసినదిగా కోరు చున్నాము. దీనికి objection యేమి చెబుతున్నారంటే నందికొండ project క్రింద చేర్చనవసరములేదు, గోదావరి project కడుతున్నాం, ఇందులో కొన్ని దానిక్రిందకు

3rd August 1955] (Sri M. R. Appa Rao)

వస్తవని చెబుతున్నారు. ఆ వచ్చే గోదావరి project కు వున్న level చాల తక్కువ అని తెలుస్తున్నది. దాని క్రింద వచ్చే ప్రాంతమయినా వదలిపెట్టేకి, దానిక్రింద రాని ప్రాంతాలైనా నందికొండ ప్రాజెక్టుక్రింద చేర్చవలసినదని కోరుతున్నాను. యిందాక Forest Conference కూడా జరిగింది. అందులో తేలిందేమిటంటే ఇప్పుడు forest ప్రదేశములుగా వున్నవి ఎప్పుడూ Forest ప్రదేశాలుగానే వుండాలని దేశంలో కొంత అడవులు వుండాలని కాబట్టి యీ forest యిప్పుడున్నచోటే వుంచాలని యిప్పుడు వెనుకబడివున్న ప్రదేశాలు ఎప్పుడూ వెనుకబడి వుండేటట్లు చూపించే పరిస్థితులు కనబడుతున్నాయి. అట్లా కాకుండా నూజివీడు తాలూకా చూచినట్లయితే సాగుచేసే భూమికంటే forest భూమి చాల ఎక్కువ వున్నది సాగులో వుండే భూమి 400 ఎకరాలు, 500 ఎకరాలుంటే forest 2000 ఎకరాలు, 3000 ఎకరాలు. 1500 ఎకరాలు వున్నది. Chief Engineer గారు 2 లక్షల ఎకరాల కంటె ఎక్కువ forest వున్నది. 2 లక్షల ఎకరాలకు provision చూపిస్తాం అని చెప్పారు సగము forest గా వుంచినా మిగిలిన దానిని సాగుచేసేదానికి ఏర్పాటుచేయక పోయినట్లయితే అది యేమీ న్యాయంగా వుండదు. ఇప్పుడు backward areas క్రింద కొంత provision plan లో వేశారు. Backward రాయలసీమ జిల్లా, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు మాత్రమే చేర్చారు. అంతే కాకుండా కృష్ణాజిల్లాలోను, West Godavari జిల్లాలోను backward taluks వున్నాయి. కృష్ణా జిల్లాలో నూజివీడు, తిరువూరు నందిగామ తాలూకాలు రాయలసీమ ప్రాంతాల పరిస్థితులకు తీసిపోవు. అందుచేత backward areas అని ఆ జిల్లాలనే ప్రాతిపదికగా తీసుకోకుండా అన్ని జిల్లాలలోని తాలూకాలు backward గానే ఉన్నవని తప్ప ఈ backward taluks కు చాలా అన్యాయం జరుగుతుంది. కాబట్టి తాలూకాల ప్రాతిపదికమీద backward areas నిర్ణయించాలని కోరుతున్నాను. తరువాత బుడమేరు project చేర్చినందుకు సంతోషిస్తున్నాను. విద్యావిషయంలోకి వచ్చినట్లయితే విశ్వవిద్యాలయం క్రింద అసలు provision కనపడలేదు. Secondary education క్రింద వున్నదాంట్లో విశ్వవిద్యాలయాలు, ఆంధ్ర విశ్వవిద్యాలయం మాట ఎక్కువ యిందులో కనపడలేదు. క్రింద యిచ్చిన details లో వేయలేదు అనుకుంటాను. ఆంధ్ర యూనివర్సిటీకి University Grants Commission ఒక కోటి రూపాయలు యిచ్చేటట్లుంది. దానిలో $\frac{1}{3}$ వంతు Government యివ్వవలసి వున్నది. Venkateswara University కి, Madras విశ్వవిద్యాలయానికి $\frac{1}{3}$ grant అంటే, దాదాపు 30 లక్షలు రూపాయలు యిస్తేనే తప్ప, University Grants Commission నుండి కోటి రూపాయలు తీసుకోడానికి వీలుండదు. ఆంధ్ర యూనివర్సిటిలో Geology శాఖ వారు చాలచోట్ల—జగ్గయ్యపేటలో ఇనుము గనులు, East Godavari లో natural gases కనిపెట్టారు. University లుకూడా యిప్పుడు ప్రజా జీవితంలో ప్రభుత్వ industries కు సహాయపడడానికి వీలుగా వుంటుంది. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి 30 లక్షలు, 40 లక్షలు provide చేయకపోతే Central Grant పోతుంది. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి నష్టం కలుగుతుంది అని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. Engineering College యీ సంవత్సరం పెట్టారు. ఇది చాల అభివృద్ధికరమైనటువంటిపని. Medical College జిల్లా కొకటి పెట్టే విషయం plan లో లేదు. తరువాత

(Sri M. R. Appa Rao) [3rd August 1955

వీటన్నిటికీ డబ్బు సంపాదించడం ఎట్లా అని ఆలోచిస్తున్నాం అనిన్నీ, loans float చేస్తున్నాం అనిన్నీ అన్నారు మంత్రిగారు. Save చేయాలి, inflation లేకుండా deficit finance వల్ల పూర్తిచేయాలని చెప్పారు. నేను ఒక పుస్తకంలో చదివాను. రష్యా మొదలైనచోట్ల అమలుపెట్టారు. అదేమిటంటే State lotteries. గవర్నమెంటు అధ్వర్యాన లాటరీలు నడపడం దేశం అభివృద్ధికరమైన పని కనుక Central Government ఒప్పుకుంటారనుకుంటాను. తరువాత సావకాశంగా యితర details మాట్లాడుతాను. శలవుతీసుకుంటున్నాను.

Sri M. NAGESWARA RAO :— అధ్యక్షా! Planning మంత్రిగా శ్రీ కళా వెంకటరావుగారు వుండడమువల్ల వారు యీ Planning ను అంతాకూడా సమీక్షచేసి, చాల విపులముగా చేసి ఆంధ్రదేశముయొక్క భావిభవిష్యత్తుకు ఎల్లలు నిర్మించటానికి చాలా తీవ్రమైన కృషి చేయగలరనే నానమ్మకము. కాని ఈ మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభించేటపుడు పండిట్ జవహారిలాల్ నెహ్రూగారు ముఖ్యంగా ఒక్క విషయము చెప్పారు. పంచవర్ష ప్రణాళిక అంటే ప్రాజెక్టులు, గోడ్లు, పరిశ్రమల వృద్ధి చేయడమే కాదు. వాటితోబాటు మానవశక్తి, సంఘసంక్షోభము కూడా ప్రధాన ఆశయముగా పెట్టుకొని యీ రెంటిని ఒకేసారి ఒక అంతస్థులోనికి తీసుకొచ్చిననాడే దేశముయొక్క సౌభాగ్యము, దేశముయొక్క శక్తి ఆధారపడి వుంటుందని చెప్పిన విషయాన్ని నేను మంత్రిగారికి జ్ఞాపకము చేస్తున్నాను. ఐతే యీనాడు యీ మానసిక వికాసానికి పంచవర్ష ప్రణాళికలో ఆసించినంతేకాదు, అసలు దాని స్వరూపమే ఏమి కనబడకుండా ఇప్పటివరకూ present చేసినటువంటి plan స్వరూపములో ఎక్కడా ఏమి కనబడలేదు. ఎంత సమీక్ష చేసినప్పటికి కూడా వెనుకబడిన జాతులకు హరిజనులకూ ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో వున్నపుడు సంవత్సరానికి కోటి రూపాయల పైగా కూడా మనము నిధిని కేటాయించాము. కాని ఇప్పుడు కేటాయించినది చాలతక్కువే. దీనితోబాటు ఈనస్యనే సంక్షేమశాఖా మంత్రిగారైనటువంటి లచ్చన్నగారు చెప్పుతూ మన రాష్ట్రములో 70 లక్షలమంది వెనుకబడిన జాతులవారున్నారన్నారు. ఈ 70 లక్షల మందిని వదలిపెట్టితే ఇంకా దాదాపు 150 లక్షల మంది యితరజాతులవారు కూడా వున్నారు. వారిలోకూడా నిరంతరము కూలితో జీవించేటటువంటి జనము చాలమంది వున్నారు. వారంతాకూడా మధ్యతరగతివారే. మధ్యతరగతి అభ్యాగతులకు ఏవిధమైనటువంటి ఆదరణ ప్రభుత్వము చేయక వదలితే కొంతకాలము—అసలు ఆంధ్రదేశచరిత్ర మనకందరికీ తెలిసిందేగనుక ఆంధ్రదేశములో వున్న రాజకీయ చైతన్యము మరేదేశములోకూడా లేదనేదానిలో ప్రతివారుకూడా ఏకీభవిస్తారు. ఒకప్పుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చెప్పారు. "సకలోద్యముల వ్యాప్తి కకలంక నిలయమై శరణిచ్చు పురము గుంటూరు పురము" అని కాని అదిమాత్రము కాదు. ఈనాడు ఒక చిన్న సవరణ వున్నది. "సకలోద్యముల వ్యాప్తి కకలంక నిలయమై శరణిచ్చు దేశము ఆంధ్రదేశము" అని ఈమధ్యనే గీత కార్మికులయొక్క అలజడి జరిగింది. చేనేత కాంగ్రెస్‌యొక్క సత్యాగ్రహము జరిగింది. వీటినన్నిటిని కూడా ప్రభుత్వము గుర్తించింది కాని యీ మధ్యతరగతి ప్రజలకు ఏవిధమైనటువంటి సౌకర్యము కల్పించడానికి ఈనాడు ప్రభుత్వము తలపెట్టకపోవడము చాల విచారకరమైన విషయము. Middle Classes Industrialisation కావాలని అంటున్నారు. Middle Classes ను గురించి నేను చెప్పేది ఏమిటంటే,

3rd August 1955]     (Sri M. Nageswara Rao)

మానవ వికాసము కోసము వారి విద్యా సౌకర్యాలకోసము వారికి చేయించుచున్న కృషి శూన్యము. సాంఘికముగా పైకి వచ్చి ఆర్థికంగా లోపించినవారిని అంతటితో వదలితే ఎప్పుడుకూడా సంఘములో ఒక అంగము చాల నిర్వీర్యమైనపుడు దేశానికి సుఖములేదు. అందువల్ల వారిని కూడా దృష్టిలో పెట్టుకొని వారికి కూడా ఒక నూతన తేజస్సు కలుగ జేయాలి. మళ్ళీ ఆంధ్రదేశములో మధ్యతరగతి ఉద్యమాన్ని లేవదీసి వివిధ దృక్పధ ములతోటి నడచి యీ రాజకీయ ఇతరత్రా పార్టీలకు మరల అవకాశము కల్గించి ఆనాడు ప్రభుత్వానికి ఒక సమస్యగా వచ్చినపుడు యింత వివేకము కలిగినటువంటివారు, యింత అనుభవము కలిగినటువంటివారు ఈ మంత్రి మండలివారు ఈ సమస్యను యితరులకు వదలి పెట్టారు. వదలిపెట్టేటట్లుచేశారు అనేటటువంటివారు లేకుండాచేయవలసి యున్నదని నేను ముఖ్యంగా మంత్రిగారిని కోరుతున్నాను. రెండవది – ఆంధ్రదేశములో పరిశ్రమలు ఏవి లేవన్నారు. పంచవర్ష ప్రణాళికయొక్క స్వభావముకూడా దేశములోవున్న ముడిపదార్థా లను అన్నిటినికూడా మనస్సులో పెట్టుకొనే చేయవలసినటువంటి అవసరము ఎంతో వున్నది. ఈనాడు ముఖ్యంగా ఆంధ్రదేశములో పండేటటువంటి పొగాకు పంటమీదనే కేంద్ర ప్రభుత్వానికి సాలుకు 40 కోట్ల రూపాయలు excise వస్తుంది. 38 కోట్ల చిల్లర దాకావున్నది. ఇప్పుడు 40 కోట్లవరకూ పెరిగితే పెరిగివుండవచ్చును. అటువంటి పరిస్థితు లలో ఒక్క ఆంధ్రదేశములో పండే పంటకే 28 కోట్ల రూపాయలు సాలీనా ఆదాయము వస్తూ వుంటే యీ 5 సంవత్సరముల ప్రణాళిక సాదన సంపత్తికి మనకు ఉపయోగ పడుతూవుంటే దాదాపు 140 కోట్ల రూపాయలు యీయొక్క పొగాకు పన్నుమీదనే ప్రభుత్వానికి వస్తూవున్నప్పుడు ఒక కోటి రూపాయలు పెట్టి కేంద్ర ప్రభుత్వమువారి చేత పొగాకు Factory ని మీరు పెట్టించలేము అంటే అది వీరి అసమర్థతగా మనము ఆలోచించుకోవలసి నటువంటి విషయము దీనిపైన తీవ్రమైనటువంటి ప్రజల అలజడి కోసము ప్రభుత్వము లొంగడము పొగాకు పండించే రైతులవల్ల వచ్చేటటువంటి యిన్ని కోట్ల రూపాయలు వస్తున్నాకూడా వారు కేవలము విత్తనాలు సంపాదించుకునే స్థితిలో లేకుండ వున్నారు. అమెరికాలోని వర్జీనియా seed చాల ప్రసిద్ధి చెందినది. 1930 వ సంవత్సరములో అక్కడనుంచి ఇండియాకు పంపించాలంటే అమెరికాలో వున్నటువంటి Senate అంతాకూడా unanimous గా ఇండియాకు విత్తనము పంపించకూడదని pass చేశారు. ఆంధ్రదేశములో యీ పంటకు కేంద్ర ప్రభుత్వానికి వాణిజ్యపంటలకు వచ్చేటటువంటి సుంకాలలో ప్రథమ స్థానము వహించినది. అటువంటి ముడిపదార్థాన్ని అక్కడ వున్నటువంటి రైతులకు అందరికి కూడా సరియైనటువంటి ధర రాబట్టడానికి కొన్ని లక్షలమందికి కూడా ఉద్యోగాలు కల్పించడానికి మంత్రిగారు యీ మధ్యనే సెలవిచ్చారు. పరిశ్రమలు కల్పించే టట్లుగా వుంటే కొంతమందికి ఉద్యో గముకూడా వస్తూంటుంది. పొగాకులో grading విషయములోకానివ్వండి, పొగాకు యొక్క moisture అటువంటి పరిస్థితులన్నీ తెలిసినటువంటి వారంతా ఆంధ్రదేశ ములోనే ఎక్కువమంది వున్నారు. వారందరికీ అవకాశము కల్పించ డానికి నంది కొండ ప్రాజెక్టు ప్రజల ఆందోళనతోటి 130 కోట్లు ఖర్చు పెట్టేటటువంటి నందికొండ ప్రాజెక్టును సంపాదించిన యీ మంత్రివర్గము ఒక కోటి రూపాయలనిధి తోటి కేంద్రి

ప్రభుత్వము అన్ని విధాల సహకారముచేసి వారియొక్క శక్తి సామర్థ్యాలను వినియోగించి అర్థించో నయానో్న భయానో్న ఏరకముగనో ఒక Tobacco Factory ని ప్రభుత్వము తరపున నడిపించడానికి తీవ్రమైన కృషి చేయవలసిందని చెప్పి వారికి నేను మనవి చేస్తున్నాను. Cigarette Factory ని స్థాపించేటట్టు చూడవలెను. తర్వాత ఇప్పటికి మనదేశములో జరుగుతున్న ప్రథమ పంచవర్ష ప్రణాళికలో వున్నటువంటి అనుభవాన్ని పట్టి చూస్తే అనేక చోట్ల village level workers గా పని చేసేవారు కానివ్వండి, Block Development officers గా పని చేసే టువంటి వారు కానివ్వండి గ్రామాలకు వెళ్ళగానే మన గ్రామ ఆచారప్రకారంగా మీవూరు నాయనా ఏమి చదివినావు? ఏ కులమునీది? అని అడుగుతూ వున్నారట. ఇది కేవలము నా స్వవిషయముకాదు. భారతిసేవకు కురుక్షేత్ర పత్రికలలో ప్రచురించిన విషయాలను మాత్రము నేను చెప్పుతున్నాను. Block Development officer గా ఎవరో Singh ఉత్తరాది దేశస్థుడు పని చేస్తున్నాడు. అక్కడ ఒక village level worker తన అనుభవాన్ని వ్రాశారు. Block Development Officer కాని Village Level Officer కాని యిందులో పని చేసేవారు తమ కులాలను గ్రామాలకువెళ్ళినపుడు చెప్పమనే ప్రతిజ్ఞ తీసుకునే గ్రామాలకు పంపించడము చాల మంచి దన్నారు. అందు వల్ల కొంత అభివృద్ధికరమైనటువంటి ఆచర్యాన్ని కూడా ఆంధ్ర ప్రభుత్వము తీసు కుంటుందని నేను ఆశిస్తున్నాను. 1950 సంవత్సర ప్రాంతములో కూడా ఉమ్మడి రాష్ట్రముగా వున్నపుడు Central Government నుంచి ఒక్క విశేషమైన సలహా వచ్చింది. ఈ Reforms Marriage ని గురించి అన్యాంతర అన్యవర్ణాంతర వివాహాలు చేసుకున్నటువంటి వాండ్లకు ప్రభుత్వము ఏదైనా సౌకర్యము కల్పింస్తుందని. అప్పుడు వెంకటరావుగారు కూడా ఆ ప్రభుత్వములో వున్నారు. తమరు మాతో సభ్యులుగా వున్నవిషయము మాకు కూడా జ్ఞాపకము వున్నది. మీకు కూడా తెలుసు. అప్పుడీ ప్రభుత్వమువారు దానికిసరియైన సమాధానముకూడా యివ్వకుండా పంపించారు. ఏమైతేనేప్పటికీ ఇప్పుడు యీ వర్ణాంతర వివాహాలు చేసుకొనే వాండ్లకు లేదా వారిపిల్లలు ఎవరైనా చదివే అర్హత కలిగినటువంటి వాండ్లకే యీ Community Project Development officers ఉద్యోగాలు యిస్తే బాగుంటుంది. కులతత్వ నిర్మూలనము కావడానికి ఒకప్పుడు తెన్నేటివిశ్వనాథంగారు 1948 సంవత్సరంలో Congress Legislature Party కి ఒక తీర్మానాన్ని పంపించారు.

Sri R. B. RAMAKRISHNA RAJU:— ఈ సూత్రము మంత్రులకు కూడా అన్వయిస్తుందా ?

Sri M. NAGESWARA RAO:—రాజుగారు కళాప్రియులే కాకుండా సాంఘిక సంస్కరణప్రియులనికూడా మాకు తెలుసు. అసలుచేయడానికి మీరుకూడా సహకరిస్తే అదికూడా జరుగుతుందని నేను నమ్ముతున్నాను. రెడ్డి, చౌదరి, నాయుడు, పిళ్ళె, పంతులు, శాస్త్రి, శర్మ లని యీ తోకలన్ని తీసివేయమనిచెప్పి ఆనాడు కాంగ్రెస్ Legislature పార్టీకి ఒక తీర్మానము పంపడములో మేమంతాకూడా కలసి ఒకఅభివృద్ధి కరమైనటువంటి సలహా యిచ్చాము: అదేమిటయ్యా అంటే, ఒక కులమువాడు ఆ కులము లోనే 10 సంవత్సరాలో లేక 15 సంవత్సరాలో వివాహాలను చేసుకోకుండా నిషేధించే

ట్లుగావుంటే మళ్ళీ యిక మా కులము మా కులమని యీ దౌర్భాగ్యస్థితిలో ఉండదు. ఆంధ్రజాతి కులతత్వవాదులజాతి కాదనే టటువంటి యొక్క గౌరవముకూడా సంపాదించడానికి యీ సంఘ సంస్కరణనుకూడా అమలులో పెట్టడము చాల అవసరమని నేను శ్రీ మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

Mr. DEPUTY SPEAKER :— సభ 2-45 గంటలకు మరల సమావేశమౌతుంది.

(After Lunch — 2-45 P. M.)

Sri PILLAMARRI VENKATESWARLU:— అధ్యక్షా! ప్లానింగ్ మంత్రిగారు ఆంధ్రదేశానికి రెండో పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెడుతూ దాని అవసరం ఎంత ఉన్నదో నచ్చచెప్పడానికి అన్నిరసాలూ కలిపి విదితం చేశారు. దాని అవసరాన్ని నొక్కిచెబుతూ ఏమైనాసరే ఈ Plan జయప్రదంగా అమలుజరపటానికి యావదాంధ్ర దేశం కృషిచేయాలని విజ్ఞప్తిచేశారు. వారి విజ్ఞప్తి కేవలం మన శాసనసభా సభ్యులకేగాక బైట ఉండేటటువంటి యావత్ప్రజానీకానికీకూడా ఉద్దేశింపబడింది. యావత్ప్రజానీకం వారి విజ్ఞప్తి అందుకునేటట్లుగా ఈ Plan పనిచేస్తుందని నేను ఆశిస్తున్నాను. మేము ఏమైనా సవరణపెట్టినా, సూచనలుచేసినా, విమర్శించినా ఆ దృష్టినుంచే తీసుకోమని మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను. మున్ముందు ఈ Plan ను గురించి చెప్పేటప్పుడు మేము ఏదో ఇతర దేశాలలో ఉండేటటువంటివిధంగా ఇక్కడకూడా Plan చెయ్యాలని కోరుతున్నామని గాని, ఆ రకమైన భావాలతో ఉండవద్దని కాంగ్రెస్‌పార్టీవారికీ, మంత్రిగారికీకూడా విజ్ఞప్తి చేస్తున్నాను. ఏదేశమైనాసరే ఆదేశానికి అనుకూలమైనటువంటి Plan లు వేసుకోవాలి. అక్కడున్న ప్రజలకు అనుకూలంగా ఆ దేశాన్ని అభివృద్ధిచేసుకునేందుకు ఆ Plan ఉపయోగపడేటట్లుగా చూడాలి. ఆ అభివృద్ధి యావత్ప్రజానీకం అనుభవించేందుకు వీలుగాకూడా Plan తయారు కావలసిన అవసరం ఉన్నది. ఈ దృష్టితోనే మేము ఈ Plan ను చూస్తున్నాం. ముఖ్యంగా Plan జయప్రదం కావాలని మేమంతా కోరుతున్నాం. ఇంతమాత్రమేకాదు. ఈ 244 కోట్లు మాత్రమేకాదు. మనం ఎంత ఎక్కువ ఖర్చుపెట్టి ఎంత త్వరగా ఆంధ్రదేశాన్ని అభివృద్ధి చేసుకోగలిగితే అంత ఎక్కువగా మేముకూడా మంత్రిగారితోపాటు సంతోషించి దేశం ముందుకు పోయిందని వారిని అభినందించడానికి మాకు ఏవిధమైనటువంటి అభ్యంతరంకూడా ఉండదు. ఐతే ఈ Plan చూసినప్పుడు ఒక్కవిషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది. దేశం మొత్తంమీద All India basis మీద, చాలా పెద్దప్లానే వేశారు. సుమారు 5400 కోట్లరూపాయలు మొత్తంమీద ఐదుసంవత్సరాల మీద ఖర్చుపెట్టడానికి Plan వేసుకున్నారు. ఆంధ్రదేశానికి 244 కోట్లరూపాయలు అని చెప్పారు. మంత్రిగారిఉపన్యాసంచివరిభాగంలోమనం ఏ విధంగా డబ్బుసేకరిస్తామనే దానికి, చివరకు నేనుకూడా చెబుతాను ఆ విషయాన్ని గురించిఅన్నాను. మొట్టమొదట ఏమిచెప్పదలచుకున్నానంటే, ఈ నాడు ఆర్థికంగానూ అన్నివిధాలా వెనుకబడి యున్నటువంటి మన ఆంధ్రదేశం పారిశ్రామికంగా వెనుకపడి యున్నటువంటి మన ఆంధ్రదేశం National income లో అన్ని రాష్ట్రాలకంటే కూడా ఎంతో తక్కువగా ఉన్నటువంటి, National income per capital చూచుకున్నప్పుడు కూడా చాలా తక్కువగా యున్న మన ఆంధ్రదేశం ముందుకు పోవాలనేటట్లయితే, ఇంకా మనం ఎంత ఎక్కువ ఖర్చుపెట్టుకోడానికి వీలవుతుందో మన శాసనసభాసభ్యులు, మంత్రివర్గం అందరం కృషిచేయవలసిన అవసరం ఉందని

(Sri Pillalamarri Venkateswarlu) 3rd August 1955

మాత్రం నేననుకుంటున్నాను. అందువల్ల మనం ప్రధానంగా ఇది మానేటప్పటికు, మంత్రిగారు చెప్పినటువంటి మాటలలోనే మన దేశాన్ని పారిశ్రామికంగా ఏ విధంగా ముందుకు తీసుకుపోవడం, ఏ విధంగా పరిశ్రమలు అభివృద్ధి చేసుకోడానికి పూనుకోవాలి అనేటటువంటి angle నుంచికూడా చూడాలని నేనుకూడా నమ్ముతున్నాను. ఐతే ఈ పుస్తకం అంతా చదివినప్పుడుగాని, మంత్రిగారి ఉపన్యాసం విన్నప్పుడుగాని మన minerals అనగా మన ఖనిజ సంపదను ఏ విధంగా ఉపయోగించుకోబోతామనే విషయం మాత్రం రాలేదు. అయితే ఇది కేంద్రప్రభుత్వం చేయబోతున్నదా అంటే ఆ విషయం ఇదివరలోగాని, ఇప్పుడిచ్చిన ఉపన్యాసంలోగాని ఎక్కడా కూడా చెప్ప లేదు. మనకు తెలుసును మన ఆంధ్రరాష్ట్రంలో ఉన్నటువంటి ఖనిజసంపద భారత దేశం మొత్తంమీద ఎక్కడా లేదేమోగాని దాదాపు అన్నీ మనకు ఉన్నాయి. బంగారం ఉంది, వజ్రాలున్నాయి, ఇనుముంది, అన్నీ ఉన్నాయి. అన్నీ ఉన్నప్పటికీ ఈ ఖనిజ సంపదను మనం ఏ విధంగా అభివృద్ధి చేసుకోవాలనేది మాత్రం Planning లో ఎక్కడాలేదు. ఒక్క విషయం మాత్రం దానిలో అవుపడుతుంది. Ferro Manganese విషయం ఊరికే mention చేశారు. దానికి కూడా వివరాలు ఏమీ ఇవ్వలేదు. మేము ఇప్పటికికూడా కోరేది ఏమిటంటే, మనయొక్క ఖనిజసంపదను ఎక్కువ చేసుకో డానికి Plan లో కొంత కేంద్రప్రభుత్వం కేటాయిస్తేసరి, లేకపోతే మనమైనాసరే కేటాయించుకోగలిగే నటువంటి అవసరం ఉన్నదని మాత్రం నేను అనుకుంటున్నాను. మనకు coal కూడా అనగా రాక్షసి బొగ్గు ఉన్నట్లు report లున్నాయి. 1890-95 మధ్యన గోదావరిలో ఒక కంపెనీపెట్టి 36657 టన్నుల బొగ్గు తయారుచేసినట్లుగా కూడా report లో ఉంది. అలాంటప్పుడు మళ్ళీ తిరిగి దీన్నంతా పరిశోధన చేసి ఏ విధంగా మనం ఈ సంపదనంతా కూడా అభివృద్ధిచేసుకోవాలో కూడా పునరాలోచించాలని మాత్రం అనుకుంటున్నాను. మనకు రాగికూడా ఉంది. వీటన్నిటినీ వృద్ధిచేసి ఈ 5 సంవత్సరాలలో ఎంత ముందుకు పోగల్గుతామో తెలుసుకోవలసిన అవసరంఉంది. ఆ భాగం మంత్రిగారి ఉపన్యాసంలోనూ ఈ plan లోనూ కూడా పూర్తిగా లోపించిందని నేననుకుంటు న్నాను. దీనికి పెట్టుబడి పెట్టడానికి private వ్యక్తులు ముందుకు రాలేక పోవచ్చును. ఆంధ్రదేశం పారిశ్రామికంగా వెనుకపడి యుండడం పెద్ద పెద్ద పరిశ్రమలు నెలకొల్ప డానికి శక్తిసామర్థ్యాలు కలిగి ఆర్థిక స్తోమతు కల్గినవారు ఎవరూ లేక పోవడంవల్ల ఈ plan లో ఉన్న పారిశ్రామిక development కు private వ్యక్తులెవ్వరూ ముందుకు రాలేకపోవచ్చును. అలాంటప్పుడు మన కర్తవ్యము ఏమిటి? మనకు వచ్చిన సమస్య ఇదే. ఏ విధంగా మన ఖనిజ సంపదను అభివృద్ధి చేసినా నాకేమీ అభ్యంతరం లేదు. ఎవరైనాసరే మన ఆంధ్రరాష్ట్రములో యున్నటువంటి వ్యక్తులు పెట్టుబడి పెడితే చాలా సంతోషమే, మనవాళ్లు పెట్టలేకపోతే బైటనుంచి వచ్చిన వాళ్ళయినా పెట్టుబడిపెట్టి మన ఖనిజసంపదనంతా అభివృద్ధిచేసి మన ఆంధ్ర దేశాన్ని ముందుకు తీసుకువెళ్ళడానికి తోడ్పడాలనికూడా నేను కోరుతున్నాను. అది plan లో ఎక్కడా అగపడలేదు. దీని విషయమై కేంద్ర ప్రభుత్వం చేయబోతోందని చెబితే సంతోషిస్తాను.

కేంద్ర ప్రభుత్వము చేయబోతున్నది అంటే సంతోషమే కాని, చేయాలి అనేటటువంటి ఒత్తిడి తీసుకురావలసిన అవసరం ఉన్నది. మన ఖనిజ సంపద నంతటిని ఇట్లాగే వదలిపెట్టడం మంచిదికాదని మంత్రిగారికి విన్నవించుకొంటున్నాను.

3rd August 1955] (Sri Pillalamarri Venkateswarlu)

తరువాత పరిశ్రమల విషయంలో కూడ నిజమే. మొదట 11 కోట్లు వేసినప్పటికినీ తరువాత 15 కోట్లకు పెంచడం జరిగింది. ఈ 15 కోట్లతో మనం పరిశ్రమలను ఎంత పెంచుతాము అని కాదు. ఇంకొక ప్రధానమైనటువంటి విషయం ఉన్నది. మన Plan లో ఇచ్చినటువంటి రిపోర్టులో ఈ రోజున private వ్యక్తులతో కలసి ప్రభుత్వమే పెట్టడానికి అవకాశం కల్పించుకొన్నది అనేది Planning Commission వారు కూడ అంగీకరించారు అని స్పష్టంగా చెప్పారు. అందుకు సంతోషిస్తున్నాము. కాని ఇప్పుడు మనం Cement Factories పెట్టుకొంటున్నాము. పంచదార మిల్లులు పెట్టుకొంటున్నాము. మనం అయిదు సంవత్సరాలకు plan వేసుకొన్నాము కాని దీనికి మనకు ఎంత సిమెంటు కావాలి, ఎంత సిమెంటు తయారు కాబోతున్నది అనేటువంటి అంచనా ఏమీలేదు. నేను జాగ్రత్తగా చూచాను. మనకు ఇంత సిమెంటు కావాలి అనేది మాత్రం ఉన్నది కాని ఎంత సిమెంటు తయారు కాబోతున్నది అనేది లేదు. మనం బ్రహ్మాండమైనటువంటి Irrigation Projects, Power Projects, పరిశ్రమలు పెట్టాలని కోరుతూ వీటికి ఎంత సిమెంటు కావాలి, ఎంత తయారు కాబోతున్నదనే అంచనా లేకపోయినట్లయితే కష్టము. ఇతర రాష్ట్రాలమీద ఆధారపడవలసిందే అంటారేమో కాని ఇతర రాష్ట్రాలకు కూడ Plans ఉన్నాయి. ఏ రాష్ట్రాలకు ఆ రాష్ట్రాలు Plans వేసుకొని ముందుకు పోవడానికి ప్రయత్నం చేస్తున్నాయి. అలాంటప్పుడు ఈ సిమెంటు మనకు ఏ విధంగా దొరుకుతుందనే ఆందోళన మాత్రం ఉన్నది. దానికి తగిన విధముగా ఈ plan ను కొంచెము మార్చుకోవలసిన అవసరం ఉన్నదను కొంటాను. ఇప్పుడు Cement Factories ఒకటి, రెండేకాదు. ఎన్ని పెట్టినాసరే, వాటియొక్క అవసరం ఎంతైనా ఉన్నది. మన రిపోర్టులో 17,54, 42 టన్నుల సిమెంటు మనకు కావాలి అని ఉన్నది. కాని ఇప్పుడు సిమెంటు ఎంత ఉన్నదో తెలియదు. మనము పెట్టేటటువంటి factories లో ఎంత తయారుచేస్తారనే అంచనా కూడ తెలియకుండా ఉన్నది. మనకు Planning అనేది ఉన్నప్పుడు, మన అవసరాలను, ఉత్పత్తిని ఈ రెండింటిని balance చేసే విధంగా ఉండాలి. లేకపోతే ఈ Planning జయప్రదంగా ఉండదనుకొంటాను. అందుకు దానిని తగినవిధంగా మారుస్తారని ఆశిస్తున్నాను.

తరువాత మనకు ఏదో ఒక భారీ పరిశ్రమను తప్పకుండా వచ్చేటట్లు చేస్తామని ఇందాక మంత్రిగారు చెప్పారు. తప్పకుండా దానిని మనం సాధించవలసియున్నది. అవసరమైతే, మనమందరు ఏకగ్రీవంగా ఈవిధంగా మన ఆంధ్రరాష్ట్రములో తప్పకుండా భారీపరిశ్రమలు పెట్టాలి అని తీర్మానంచేసి పంపిస్తాము. బీహారు, బెంగాల్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో పెద్దపెద్ద Iron Factories పెట్టడానికి కేంద్రప్రభుత్వము నిర్ణయించుకొన్నది. అందుకు మనముకూడ సంతోషిస్తాము కాని మన ఆంధ్రరాష్ట్రములో కూడ భారీపరిశ్రమలు పెట్టవలసియున్నది. అవి పెట్టకపోతే, మనం ఎల్లప్పుడు ఇదే విధంగా తక్కువ standard of living తో ఉండవలసియుంటుంది. Fertiliser Factory తో పాటు, heavy electrical machine building industries, Steel fabricating factory కూడ, ఈ మూడున్నూ తప్పనిసరిగా మన ఆంధ్రదేశంలో పెట్టాలి అని మనం గట్టిగా కేంద్రప్రభుత్వాన్ని ఒత్తిడిచేయవలసిన అవసరం ఉన్నది. మన మంత్రివర్గము, మన శాసనసభ అంతాకూడ ఈవిధంగా ఏకగ్రీవంగా తీర్మానంచేసి కేంద్రప్రభుత్వ దృష్టికి తెచ్చినప్పుడు, ఆంధ్రదేశము పారిశ్రామికంగా

వెనుకబడినదనే చిన్న సత్యాన్ని గుర్తించినప్పుడు, కేంద్ర ప్రభుత్వము తప్పనిసరిగా ఈ మూడు factories ఇవ్వాలి అనేదానిలో ఏ మాత్రం అనుమానం ఉండదు, లేదు. మనం కనీసపు కోర్కెలనుమాత్రమే కోరుతున్నాముగాని ఏ చంద్రుడునో, ఇంద్రుడునో యివ్వమని కోరడంలేదు. అందువల్ల దీనిమీద చాలా ఒత్తిడి తీసుకురావలసిన అవసరమున్నది. ఇదివరకు మన రిపోర్టులో అటువంటిది ఏమీ కన్పించలేదు. మన పరిస్థితి, మన అవసరాలు అక్కడ కేంద్రంలో కూర్చున్నవాళ్లు గుర్తించినప్పటికీ, వత్తిడిచేవాళ్ళు మనవాళ్ళు కానప్పుడు కష్టము. అందువల్ల దీనిని దృష్టిలోపెట్టుకొని, ఏమైనాసరే, ఈ మూడు పెద్ద factories ను మనము సంపాదించడానికి విపరీతంగా కృషిచేయాలని మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను. అవసరమైతే శాసనసభలో ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేసి పంపిద్దాము.

తరువాత cigarette factory గురించి చెప్పారు. బ్రహ్మాండమైనటువంటి భారతదేశములో సుమారు నూటికి 45 వంతులు పొగాకు మన ఆంధ్రదేశములోనే పండిస్తున్నాము. దీనివల్ల కేంద్రప్రభుత్వానికి 17, 18 కోట్లు ప్రతిసంవత్సరం Excise duty ద్వారా ఆదాయం వస్తున్నది. ఇదివరకు మనం మద్రాసు ప్రభుత్వంతో కలసి ఉండడంవల్ల మనము అనేక అన్యాయాలకు గురిఅయ్యాము. ఈనాడు వేరు పడ్డాము. ఈ 18 కోట్ల రూపాయలతో planning వల్ల మనకు కొంత వస్తుందనుకొందాము. అయినా, ఈవేళ 18 కోట్లు వచ్చేటటువంటి పొగాకును మనం పండిస్తున్నప్పుడు, ఇక్కడ cigarette factory నడిపితీరవలసియున్నది. కాని ఇప్పుడు ఏమి జరుగుతున్నది. ఇప్పుడు ఉన్నటువంటి పొగాకు అంతా కూడా I. L. T. D. కంపెనీ monopoly క్రింద ఉండేటటువంటి విషయం అందరికి తెలిసినదే. ఇది I. L. T. D. monopoly క్రింద ఉండడంవల్ల గుంటూరు జిల్లా అంతా నష్టపడుతుందనే విషయం మంత్రివర్గానికి తెలుసుననుకుంటాను. ఇప్పుడు cigarette factory ని ప్రభుత్వం పెట్టినా, వ్యక్తులు పెట్టినా ఈ I. L. T. D. యొక్క competition నుంచి తప్పించుకోవడం చాలా కష్టమని మనకు తెలుసును. అలాంటప్పుడు ఏమిచేయాలి? అటువంటప్పుడు అవసరమైనటువంటి restrictions అన్నీ కూడ వారిమీద కఠినంగా enforce చేసి, అవసరమైతే వాళ్ళ సిగరెట్లు మనదేశంలో లేకుండా అయినాచేసి, మన cigarette factory ని స్థాపించుకొని, దాన్ని ముందుకు తీసుకుపోవలసిన అవసరమున్నది. ఈ విషయంలో అది British వారు పెట్టిందనే జంకు కొంకు ఉండనవసరంలేదు. మన దేశాన్ని ముందుకు తీసుకుపోవడానికి ఈ I. L. T. D. పైన కొత్తది తీసుకొనివచ్చి దానిని మన Control' లో పెట్టుకొని మన cigarette factory ని స్థాపించుకొని, ఆ కంపెనీతో పోటీలేకుండా చేసుకోవలసిన అవసరమున్నది. మన వెంకటరావుగారికి చాణిక్యునికున్నంత సమర్థత ఉన్నదని చెప్పుకొంటూ ఉంటారు. ఆ సమర్థత ఇప్పుడు I. L. T. D. కంపెనీవాళ్ళమీద ప్రయోగించి, వారి బాధనుండి తప్పించి మనదేశంలో పొగాకు పండిస్తున్నాము కాబట్టి ఇక్కడనే Cigarette Factory పెట్టుకునేటటువంటి అవకాశం కల్పించి ఆవిధంగా మన దేశాన్ని ముందుకు తీసుకుపోతారని ఆశిస్తున్నాను. అదేవిధంగా మిగిలిన పరిశ్రమలు అనేకము ఉన్నాయి. ఈనాడు పరిశ్రమలు అభివృద్ధికి రావాలంటున్నారు. ఉన్నటువంటి పరిశ్రమలను ఇంకా ఎక్కువ అభివృద్ధిపరచవలెనని కూడ కోరుతున్నాము. అయితే ఒక చిన్న సిద్ధాంతాన్ని మరచిపోకూడదు. అక్కడ పనిచేస్తుండేటటువంటి

కార్మికులకు, కనీసం తినడానికి తిండి, కట్టుకోడానికి గుడ్డ, వీటికి సరిపొయ్యేంతటి జీతాలైనా ఇవ్వకపోతే, మీరు దేశంకొరకు ఎంత పాటుపడినా మంత్రులందరు గొంతు తెత్తి ఎన్ని ఉపన్యాసాలు ఇచ్చినా, అక్కడ ఉండేటటువంటివారికి ఉత్సాహంరాదు అనే సత్యాన్ని మంత్రిగారు గుర్తుపెట్టుకోవలసియున్నది. కార్మికవర్గంయొక్క సహకారం ఉంటేనే మనం పరిశ్రమలను అభివృద్ధిచేయడానికి వీలవుతుంది. లేకపోతే లేదు అనే విషయాన్ని మంత్రివర్గానికి అనేక Factories విషయంలో అనేక తడవలు చెప్పాము. కనీసం మానవ అవసరాలకు తగిన జీతాలులేకుండా మన కార్మికులు, ప్రజానీకం బాధపడుతున్నారు. ఈ పరిస్థితులలో పరిశ్రమలు అభివృద్ధికావాలన్నా, ఉన్నవాటిలో ఇంకా ఉత్పత్తి పెరగాలన్నా కష్టము. కనుక కార్మికులను మొదట తృప్తిపరచవలసిన అవసరమెంతైనా ఉన్నది. ఈ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేటప్పటికి 20 వంతులు income పెరుగుతుందని మనకు తెలుసు. అప్పుడు నాకు 20 వంతులు ఆదాయం పెరిగిందా, నాజీతము ఎంత పెరిగింది అనే ప్రశ్న ప్రతివారినుంచి వస్తుంది. మన ప్రభుత్వం ఈ angle నుంచి, ఈ సమస్యను ఆలోచించకపోవడం గురించి చాలా బాధపడుతున్నాను. ఈ విషయంగురించి వారి రిపోర్టులో ఏమూలలోకూడ mention చేయబడలేదు. ఇదివరకు చేయకపోతే చేయకపోయినారు. ఇకముందైనా ఈవిషయాన్ని గుర్తించి ఆవిధంగా చేయాలని మంత్రివర్గానికి విజ్ఞప్తిచేస్తున్నాను.

తరువాత రోడ్లవిషయము వుంది. వాటియొక్క అవసరముగురించి ఎంతైనా చెప్పవచ్చు. అవి అవసరములేదనికాదు. అవికూడా అవసరమే. మనకు సిమెంటురోడ్లే కావాలని అంటే, వాటికి అయ్యే ఖర్చు మనము భరించలేము. ప్రభుత్వము యిప్పుడు అటువంటి luxuries ను భరించలేని స్థితిలోవున్నది. Luxury అంటే, అది మామూలు luxury కాదు. అది మనము భరించలేనటువంటి luxury అని అంటున్నాను. పంచవర్షప్రణాళికలో 132 మైళ్ళు cement రోడ్లు వేయాలి అని వున్నది. దీనికి తక్కువ మొత్తమే అయితే కావచ్చు. మద్రాసురాష్ట్రముతో పోల్చి చూచుకుంటే, మనకు తక్కువే కావచ్చు. మన ఆంధ్రదేశములో ఒక మైలు సిమెంటురోడ్డు కొత్తగా వేసేటట్లయితే, వచ్చేనష్టము యేమీ లేదు. అత్యవసరమైనచోట్లకు కావాలంటే, తారు రోడ్లు వేసుకోవచ్చు. మిగిలినచోట్లలో metal roads provide చేసుకుంటే, అది సరిపోతుందని అంటున్నాను. అందువల్ల యిది దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంతవరకు యీ item మీద ఖర్చును ఏవిధంగానైనా control చేసి అది ఎప్పటికి ప్రారంభిస్తారో గాని, దానిక్రింద ఖర్చుచేయదలచిన సొమ్ము మాత్రం దుర్వినియోగము కాకుండా చూడాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇదేవిధంగా buildings విషయము వున్నది. ఈ విషయములో ఖర్చు ఎంతవరకు అవసరమో, కనీస అవసరాలకు మాత్రమే ఖర్చుపెట్టాలిగాని ఈ రోజున luxurious గా పెద్దపెద్ద buildings కు ఎవరో పదిమంది Secretariat సభ్యులకోసం పలవైలక్షల రూపాయలు buildings కొరకు ఖర్చుచేస్తామని అంటే, అంత ఖర్చు నేను సహించలేకుండావున్నాను. ఏదో Secretaries కు మాత్రం పెద్దపెద్ద buildings మాత్రము అవసరమే. అంతవరకు ఖర్చుచేయడానికి అభ్యంతరము వుండదు. కాని కొన్ని లక్షల రూపాయలు, first priority లో యీ buildings ను కట్టించడము అంటే, అది చాలా చిక్కుసమస్య అంటున్నాను. మనకు colleges, కావలసివున్నవి. Medical College యింకొకటి అవసరము వున్నది. Engineering College కూడా

యింకొకటి అవసరమున్నది. ఈ buildings క్రింద వృథాగా యిన్ని లక్షలు ఖర్చుచేసే బదులు, colleges పెట్టించకూడదా, అవి ప్రజలకు ఉపయోగపడవా? మనకు ఎంతమంది యింజనీర్లు వున్నారో, యింకా యెంతమంది కావాల్సి వున్నారో చూడండి. ఇప్పుడు వున్నవారు మనకు సరిపోతారో లేదో అనే విషయాన్ని తీసుకొన్నప్పుడు అన్ని విషయాలు మాకు బోధపడుతాయి. మనకు కావలసినవి Engineering College, Medical College కావాలని అంటున్నప్పుడు, మన ఆఫీసర్లకు పెద్దపెద్ద భవనాలు కట్టించుకుంటున్నారని అంటే, ఒక విధమైన repulsion మాత్రం feel అవుతున్నాము. అంతేకాని ఎక్కడో ఏదో ఒక పట్టణము అభివృద్ధి అవుతున్నదని గర్వపడుతున్నామని మాత్రము అనుకోవద్దని, మిగిలిన సభ్యుల కందరికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ రోజున నేను ఖచ్చితముగా చెబుతున్నాను. ఈ కర్నూలులోనే Medical College పెట్టండి. ఒక Medical College పెట్టండి. ప్రప్రథమంగా Engineering College పెట్టి, తరువాత యీ పంచవర్ష ప్రణాళిక నిర్వహించటానికి మనకు ఎంతమంది యింజనీర్లు కావలసి వుంటారో లెక్కవేసి, అంతమందిని తయారుచేయుటానికి ఎంత ఖర్చు అయినా సరే, వారిని తయారుచేయుటానికి డబ్బు ఖర్చుచేయండి. ఆ విధంగా చేస్తే దేశము బాగుపడుతుంది. మనకు కావలసిన ఇంజనీర్లు తయారై ముందు కార్యక్రమానికి సిద్ధముగా వుంటారు. అంతే కాని ఎవరో కొంతమంది వ్యక్తులకోసం పదివేలు, ఇరవై వేలు, ముప్పైవేలు, నలభైవేలు ఖర్చుచేసి building కట్టిస్తామని అంటే అది సాధ్యమైన పని కాదు. మనది పేద రాష్ట్రము అన్న సంగతి అందరికీ తెలుసు. ఇంతంత పెద్ద పెద్ద భవనాలకొరకు చేసే ఖర్చు మన ప్రభుత్వము భరించలేని స్థితిలో వున్నదని నా అభిప్రాయము. ఈ విషయము ప్రభుత్వము దృష్టిలో పెట్టుకోవాలని నేను కోరుతున్నాను.

తరువాత ఇరిగేషన్ విషయము ఒకటి వున్నది. నిజమే irrigation లో ఎంత వరకు ఖర్చుపెట్టవలసి వున్నదో, అంతవరకూ ఖర్చుచేస్తున్నారు. ఎంతవరకు వీలు అవుతుందో అంతవరకు ఖర్చుచేస్తున్నారు. Minor irrigation schemes విషయములో కూడా ప్రభుత్వము యింకా ఎక్కువగానే శ్రద్ధవహించాలి. ముఖ్యంగా యీ సందర్భములో చెప్పవలసింది యేమిటంటే వెనుకబడిన ప్రాంతాలు ముఖ్యంగా కృష్ణా, గుంటూరు జిల్లాలలో కొన్ని తాలూకాలు వున్నవి. ఈ తాలూకాలు కృష్ణాజిల్లాలోని నందిగామ, తిరువూరు తాలూకాలు, కృష్ణాజిల్లాలోని గుడివాడ తాలూకాతో పోల్చి చూస్తే అక్కడ వున్న ప్రజానీకం ఎంతో యిబ్బంది పడుతున్నారన్న విషయము గుర్తించాలి. ఆ తాలూకాలలోని ప్రజానీకాన్ని దృష్టిలో పెట్టుకొని, వెనుకబడిన ప్రాంతాలను అన్నిటినీ కూడా వేరుగా విభజించి, వాటిని ముందుగా వృద్ధిలోనికి తీసుకుని రావటానికి ప్రభుత్వము కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

తరువాత Tungabhadra High Level Canal విషయము చాలా ముఖ్యమైనది. ఇది ఈ స్కీములో వున్నది. ఈ ప్రాజెక్టు ప్రారంభించి యిప్పటికి దాదాపు 10, 15 సంవత్సరాలు అయినది. ఇంతవరకూ యీ project పూర్తిచేసుకోలేకపోయాము. ఇది పూర్తికావటానికి యింకా ఎన్ని ఏండ్లు పడుతుందో తెలియడములేదు. ఈ స్కీము వున్నప్పుడు, యీ project కు priority అయినా సరే యిచ్చి యిది వెంటనే పూర్తిచేయటానికి, పట్టుదలవహించి, మనకు కావలసిన యింజనీర్లను, యింకా దానికి కావలసిన సిబ్బందిని, రాయి, రప్ప, అన్నీ కూడా తయారుచేయించి, యీ పని ముందు పూర్తిచేయించవలసిందిగా కోరుతున్నాను. ఇవి యిక్కడ పూర్తి చేసినప్పుడే రాయల

3rd August 1955] (Sri Pillalamarri Venkateswarlu)

సీమలో కరువు ప్రాంతాలలో మంచినీరు అయినా దొరకని చోట్లు చాలా వున్నవి. తిన టానికి తిండి లేకుండా ప్రజలు మలమల మాడుతూ, గొడ్లు మేసేందుకు మేత లేకుండ అంపటించి, చివరికి లేచిపోవలసిన స్థితి వచ్చిన ప్రాంతాలు ఎన్నో వున్నవి. అటువంటి చోట్లలో వున్న ప్రజలకు, పశుజాతికి జీవనాధారము యీ ప్రభుత్వము చేసినట్లవుతుంది. ఈ విషయములో బడ్జెటు డిమాండు విషయములో సభ్యులలో ఎవ్వరికీ గూడా అభి ప్రాయ బేధాలు లేవు. కనుక యీ విషయములో తక్షణ చర్య తీసుకోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇక P. W. D. విషయములో నేను మరియొక విషయం చెప్పదలచాను. ఈనాడు P. W. D. వారియొక్క కార్యవిధానములో సభ్యులు చాలమంది విమర్శిస్తునేవున్నారు. ఈ సంగతి P. W. D. కి మంత్రిగారైన సంజీవరెడ్డిగారు కూడా దీన్ని అంగీకరించారు. ఈ డిపార్టుమెంటులో corruption ఎన్నో విధాలుగా వడుస్తున్నదన్న సంగతి ప్రభుత్వము గోచరించ గలిగినప్పుడు, రాబోయే పంచవర్ష ప్రణాళికలోని స్కీములోని పనులు నిర్వహించాలి గదా! అప్పటికి యీ విధమైన corruption ఏవిధంగా నిర్మూ లనము ప్రభుత్వము చేయగలదు? అంటే వారిని యింకా corruption చేయండి అని అర్థమా? గనుక ఆ ప్రణాళిక వచ్చేటప్పటికి యీ corruption ఏవిధంగా పోగొట్టు తారు? Corruption పోగొట్టకపోతే ప్రాజెక్టులక్రింద ఖర్చుచేసే సొమ్ము అంతా దుర్వినియోగము అయినట్లే. అదిమాత్రం ప్రభుత్వం గట్టిగా నమ్మాలి అని అంటున్నాను. కాబట్టి ప్రభుత్వానికి corruption పోగొట్టటానికి ఏదైనా plan వున్నదా? ఉంటే, అదిఏది? ఇప్పుడు కేంద్ర ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికలో తయారు చేసిన ఆయన కూడా ఏమి వ్రాశాడంటే యిప్పుడు యీ Secretariat యిదివరకున్న విధంగా పనిచేస్తే లాభములేదని చెప్పారు. దీన్ని యీ విధంగా వుంచితే ఈ ప్రణాళికముందుకు పోలేదని దీన్ని మార్చవలసిన అవసరమువున్నది అనివారు వ్రాశారు. కాబట్టి యీ department ను మార్చితేనే గాని, యిది జయప్రదంగా నెరవేరదు, అని యీ plan తయారు చేసిన గ్రంధకర్త చెప్పారు. ఇది మన కందరకూ తెలుసును. దాన్ని మార్చటానికి plan ఏదీ? ప్రభుత్వము ఏదైనా ప్రణాళిక తయారుచేసు కున్నారా? తయారు చేసుకోకపోతే, యిప్పుడువున్న ప్రకారమే ప్రభుత్వము ఒక్కొక్క village నుంచి బయలు దేరటానికి ప్రయత్నము చేసినప్పటికీ కూడా అక్కడ పైన కలెక్టరు మొదలైన వుద్యోగస్థులు ఉన్నంతకాలం మనకు మేలు లేదు. (Interruption by The Hon. Sri Kala Venkata Rao) అంటే కలెక్టర్లను అసలు తీసి పారవెయ్యారునికాదు నా ఉద్దేశ్యము. నేను ఆవిధంగా చెప్పడంలేదు. The Planing Minister need not misunderstand me, and try to misinterpret and mislead people.

కాబట్టి నేను చెప్పేది కలెక్టర్లను వుంచమనే కాని ఒక్కొక్కసారిగా ఈ ఉద్యో గస్థులందరిని తీసి వెయ్యమని చెప్పి ప్రభుత్వ పాలనలో అరాచకము తెచ్చి పెట్టుదామని చెబుతున్నానని అనుకుంటున్నారా? ఉద్యోగస్థుల మీద control ఉండాలని అంటున్నాను. కార్యవిధానములో control ఎవరికి ఉండాలి? ప్రజా రాజ్యము అంటున్నారు గదా! అప్పుడు ప్రజాప్రతినిధులకు యివ్వండి. కావాలంటే జిల్లాబోర్డులు పెట్టండి. పంచాయితీ బోర్డులు పెట్టండి. జిల్లాలలో కౌన్సిల్సు పెట్టి ప్రజా ప్రతినిధులను వాటికి అధ్యక్షులుగా పెట్టి ఆ కౌన్సిల్సుకు కలెక్టర్లను అధ్యక్షునిగా చేసే బదులు ప్రజా

ప్రతినిధులను ఏర్పాటు చేయండి. అప్పుడు పని యింతకన్నా చురుకుగాను సక్రమంగాను సాగుతుందో లేదో తెలుస్తుంది. ప్రభుత్వ కార్యకలాపాలలో ప్రజా ప్రతినిధులకు ఎక్కువ చొరవ ఉండేటట్లు చేస్తే, ఫలానాచోట ఫలానా మాదిరిగా పని జరుగుతున్నది అనేది ప్రభుత్వానికి తెలియపరచడము మంచిది కాదా అని అంటున్నాను. ఆ విధంగా చేయడము మంచిది కాదని అంటారా? ఇంజనీర్ల మీద తప్పువుంటే అది ప్రభుత్వానికి రిపోర్టుచేస్తే అప్పుడు ఒక యింజనీరును punish చేయండి. మరునాడు తక్కిన యింజనీర్లు ఏవిధంగా పని చురుకుగానూ, సక్రమంగానూ, భయముతో చేస్తారో చూడండి. ఇప్పుడు జరుగుతున్న విధానము చూస్తే, ఇంజనీర్లు ఏమిచేస్తే అది తప్పు అయినా ప్రభుత్వానికి తెలియనివ్వరు. అదికాదు, యిదిఅని తప్పుకుంటూ ప్రభుత్వాన్ని మభ్యపెట్టి ప్రభుత్వానికి నష్టము కలిగిస్తున్నారనే సంగతి ప్రభుత్వము గుర్తించాలి. ఆ విధంగా చేస్తే corruption ఖండితముగా తగ్గిపోతుందని ఖచితముగా చెబుతున్నాను. అలాంటి జోక్యము ప్రజా ప్రతినిధులకు వారి వారి నియోజకవర్గములలో ప్రాధాన్యత యివ్వమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆ విధంగా చేయకపోతే ఈ పంచవర్ష ప్రణాళిక క్రింద ఖర్చు చేయబోయే 241 కోట్లరూపాయలు దుర్వినియోగము అవుతుందని నమ్మండి. ప్రణాళిక క్రిందజరగబోయే పనులకు ఖర్చులో ఎంతమట్టుకు దుర్వినియోగము కాబోతుందో యిప్పటినుండి అంచనాలు తీసుకోవాల్సిన అవసరమున్నది.

తరువాత విద్యావిషయము వున్నది. రాబోయే పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేటప్పటికి కనీసము రాష్ట్రములోఅన్నిచోట్లలోనూ Primary Education ముందుకు తీసుకొని రావాలి. ద్వితీయ ప్రణాళిక పూర్తి అయ్యేటప్పటికి 74.1% మాత్రమే వస్తుంది. నేను చేసిన సూచన ప్రకారము 1960 వ సంవత్సరము పూర్తి అయ్యేసరికి మన రాష్ట్రములో వున్న 14 సంవత్సరముల లోపలవున్న ప్రతి పిల్లవానికి ఖచ్చితముగా విద్య నిర్వహించటానికి అవసరమైన చర్యలు తీసుకొనటానికి, యిప్పటినుంచి ప్రభుత్వము ప్రయత్నించాలని విజ్ఞప్తిచేస్తున్నాను. ప్రభుత్వము యీ విషయములో యిప్పటినుంచి శ్రద్ధవహిస్తే, అది అసాధ్యము కానేరదు. ఈ సందర్భములో ఒక విషయము మనవిచేస్తాను. మనకు యింజనీర్ల సంఖ్య చాలా తక్కువగావున్నది. రాష్ట్రములో ముందు జరగబోయే కార్యక్రమాలకు యిప్పుడు మనకు వున్నసంఖ్య 600 మంది కన్న జాస్తి లేరు. మనకు 1034 మంది ఇంజనీర్లు అవసరము. తక్కినవారిని ఎక్కడినుంచి తీసుకొనివస్తారు? Planning మంత్రి వెంకట్రావుగారు దీని విషయము యేమీగూడా చెప్పలేదు. ఇది ఇప్పటికి ప్రశ్నార్థకంగానే వున్నది. ఇతరరాష్ట్రాలనుంచి పిలిపిస్తారా? ఇతరరాష్ట్రాలవారుమాత్రము యీ ప్రణాళికను అమలుపరచడములేదు. వారికి అవసరము వుండదా? వారుమాత్రము ఏవిధంగా మనకు పంపగలరు? ప్లానింగుమంత్రి వెంకట్రావుగారు మనరాష్ట్రములో 704 మంది యింజనీర్లు వున్నారని యిప్పుడు చెబుతున్నారు. సరే అట్లాచూచినా వారు సరిపోతారంటారా? అట్లాఅయితే, ఆ సంగతినిగురించి యిందులో ఎందుకు వ్రాయలేదు? అందువల్ల యిప్పుడు మన యింజనీర్లసంఖ్య పెంచటానికి ప్రయత్నించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

తరువాత ఉపాధ్యాయుల జీతాల పెంపకము విషయము వ్రాశారు. కేంద్ర ప్రభుత్వమువారు సూచించిన scales ప్రకారముఅయితే 8.70 లక్షలు ఖర్చు అవుతుంది. దానికిగాను కనీసము token గా 45 లక్షలు కేటాయించాము అని చెప్పారు. పెద్దపెద్ద జీతాలుగల ఉపాధ్యాయులసంగతి అటువుంచండి. కనీసము Elementary

3rd August 1955] (Sri Pillalamarri Venkateswarlu)

School Teachers జీతాలను పెంచేవిషయములోనైనా ప్రభుత్వము కొంత సాను భూతిని చూపించి, వారి జీతాలు పెంచవలసిందిగా కోరుతున్నాను. ప్రభుత్వము యీ విషయము పరిశీలించమని విజ్ఞప్తిచేస్తున్నాను. అది తప్పకుండా ప్రభుత్వము చేస్తారని ఆశిస్తున్నాను.

తరువాత షెడ్యూల్డుకాస్ట్లను గురించి చెప్పి నేను ముగించడానికి ప్రయత్నిస్తాను. అందులో 60 వ పేజీలో హరిజనులకు provision for house sites అని వేశారు. రు. 63,54,000 లు దానికోసము ఖర్చుపెడుతున్నారు. ఇంకొక ముఖ్యవిషయముకూడా దానిలో వ్రాశారు. దాంట్లో ఒక కోటి 37 లక్షలు రూపాయిలు హరిజనులకు బ్రాహ్మణులకు మిగిలిన కులాలు అందరికి కూడా కలిపి ఒకచోట ఇళ్ళ స్థలాలకోసం ఏర్పాటు చేయడం కోసం అని, ఇళ్ళు కట్టుకోడానికి అని, రు. 250/- లు ఒక్కొక్కరికి వుచితంగా ఇస్తానని చెప్పారు. ఈ డబ్బు ఎవరికోసం ఖర్చు పెడుతున్నారు ? పూర్తిగా ఏమీ లేకుండా అల్లాడిపోతున్నటువంటి ప్రజానీకముకా ? లేకపోతే "నేను వారి మధ్య ఇల్లు కట్టుకోడానికి సిద్ధంగా వున్నాను. కాబట్టి నాకు కూడా స్థలం ఇవ్వమని" అడిగినవారికి కూడా ఇవ్వడానికి సిద్ధంగా వున్నారా? ఏదో ఒకటి ఖాయము చేయమని నేను చెబుతున్నాను. ఈ విషయంలో హరిజనులకు ఎన్నెన్నిగానో వాగ్దానము చేస్తున్నాము. కోటాను కోట్లు ఖర్చుపెట్టుతున్నాము అని చెబుతున్నారు. ఏగ్రామము లోకి అయినా సరే మీరు ఈరోజు వెళ్ళి ఎంతమంది హరిజనులకు ఎన్ని ఇండ్లస్థలాలు ఇచ్చారో లెక్కవేసి ధైర్యముగా చెప్పగలుగుతారా ? ఇప్పటికి ఈ పంచవర్ష ప్రణాళికలో నైనా సరే హరిజన గ్రామాలన్నింటిలో కూడా వుచితంగా ఇండ్లు కట్టించామంటే ఈ సమస్య ఎంతో జయప్రదము అవుతుంది. ప్రతి దమ్మిడీ కూడా కనీసం హరిజనులకు పేద ప్రజానీకానికి ఇండ్లస్థలాలుకు వినియోగపడేట్టుగా చేయాలని మంత్రిగారికి విజప్తి చేస్తున్నాను.

బ్రాడ్ కాస్టింగ్ కమ్యూనిటీ రేడియోలని వున్నాయి. దానికోసం రు. 1000 లు ఖర్చుపెట్టి 5 వేల సెట్లు పంచిపెట్టబోతున్నారట. దానికి కొన్ని రూల్సు వున్నాయి. దానిని కళా వెంకటరావుగారు చదివి వుంటే ఇప్పటికైనా దానిని తప్పనిసరిగా మార్చాలని చెప్పి గుర్తిస్తారు. ఆ రేడియోలకు కరెంటు వున్నప్పటికి కూడా బ్యాటరీని పెట్టే నడపాలట. దానిని నియమిత కాలములోనే వినియోగించాలట. ఆయన చెప్పినట్లుగా వినాలట. ఇలాంటివిధంగా రూల్సు వున్నాయి. ఇది ఎంతవరకు ఉపయోగపడతాయో అనే అనుమానముకూడా ఒకటి యున్నది. మొత్తముమీద ప్లాను అంతా వేసుకొన్న ట్లయితే మనము ఆశించినటువంటి నిరుద్యోగసమస్య ఎంతవరకు పరిష్కారము అవుతుందో అనుమానముగా వున్నది.

భూమిసమస్య ఒకటి వున్నది, కళా వెంకట్రావుగారు తమయొక్క వుపన్యాసంలో categorical గా భూమిసంస్కరణములు వెంటనే అమలుజరుపుతాము అని చెప్పి నందుకుమాత్రము సంతోషిస్తున్నాము. దాంట్లో పెదఅర్థము కలిగేట్టుగా అది పెట్టబడి వున్నది."The State Government set up a Land Reforms Committee, the report of which is expected by September 1955. It is equally necessary to ensure that Land Reforms do not militate against the agricultural enterprises" అని వ్రాశారు. ,ఇప్పటివరకుకూడా కాంగ్రెసు నాయకులుగాని ఎవరు అయినాగాని, దున్నకసేవాడికే భూమి యిస్తే

ఎక్కువ పండించేదానికి వీలుంటుందనే పత్యాన్ని తీసుకువచ్చారు. లేని ఈనాడు అనేక interuptions వస్తున్నాయి. కేవలం వైశాల్యం ఎక్కువఅయినా ట్రాక్టర్లు పెట్టి ఎక్కువ పండించేదానికి వీలవుతుంది గనుక అలాంటివారికి అంతభూమి యిచ్చేట్టు ప్రయత్నముచేస్తారా? అలాంటి అనుమానము రాకుండా తప్పనిసరిగా ఈ భూములు అంతా కూడా సీలింగును ఫిక్సుచేసి కమ్యూనిస్టుపార్టీ 20 యకరాలు మాగాణీ, మెట్టఅయితే 60 ఎకరాలు వుండవచ్చునని చెప్పింది. ఎన్నికల ప్రణాళికలోకూడా చూపింది. మీరుకూడా ఎంతవుండటానికి వీలవుతుందో కూర్చొని ఆలోచించి ఎక్కువమందికి ఎంత భూమి పోతోందోనని కంగారుపడేవాళ్ళుకాక మిగతావారందరి అంగీకారము వుండి వాళ్ళయొక్క సహకారములోనే మనము అమలు జరపడానికి వీలుంది. కమ్యూనిస్టుపార్టీ ఇలాచేసినట్లయితే వెంటనే ఈలాంటి ప్రజలను ఎదుర్కొనేటటువంటి ఆహార సమస్య పరిష్కారము చేయడానికి వీలుంటుంది. అందరికి కనీసము ఎకరమో, అర ఎకరమో మేము చెప్పాను అని ప్రచారముచేశారు. 5 ఎకరాలు, ఒక ఆవు, దున్నపోతు యిస్తామని ప్రచారంచేసిన విషయం మరచిపోయి, కనీసం ఒక ఎకరం, ½ ఎకరం ఇవ్వడానికి వీలుంటుంది అనేటటువంటి విషయాన్ని మాత్రము మీకు జ్ఞాపకముచేస్తున్నాను. అది చేయక పోయినట్లయితే ప్రజల్లో ఏవిధమైనటువంటి వుత్సాహమూరాదు. గనుక మీరు వెంటనే అమలుపరచాలని కోరుతున్నాను. పన్నుల విషయంలో ఇదివరకు ఒక విషయాన్ని చెప్పాను. పన్నులు వేయడానికి కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకముకాదు. ఎవరు ఎంత బరువు మోయగలుగుతారో అంత బరువును మాత్రమే వేయండి. నాకు రూపాయి వేస్తే మూర్తిరాజుగారికి 50 రూపాయిలో 60 రూపాయిలో వేయండి. నాకూ రూపాయే మూర్తిరాజుగారికీ రూపాయే అందరికి రూపాయే అయితే ఎమీ న్యాయము కాదని నేను చెబుతున్నాను. ఎవరు ఎంత బరువు మోస్తారో ఆలోచించి అంతబరువును మోసేట్లు చేయండి అని చెప్పి నేను విజ్ఞప్తిచేస్తున్నాను. దీనిని మీరు సీరియస్‌గా ఆలోచిస్తారని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri Ch. S. R. V. P. MURTHY RAJU:—అధ్యక్షా, భారతదేశములో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తీసుకోవడము మొదలుపెట్టినప్పటికి ఇది ఆంధ్రరాష్ట్రములో ప్రథమమే అయింది. అందులో అన్ని విషయాలు కూడా ఆంధ్ర రాష్ట్రాన్ని పైకి తీసుకు రావడానికి కావలసినటువంటి పథకాలన్ని వేసినందుకు మన ఆంధ్ర ప్రభుత్వాన్ని మనము అందరము అభినందించవలసిన అవసరము వున్నది. అయినప్పటికీ ఇందులో ముఖ్యముగా ఆరోగ్యవిషయము జాగ్రత్త తీసుకోవలసిన అవసరమునకుగాను చాలా డబ్బు కేటాయించినట్లు కనిపించు తున్నది. కాని దానికి ఏ విధముగా వైద్యము చేయడము, రోగాలు ఎలా కుదర్చడము అనేది మాత్రము జాగ్రత్తగల ఆలోచనతో చూడవలసిన అవసరము వున్నది. ఆ సిద్ధాంతము అంతాకూడా మన వెంకటరావు గారికి తెలిసిన విషయమే. వారు ఇది వరకు మంత్రివర్గములో వుండగాకూడా ప్రకృతి చికిత్సా విధానాన్ని సపోర్టుచేయడము కోసము discussions వగైరా చేసినవారు వారుఒక్కరే. ఆ మంత్రిగారే ఈనాడు ప్లానింగులోకి వచ్చేటప్పటికి కూడా అదృష్టమో, దురదృష్టమో కాని ప్రకృతి వైద్యాన్ని గురించి ప్రత్యేకంగా కేటాయించలేదు. అది Indian Suemious Medicine వస్తుందని అనుకొంటున్నాము. కాని అది Medicine అనేది వేరు. మందులేకుండా వాడేది వేరు. కాబట్టి medicine అంటే మందులు వున్నటువంటిది. మందులు లేకుండా వుండే సిద్ధాంతాలకు ఏమైనా ప్రజలకు పనికివచ్చేటటువంటి

విధానాలు వున్నప్పుడు దానిని ప్రోద్బలము చేయవలసిన అవసరము వున్నది. దీనికిగాను అధమపక్షము 5 సంవత్సరాల్లో 5 లక్షలు అయినా కేటాయించలేదు. ఈ కొంత అయినా చేసి తరువాత దానివల్ల వచ్చే ఫలితాలను చూచి లక్షలు కోట్లు కేటాయించడము సంగతి తరువాత చూసుకుందాము. కాబట్టి ప్రకృతి చికిత్సా విధానాన్ని తప్పకుండా ప్రోద్బల పరచడానికి గాను ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తప్పకుండా సహాయము చేయవలసిందని కోరుతున్నాను. ఇది గాంధీగారియొక్క సిద్ధాంతములోనిది. మన దేశమునకు స్వరాజ్యము తెచ్చిపెట్టి మన దేశప్రజలయొక్క సౌకర్యాన్ని మనదేశముయొక్క సౌభాగ్యాన్ని కోరినటువంటి మహాత్మాజీగారు అనుసరించినటువంటి సిద్ధాంతము లోనిది ఇందులో లేకుండా చేయడమనేది చాలా అన్యాయం. అందుచేత తప్పకుండా దీనినికూడా అందులో చేర్చమని కోరుతున్నాను. భారతదేశానికి స్వరాజ్యము తెచ్చేందుకు కూడా, పేదవాళ్ళందరికి సహాయము చేయాలని, పేదవాళ్ళందరిని పైకితీసుకు వస్తామని, మాటలు చెబుతూనే తీసుకువచ్చాము. పేదవాళ్ళకేకాదు యావత్తు ప్రజలందరికీ కూడా సరియైన సహాయము చేస్తామనికూడా చెప్పారు. మన అందరికి మేడలు వున్నాయి, మిద్దెలు వున్నాయి. అసెంబ్లీ భవనాలు వున్నాయి, కూర్చుంటున్నాము, వెడుతున్నాము, కాని పేద ప్రజానీకము ఎలా బ్రతుకుతున్నారు అనేదానికి మాత్రము ఇందులో సావకాశము కన్పించడములేదు. దానికిగాను అధమపక్షము 'మన పంచవర్ష ప్రణాళికలో ఒక లక్ష కుటుంబాలకు అయినా ఈనాడు ఇళ్లుకట్టుకోడానికి అందులో అధమపక్షను సగము గ్రాంటుగాను, సగము లోనుగాను ఇచ్చి వాళ్ళకి ఇండ్లవసతి కలుగచేయడానికి ప్రయత్నము చేస్తారని కోరుతున్నాను.

అంతేకాకుండా మన ఆంధ్రరాష్ట్రములో ఇతరదేశములనుంచి వచ్చి చూచే వాళ్ళకు సౌకర్యాలు చాల తక్కువగా వున్నాయి. దానికి మనం టూరిస్టుసెంటరులు పెట్టవలసిన అవసరము వున్నది. ఆ టూరిస్టుసెంటర్లు పెట్టడమువిషయములోకూడా కొల్లేరును ఒక భాగంగా తీసుకోవచ్చును. ఇతర దేశాలనుంచి వచ్చేవాళ్ళకు చేపలమీద ఇష్టము. అక్కడ చేపలనుకూడా మనము పెంచవచ్చును. Fisheries Demand కు 60 లక్షలు మాత్రమే మీరు కేటాయించారు. అది ఏమాత్రము సరిపోదని అనుకొంటున్నాను. ఇక టూరిస్టుసెంటర్లకోసము 50 వేల రూపాయలుమాత్రము ఖర్చుపెట్టినట్లయితే మీకు ఆదాయము వస్తుంది. ఇతరదేశాలనుంచి వచ్చే ప్రజలకు చూపించవచ్చును. మనదేశములో టూరిస్టుసెంటరులు ఏర్పాటుచేయడానికికూడా అవకాశము వున్నది.

రోడ్లనిమిత్తము 13 కోట్ల రూపాయలుమాత్రము కేటాయించారు. ఇది ఎంత మాత్రము సరిపోదని నా వుద్దేశము. సుమారు అధమపక్షము 20 కోట్ల రూపాయలు అయినా వుంచితేతప్ప అవి వుపయోగపడవని నావుద్దేశ్యము.

పంచాయితీలకోసం 3 కోట్ల రూపాయలు ఇచ్చారు. 3 కోట్ల రూపాయలలో పంచాయితీలుమాత్రము బాగుపడేదికాదు. దీనికి అధమపక్షము 6కోట్లరూపాయలుఅయినా కేటాయించాలని కోరుతున్నాను.

ఇరిగేషనులో ఇరిగేషను అండ్ డ్రైనేజి అన్నీ కలిపివస్తున్నాయి. ఇరిగేషను నిమిత్తము పెద్దప్రాజెక్టులకు ఖర్చుపెట్టుతున్నారు. అలాగే drainage సౌకర్యాలకు కూడా తగినంతగా ఖర్చుచేస్తే ఎక్కువ ఆదాయం వస్తుందని చెప్పి మీరు గ్రహిస్తారని

చెప్పి నమ్ముతున్నాను. ఇంకా అన్ని విషయములను గురించి చర్చించడానికి ఎక్కువ కాలము లేదు గనుక ఇంకొక్క విషయము చెప్పి ముగిస్తాను. గోదావరిమీద ఒక ఆనకట్ట తీసుకుంటారని వుద్దేశపడుతున్నాను. దానికి కావలసినటువంటి సహాయము తప్పకుండా చేస్తారనికూడా నేను నమ్ముతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri G. PARAMDHAMAYYA:— Mr. Speaker, Sir, this being my maiden speech, I hope you will excuse me for any mistakes that I might be committing while I am making my speech. Our Planning and Development Minister has presented to us a draft of the Second Five Year Plan. It is certainly a laudable one on the whole. But he has not taken advantage of the disadvantage that we were in at the time the First Five Year Plan, because our State was not formed at that time. Our State was formed only when the First Five Year Plan was in progress of execution, and so some of the spill-over items only from the First Five Year Plan. Our Minister should have taken care to get in a greater measure, he should have pressed a little more on the Central Government and got a little more so that all the districts in our State might derive more benefit from the Second Five Year Plan.

Now coming to the broad lines of the plan I see Agriculture, (under its many departments like Animal Husbandry), Fisheries and Irrigation have been allotted quite a decent sum. We are very grateful for that. But during the time of the execution of the several schemes, I want the Minister to see that not much of the public funds are wasted by the Public Works Department, or the public waste department, as it is sometimes called.

Proceeding to the subject of unemployment, I would like to stress that there are quite a large number of educated youths in the country who are on the look-out for jobs and are unemployed to-day. Even our Prime Minister has repeatedly said that this problem of educated unemployment has become a widespread one in the country. Here I would impress on the Minister and the Members of the House that this is a serious problem, and we should take advantage of the Second Five Year Plan to provide employment for these educated youths at an early date. We have under the Plan big industries and small industries. But the number of educated unemployed is

so large we cannot provide them all with jobs in the major industries and even the medium scale industries put together. So what I would suggest is give these youth the first priority in the new jobs that will be available shortly in the implementation of the Second Five Year Plan. By so doing, ultimately, production in our State will be doubled and our State will prosper as quickly as possible.

Then, under the head Electricity, a very good sum has been set apart. In fact, we could call the entire Plan as Electricity Plan. It is true that a sum of sixty crores has been provided for Irrigation. But it is not irrigation pure and simple. Hydel scheme is also combined with it. We have forty crores provided for Electricity separately. So we can safely call this Plan as Electricity Plan. I hope under this Plan even the remote parts in our whole State will be electrified ; every village and every town will have electric street lighting and every house will be electrified. I would like to stress here that a sufficiently large sum should be set apart to supply electric energy for agricultural purposes, so that lift irrigation may be resorted to in an abundant measure.

Sir, Public Health has been allotted quite a decent place, and in my opinion, due to the conditions prevailing in Andhra the general public health is deteriorating for want of nurishing food. Of late we have all become accustomed to modern food and modern ways of life, and due to lack of communications from the village, food is not easily available in all parts of the State. I hope Government would devote sufficient attention to this aspect.

Under 'Publicity', I have to say a few words. It is a most important subject considering the magnitude of the task that lies ahead. I would stress here that Government should issue instructions to the officials concerned, not only at the Provincial level (Heads of Departments) but also at district level (District heads) that greatest publicity should be given to the proceedings of this House and the people should be informed of the views of their representatives. On the whole the Plan is really beneficial to the poor man. But the poor man is indirectly called upon by the Government to help the Government in tackling problems. When that is so, he will naturally expect

something in return for that. No doubt he gets the improvement in his standard of living. He wants something more than that; and after all he does not ask for much. He wants only a small house to live in; he wants a secure house to live in peace, and this naturally takes me to the head of Social Welfare. Under this head I see a sum of Rs. 3,50,00,000 has been provided. I request that at least a crore of rupees should be set apart for building houses to the Harijans. That is my sincere opinion. Finally I hope the Hon. Minister will give due consideration to the suggestions I have made.

Sri P. NARASIMHAAPPA RAO:—అధ్యక్షా ! మంత్రిగారు second five year plan ఈవేళ కొంతవరకు discuss కొరకు పెట్టారు. కాని పుస్తకము నేను మొట్టమొదట చూచాను కాని నా మిత్రులందరకు అది అర్థమయినదని బుర్రలు ఊపుచున్నారు గాని నామటుకు నాకు ఏమీ అర్థముకాలేదు. అది అంతా చీకటిలోగా ఉన్నది. అంకెలను చూచేటప్పటికి అది మొత్తముమీద జగన్మోహన అవతారములో అమృతము పంచిపెట్టడం ఎల్లాఉన్నదో అది అంతా వీరి చేతులలో ఉన్నది. ఎవరికి ఏమాదిరిగా పెడతారో ఏమిచేస్తారో నాకుమట్టుకు ఏమి తెలియడములేదు. నా తోటిసోదరులకు తెలిసినట్లు నవ్వుచున్నారు గాని వారికికూడా ఏమీ తెలిసిఉండదని భావిస్తున్నాను. ఏదో బిల్లుపెట్టి second five year plan అన్నారు. దీనినిచూచి ప్రతి తాలూకాలో ప్రతి జిల్లాలోకూడా ప్రకాశంగారి Food Committee అని అనుకొని ప్రతివాళ్లు పరుగెత్తుకొనివచ్చి మాపేరు వేయండి మాపేరు వేయండి అని దెబ్బలాడి committee లో పేర్లు వేయించుకున్నారు. కాని దాని ఉద్దేశ్యము ఈవిధముగా పనిచేయాలి, ఈమోస్తరుగా డబ్బుయివ్వాలి, శ్రమదానము ఇవ్వాలి అని చెప్పేటప్పటికి అందులో కొంతమంది కొద్దికొద్దిగా వెనక్కు తగ్గారు. కాని ఇది వెంకట్రావుగారి బిల్లు మరెవరిదీకాదు. అసలు All India మీద వేసుకున్న బిల్లు అని అనుకున్నారు. కాని డబ్బు యివ్వమన్నప్పుడు మాదగ్గరఉన్నదికొత్త అయినది కాబట్టి మేము ఎక్కడనుంచి ఇస్తాము అంటారు. జిరాయితీదారులు ఉంటే వారు వందలకొలది ఎకరాలు సంపాదించారుగాని ఒక దమ్మిడీకూడా యివ్వరు. మా శ్రీకాకుళంజిల్లా వెనకబడినది అని చెప్పినప్పుడు ముందు మీరు డబ్బు పట్టుకరండి, మీ ఊరిలో factory కట్టిస్తాము అని డబ్బు కావాలని అనేవరు. కాబట్టి ఏపని ఎల్లా చేయాలో మీకు మేము చెప్పవలసిన పని లేదు. కాని శ్రీకాకుళంజిల్లా వెనుకబడి ఉన్నదని అందరకు తెలిసినదే.

Average మీద తల ఒకటికి ఎకరా భూమి ఉన్నది. మొత్తం జనాభాలో 8 లక్షలు భూమి సాగుచేసేవారున్నారు. 8 లక్షలు కౌలుదారులు, కూలీలు వున్నారు. 5 లక్షలు యితరవృత్తులు కలవారున్నారు. ఈ plan లో అమలుపరిస్తే మా జిల్లాలోకొంత వరకు పని కలుగుతుంది. Draft plan యింతవరకు ఒక మోస్తరుగా తయారుచేశారు.

శ్రీకాకుళం వెనుకబడినజిల్లా కాబట్టి పూర్తిగా శ్రద్ధతీసుకోనవలసియుంటుంది. ఈ జిల్లా గ్రామాలలో నూటికి 90 percent జమీందారి ప్రాంతా లున్నాయి. ఈ జమీందారి ప్రాంతాలలో పూర్వంనుంచీ కూడా, జమీందారీలు తీసుకున్న లగాయతు ఏపనులూ లేవు. అగ్రహారాల్లో చెరువులను ఎవరూ మరమ్మతు చేయడంలేదు. ఉన్నటువంటి గండ్లు పూర్తి కాలేదు. Department పెంచవలసి వున్నది. వ్యవసాయానికి 175 లక్షల రూపాయలు వేశారు. ఇందులో 25 లక్షలు ప్రజలు భరించవలసివున్నది. అంటే ప్రజల సహకారం పొందవలసి వున్నది. మా జిల్లా మొత్తానికి 175 లక్షలు. అందులో 25 లక్షలు ప్రజలు భరించాలి. చెరువుల మరమ్మతు 140 లక్షలు. అందులో 61 లక్షలు ప్రజలు భరించేది ఆరోగ్యంకు. గ్రామాలలో రోడ్లకు 70 లక్షలు కావాలి. ఇందులో 25 లక్షలు ప్రజలు భరించాలి. 40 లక్షలు ప్రభుత్వం యివ్వాలి. మా జిల్లాలో రోడ్లు చూడవచ్చు. అవతల బరంపురం లగాయతు యివతల విజయనగరం వరకు వున్నది. ప్రొద్దున్న 4 గంటలకు రైలు ఎక్కితే 10 గంటలకు విజయనగరంలో దిగవచ్చు. శ్రీకాకుళం జిల్లాలో trunk road తప్ప రోడ్డు అనేటటువంటిది లేదు. ట్రంకు రోడ్డు గ్రామానికి ఒక ఫర్లాంగు దూరంలో వుంటుంది. మా జిల్లాలోని villages లో రైతులు పండించే పంటలను నెత్తిమీద పెట్టుకుని రెండు మూడు మైళ్లు మోసుకు వస్తారు. కాని అభివృద్ధి అనేది ఇంతవరకు లేదు. అందువల్ల రెండవ ప్రణాళికలో కొంతవరకు చేర్పించాలని కోరుతున్నాను. రోడ్లగురించి 27 లక్షలు ప్రజలనుంచి వసూలుచేస్తే గవర్నమెంటు 43 లక్షలు యివ్వాలి.

Mr. SPEAKER :—ఎక్కడనుంచి వచ్చాయి, యీ అంకెలన్నీ ?

Sri P. NARASIMHAPPARAO :— మొన్న meeting లో యిచ్చారు. మొదటి రెండేండ్లలోన, గ్రామాలక్రింద, మా జిల్లా వెనుకబడినది కనుక, నాలుగు కోట్ల రూపాయలు ప్రస్తుతం అవసరమున్నది. దానికి ప్రజలు 180 లక్షలు, ప్రభుత్వం 220 లక్షలు యివ్వవలసి యున్నది. ఇక projects లో మా వంశధార గురించి మంత్రిగారిని ఒక విషయం బాగా ఆలోచించుకోమని మనవిచేస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రంలో ఆ చివరనుండి యీ చివరవరకు వున్న నదులన్నిటికీ ఎక్కడో ఒక దగ్గిర కనీసం ఆనకట్ట వున్నది. కాని మా వంశధారకు మాత్రం ఎక్కడా ఆనకట్ట లేదు. అందుచేత మంత్రిగారు ఆలోచించి ప్రథమంలోనే దానిని ప్రారంభించవలసినదని చెబుతున్నాను. మంత్రిగారు అంగీకరించి ప్రథమంలో చేయించాలని ప్రార్థిస్తున్నాను. ఇక మధ్యరకం ప్రాజెక్టులు నాగావళి, సువర్ణముఖి అనే నదులు ఉన్నాయి. వాటివల్ల సముద్రంలోకి కొన్ని విలేజీలు కొట్టుకు పోతున్నాయి. వాటికి అడ్డుపడేలాగుంటే 50 వేల ఎకరాలకు పైగా చీపురుపల్లి తాలూకాలోనూ 50 వేల ఎకరాలకు పైగా పాలకొండ తాలూకాలోనూ మొత్తం లక్ష ఎకరాలు సుభిక్షంగా పండించి surplus గా కావలసినంత పండించి పంపించడానికి సిద్ధంగా వున్నాం. అందుచేత పనస నందివాడ కాలువ కట్టాలి. ఇంకా గొట్టిపల్లి గడ్డ, వట్టిగడ్డ వున్నాయి. పనస నందివాడ కాలువ రెండు తాలూకాలకు ముఖ్యమైనది. మంత్రిగారు ఏదయినా చేయగల సమర్థులు. మొదటనుంచీ వారంటే పూర్తి అభిమానం గలది మా శ్రీకాకుళం జిల్లా. అందుచేత పనస నందివాడ కాలువ, వంశధార, యీ రెండు కాలువలు వారి time లోనే పూర్తిచేయాలని ప్రార్థిస్తున్నాను. తరువాత చిన్న చిన్న

(Sri P. Narasimhapparao) [3rd August 1955

విశేజీలలో వైద్యసౌకర్యం లేక యిబ్బంది పడుతున్నారు. ఇంగ్లీషు వైద్యాలు అన్ని గ్రామాలకు పంపించడానికి వీలులేదు. కనుక మన ఆయుర్వేదాన్ని అయినా వృద్ధిలోకి తీసుకురావాలి. ఈ మాదిరిగా మా agency గ్రామాలలో ప్రతి గ్రామానికి ఒక డాక్టరును ఏర్పాటుచేసే పరిస్థితులున్నాయి. ఆ విధంగా చేయాలని ప్రార్థిస్తున్నాను. తరువాత సముద్రం యివతల కోనాడ మొదలుకొని అవతల బరంపురం వెళ్ళేవరకు sea coast రమారమి 150 మైళ్ళవరకు వున్నది. ఈ 150 మైళ్ళ sea coast లోనూ చేపలవల్ల రాబడి రావడానికి అవకాశం వున్నది. ఆ మధ్య ఒక దొర మద్రాసు నుంచి వచ్చి కళింగ పట్నంలో చేపలవేట చేశారు. అతనొక్కడే 800 రూపాయల విలువగల చేపలు పట్టాడు. అందువల్ల చేపలవల్ల ఎంతాదాయం వస్తుందో ఆలోచించుకోండి. శ్రీకాకుళం జిల్లాలోని కళింగపట్నంలో వుండే fisheries తాలూకు యిది వైజాగువెళ్ళకుండా ఆముదాలవలసలోనే plant ఒకటిపెట్టి, శ్రీకాకుళం నుంచి కళింగపట్నం వరకు business చేస్తే చాలా డబ్బు వస్తుంది. ఈ చేపలు పట్టే వృత్తిగల వాళ్ళు రమారమి ఆరు లక్షలమంది వున్నారు. ఆ విధంగా చేస్తే వాళ్ళందరికి జీవనోపాధి కలుగుతుంది. రెండోది Cement Factory, ఆంధ్రదేశంలో కృష్ణా జిల్లాలో వున్నది. అటు బెంగాలులోను, యిటు మద్రాసులోనూ వున్నది. అందుచేత అటు బెంగాలుకీ, యిటు మద్రాసుకీ మధ్యగా వుంటుంది కనుక శ్రీకాకుళం, విశాఖ పట్నంల మధ్య ఒక Cement Factory పెట్టవలసినదని ప్రార్థిస్తున్నాను. అక్కడ రాయి కావలసినంత వున్నది. కావలసినంతమంది మనుష్యులున్నారు. First class అయిన ప్లేసు. వేడికూడా వుండదు. సముద్రం place అది. అందుచేత Cement Factory అక్కడ మనకు కావాలి. తరువాత మా జిల్లాలో చెఱకు పంట హెచ్చుగా పండుతుంది. బొబ్బిలిలో రెండు Factory లున్నాయి. బళ్ళతో రాయఘడ్ తీసుకు వెళ్ళుతున్నారు. అందుచేత ఆముదాలవలసలో ఒక Factory పెట్టినట్లయితే, రైతులు హెచ్చుపంట పండించి, హెచ్చు శిస్తులు యివ్వడానికి అవకాశం వున్నదని మనవి చేస్తూ విరమిస్తున్నాను.

Sri M. SATHYANARAYANA RAJU:—అధ్యక్షమహాశయా! రెండో పంచవర్ష ప్రణాళికను ప్లానింగుమంత్రిగారు ప్రతిపాదిస్తూ చాలవరకు చెప్పారు. వారితో చాలవరకు ఏకీభవిస్తున్నారు. కాని కొన్ని విషయాలలోమాత్రం నాకు కొంచెం భేదాభిప్రాయం వున్నది. అది యేమనగా మొట్టమొదటి పంచవర్ష ప్రణాళికలో 74 కోట్లు, దరిమిలా సుమారు 69 కోట్లు కోరినప్పటికీ పూర్తిగా డబ్బు ఖర్చుపెట్టలేకపోయాం. అస్థితే యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకుకూడా వస్తుందేమోనని నేను కొత్త వారికి విన్నవిస్తున్నాను. తరువాత మొత్తంమీద ఈ planning అంతా చదివితే దాని framework మీరలేదు కాబట్టి మొదట పంచవర్ష ప్రణాళిక ఏవిధంగానయితే ఖర్చుపెట్టలేదో ఆవిధంగానే ఈ రెండో పంచవర్ష ప్రణాళిక డబ్బుకూడా పూర్తిగా ఖర్చుపెట్టలేకపోతామేమో అని నా భయం. ఇంకొకటి. ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక estimate లో ఇదివరకు చాల పెద్దమొత్తాలు వేశారు. దర్మిలా 5 వందలకోట్లకు తగ్గించారు. తర్వాత రానురాను రెండువందలకోట్లకు తగ్గించారు. కాని గౌరవనీయులగు planning మంత్రిగారికి యీ విషయములో చాల pushing nature వున్నప్పటికీ ఎందుచేత తక్కువ estimates తెచ్చినారో తెలియకుండా వుంది. ఎందుచేతనంటే మన ఆంధ్రరాష్ట్రము క్రొత్తగా ఏర్పడినందువల్ల మొట్టమొదటి అవకాశము తప్పిపోయింది. అది ఒక

3rd August 1955] (Sri M. Sathyanarayana Raju)

dis-advantage. రెండవదేమిటంటే యివతల మద్రాసు, హైదరాబాద్ States తీసుకున్నట్లయితే బాగా develop అయిన towns వున్నాయి. అయితే మన ఆంధ్రరాష్ట్రములో బాగా develop అయిన town అంటూ ఒకటికూడా లేదు. మద్రాసు తీసుకున్నట్లయితే 5-6 పట్టణాలు కోయంబత్తూరై తేనేమి ఈరోడ్డు అయితేనేమి బాగా అభివృద్ధిఅయినాయి. ఆమాదిరిగా ఒక్క town కూడా మన ఆంధ్రరాష్ట్రములో అభివృద్ధి కాలేదు. హైదరాబాద్ కూడా వున్నది. ఐనప్పటికీ వారు కూడా చాల హెచ్చుడబ్బు కోరారు. కాని వారిచ్చినా యివ్వకపోయినా కోరడమనేది ఒకటి వున్నట్లయితే యీ 244 కోట్లలో వారెంతవరకు తగ్గిస్తారో మనము చెప్పలేము. అందుచేత యీ 244 కోట్లు గాక్కువ అనడములో పూర్తిగా అన్ని States తో సమానముగా మన ఆంధ్రరాష్ట్రానికి వస్తుందా అనే భయము ఒకటి వుంది. తర్వాత Central Government యొక్క సిద్ధాంతాల ననుసరించి మన ఆంధ్ర ప్రభుత్వమువారు కూడా ఏమి చెప్పుతున్నారంటే 50% subscription యిస్తే మేము చేస్తామన్నట్లుగా వారు చెప్పుతున్నారు. కాని దీనిలో ఒక పేపద్ధతి పెట్టడము వల్ల చాల తికమకలువున్నాయి. ఎందుచేతనంటే ఇప్పుడు విశాఖపట్టణము, శ్రీకాకుళం జిల్లాలను పూర్తిగా neglect చేశారు. కాని ఈ మాదిరి neglect చేసినందువల్ల ఇప్పుడు దానియొక్క ప్రతిఫలము కూడా ప్రభుత్వము అనుభవిస్తుందని తెలుస్తుంది. ఎందుచేతనంటే a neglected son is always a burden to the father. అందుచేత యీ burden తర్వాత బోధపడుతుంది. అన్నివిషయాలలో కూడా communications లో అయితేనేమి, education లో ఐతేనేమి, industries లో ఐతేనేమి ఆరెండు జిల్లాలు కూడా పూర్తిగా వెనుకబడివున్నాయి. తోడిసభ్యులుకూడా చెప్పుతున్నారు. అది మంత్రిగారికి కూడా తెలుసు. వేరే చెప్పనక్కరలేదు. అందుచేత వెనుకబడిన జిల్లాలనుగురించి ఇప్పుడు చెప్పవలసిన దేమిటంటే మీరు ముందు అడుగేస్తే తర్వాత మేము అడుగేస్తామని చెప్పితే అది కేవలము బాగుండదు.

The Hon. Sri K. VENKATA RAO :— అది ఎప్పుడు change కాదు. మీరు ఎంత తగ్గించుకుంటే దానిమీద అంతసంతోషిస్తాము. ఇందుకు చూపెట్టాను మీకు. 25 లక్షలు ఖర్చుపెట్టితే 23 లక్షలు contribution వచ్చాయి. శ్రీకాకుళంలో వచ్చాయి. విశాఖపట్టణములో వచ్చాయి. అన్ని జిల్లాలలో కూడా వచ్చాయి. అందుచేత మీరు propaganda తగ్గిస్తే ఎక్కువలాభిస్తుంది. ఇంకా రెండు కోట్లు ఎక్కువ ఖర్చుపెట్టవచ్చును.

Sri M. SATHYANARAYANA RAJU :— అక్కడవున్న ప్రజలు కూడా చాల వెనుకబడివున్నారు. మధ్యతరగతి ప్రజలు బాగా డబ్బువున్నవాండ్లులేరు. దానినిగురించి మంత్రిగారు శెలవిచ్చారు. Labourకూడా ఎక్కువగా రావడానికి వీలు లేదు. ఎందుచేతనంటే ఆతడు landless వాడు ఐనట్లయితే నేను ఈ subscription యిచ్చినందువల్ల నాకే ప్రతిఫలము వుంటుందని చెప్పి ఈ కూలి నాలి చేసుకునే భూమిలేని వాండ్లకు కొంచెం అనుమానము వుంటుంది. అందుకోసము యీ భూసంస్కరణాలు ముందు పెట్టించినట్లయితే ఏదో కొంత land వచ్చినట్లైతే మనభూమి బాగుపడుతుంది. మనము బాగుపడుతామనే ఒక శ్రమదానమువల్లనో లేక డబ్బుదానమువల్లనో ముందుకురావడానికి వీలు వుంటుంది. కాబట్టి Planning ప్రవేశపెట్టకముందే land reforms

(Sri M. Sathyanarayana Raju) [3rd August 1955

కూడా ముందుచేసినట్లైతే వారుకూడా నలుగురితో సమానముగా వచ్చి ప్రభుత్వ రెండవ plan సాగించడానికి వాండ్లకు సునసువస్తుంది. కాబట్టి land reforms planning ప్రారంభించకముందే land reforms ప్రారంభించవలని నేను మనవి చేస్తున్నాను. ఇప్పుడు మనకు మొత్తముమీద యిచ్చిన డబ్బు పంపకాల విషయంలో ఇప్పుడు irrigation మీద electricity మీద మునుపు ఏవిధంగా ఖర్చుపెట్టుతున్నారో అదే విధంగా ఖర్చుపెట్టుతున్నారు. కాని ఏ production కుగాను ఏదైతే ఖర్చు పెట్టుతున్నారో దాని distribution and sales organising కు కూడా అదేవిధంగా ఖర్చు పెట్టితేగాని మొత్తమునీద అది లాభదాయకముగా వుండదని నా నమ్మకము. ఎందుచేతనంటే 1951 నాటికి Food grains position ఏలాగుంటంటే 40.6 లక్షల tons వున్నాయి. 1956 నాటికి 44.6 లక్షలైంది. 1961 నాటికి estimate వేస్తే 52.6 లక్షలు ఔతుంది. ఈ 44.6 లక్షలు వచ్చేసరికి ధరలు తగ్గుతూ వస్తున్నాయి. ఇప్పుడు మన second plan పూర్తి అయ్యేనాటికి అనగా 1961 నాటికి 52.6 లక్షల టన్నులు వచ్చేటప్పటికల్లా ఏవిధంగా position మారుతుందో చెప్పలేము. కనుక ఒక్కొక్క district కు sales organisation పెట్టమని విజ్ఞప్తి చేస్తున్నాను. తర్వాత electricity కూడా 1951 నాటికి 21 million watts position లో వుంది. 1956 నాటికి 69 million watts వచ్చింది. ఎప్పటి కప్పుడు project కట్టినందు వల్ల electricty current పెరుగుతుందనుకున్నాము కాని current open చేయకముందే రేట్లు పెంచినందువల్ల ఈ ధాన్యానికి ధరలు పడిపోవడమువల్ల రైతులు కూడా యీ current ను ఉపయోగించుకోడానికి వీలు లేదు. రోజుకు ఒక గ్రామము చొప్పున electritity current సరఫరా చేస్తామని అన్నారు. కాని ఆర్థికస్థితినిబట్టి ఆవిధంగా ముందు నడువడానికి అవకాశ ముండదు. ఎందుచేతనంటే రేట్లు చాలవరకు తగ్గించినట్లైతే హెచ్చుగుండి తీసుకోడానికి అవకాశ ముంటుంది. కాని హెచ్చురేట్లు పెట్టినందువల్ల Project తాలూకు ఖర్చులు వస్తాయని Chief Engineer గారు చేశారు. ఎందుచేతనంటే హెచ్చు piority Irrigation కు Electricity కి యిస్తున్నారు. 26% దానికిన్ని 18% దీనికిన్ని యీ rates రైతు కట్టుకోలేకుండ వున్నపుడు హెచ్చు ఖర్చుపెట్టినట్లయితే అసలే లాభదాయకముగావుండదు. కాబట్టి ఆవిధంగా ఇంకా develop చేయువలసినవి వున్నాయి. Industries, communications చాలా backward గా వున్నాయి. కాబట్టి దానిని తగ్గించి దీనిని హెచ్చించినట్లయితే బాగుంటుందని చెప్పి నాయొక్క విజ్ఞప్తి. ఈ Plan లో ముఖ్యమైన commercial crops ఏమిటంటే sugarcane ఒక్కటే. తర్వాత cement ఒకటి మనకు ఉత్పత్తి కావలసియున్నది. ఇప్పుడు sugarcane మామూలుగా 32 లక్షల tons ఉత్పత్తి ఔతుంది. 1961 నాటికి 42 లక్షల tons ఉత్పత్తి ఔతుంది. Sugar 35 laks tons అంటే 35090 tons. ఇప్పటికీ 1961 నాటికి 90000 tons ఉత్పత్తి ఔతుంది. అలాగు ఐనట్లైతే మంత్రిగారు ఏమిచెప్పారంటే 3 పంచదార factories కు మన ఆంధ్రరాష్ట్రములో license యిస్తామంటున్నారు. కాని 4 నుంచి 5కు ఉత్పత్తి ఔతుంది కాబట్టి, ఆవిధంగా కట్టి పు చేసినపుడు sugar factories ను హెచ్చుచేయమని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఆవిధంగానే cement కూడా 1.8 లక్షల tons నుండి 2 లక్షల tons వరకు ఉత్పత్తి ఔతుంది. కాని మనకు కావలసింది 7-8 లక్షల టన్నులు కాబట్టి యీ

నిష్పత్తిని చూచినట్లయితే ఇప్పుడున్న cement factories కన్న నాలుగు రెట్లు వుండాలని చెప్పి వారిని కోరుతున్నాను.

The Hon. Sri K. VENKATA RAO:— Time వుంది. ఎవరైన appilcation పంపిస్తే చూస్తాము.

Sri M. SATYANARAYANA RAJU:— తర్వాత యీ road communications లో కూడా చాలమట్టుకు అశ్రద్ధ చేస్తున్నారు. వారికికూడా తెలుసు. మన ఆంధ్రరాష్ట్రములో communications ఎంత backward గా వున్నాయో లెక్కలనుబట్టి వారికి తెలియకపోలేదు. దానినిగురించి చాల శ్రద్ధ తీసుకో లేదు. ఎందుకంటే యీ road conditions 1951 నాటికి 13278 మైళ్ళుమాత్రమే వుంది. మొత్తముమీద, మన రాష్ట్రములో major roads అయితేనేమి మామూలు other roads ఐతేనేమి, village roads ఐతేనేమి 1956 నాటికి 14588 ఐనాయి. కాని 1961 నాటికి 1330 మాత్రమే ఎక్కువఅవుతుంది. ముఖ్యంగా villages లో communications చాలా అధ్వాన్నముగా వున్నాయి. ఒక village కి మరొక village కి roads లేనేలేవు. ముఖ్యంగా ఇపుడు ఏమిచేస్తున్నారంటే యీ cement concrete roads పైన హెచ్చుగా డబ్బు ఖర్చుపెట్టుతూవున్న రోడ్లమీదనే cement వేయడము జరుగుతోంది. అదికాదు కావలసింది. ఆ డబ్బు village communications కొరకు State Highways National Highways కు కలిపే టట్లుగా roads వేసుకొని అవన్ని అభివృద్ధిఅయినతర్వాత అప్పుడు కావలసివుంటే cement concrete roads వేస్తే బాగుంటుంది కాని ఒక మైలుకు ఒక లక్ష రూపాయలు ఖర్చుపెట్టి ఆవిధంగా cement concrete roads వేయడము మంచిపని కాదని నాయొక్క మనవి.

తరువాత ఈ un-employment ని గురించీ education ని గురించీ చెప్ప వలసియున్నది. ఇప్పుడు 8th standard pass అయిన తరువాత Higher Grade training ఉంటోంది. ఈ Higher Grade training తీసేస్తామని అంటు న్నారు. Eighth standard, School-Final, Intermediate అని చెప్పి అంటున్నారు. Intermediate వరకూ వచ్చేసరికల్లా students ను ఏ position కు తీసుకురావాలంటే ఒకవేళ school మానేసినప్పటికి అతన్ని departmental గా తీసుకోవడంగాని లేకపోతే independent గా అతను బ్రతికేటట్లు ఏర్పాటు చేయాలి. ఈ 8th standard కి Higher Grade Training తీసివేస్తున్నప్పుడు ఆ స్థానే agricultural schools పెట్టి, 8th standard స్టూడెంట్సుకే basic విధానం ప్రకారం agricultural training ఇవ్వడం, అది pass అయినతరువాత అతను వేరే employment కు ప్రయత్నం చేయకుండా తన వ్యవసాయంమట్టుకు తాను చేసుకోగల అవకాశం కల్పిస్తే బాగుంటుంది. ఆ విధంగానే school-final చదువుకున్న వాళ్ళకు technical training ఉండాలి, School-final తో మానేసినట్లయితే, వీరైతే ఏదో చిన్న work షాపో లేక village hand crafts నేర్చుకోవడమో అంతగా కాకపోతే ఏ diploma course చదువుకుని overseer గానో ఈ విధంగా పంపకం ప్రకారంగా మీ planning ఆ విధంగా యుండాలని మా విజ్ఞప్తి. లేకపోయినట్లైతే ఇప్పుడున్న సందర్భాన్ని బట్టి

(Sri M. Satyanarayana Raju) [3rd August 1955

చూస్తే ప్రతివారూ 8th Standard పాసయినదగ్గరనుంచీ, School final ప్యాసయిన దగ్గరనుంచీ certificate లు పట్టుకుని ఉద్యోగం కోసం తిరగడమే కాని నా అంతట నేను independent గా బ్రతకగలననే స్థాయిలో ఒక్క student కూడా లేడు. కాబట్టి ఆ స్థాయి మారేటట్లుగా ప్రతివాడూ school మానేసేసరికి independent గా బ్రతికేటట్లుగా technical training from 8th standard onwards ఉండాలని నా విజ్ఞప్తి. తరువాతది house sites ని గురించి. దీన్ని గురించి నేను ముఖ్యంగా చెప్పవలసిందేమిటంటే Harijans కు house sites ఇస్తున్నారు. ఇచ్చిన వాళ్ళకి ఏదో కొద్దిగా ఇస్తున్నారు. ఇంకా ఇవ్వనివాళ్ళు చాలామంది ఉన్నారు. కాబట్టి ఈ plan లోనే Harijans కు house sites ఇస్తూనాళ్ళు ఇళ్ళు కట్టుకునేటట్లుగా ఏదో grants - in aid మాదిరిగా కొంత ఇస్తూ Co-operative Building Society లు మన urban area లో ఎట్లా ఉన్నాయో ఆ ప్రకారంగా చిన్న Building Society లు పెట్టి వాళ్ళను ఏదో విధంగా నిలబెట్టాలి. ఈ విషయంలో ముఖ్యంగా గౌరవనీయులైన మంత్రిగారిని నేను కోరేది ఏమంటే ఈ Second Five Year Plan అనంతరం ఏ హరిజనుడైనా సరే ఏ పేదవాడైనా సరే ఇల్లులేకుండా ఉన్నాడంటే అప్పుడు మంత్రిగారే చిన్నబుచ్చుకోవలసి యుంటుందని మనవిచేస్తున్నాను.

Mr. SPEAKER:— I have a request to make to the House. I request the members not to repeat points which are touched by previous members so that the time given may best be utilized.

Sri V. KURMAYYA :— అధ్యక్షు మహాశయా! ఈ 240 కోట్లవరకూ రాబోయేపంచవర్ష ప్రణాళికకాలంలో ఖర్చుపెట్టుటకు దాన్ని ఇక్కడే మనమందరం కూడా చర్చిస్తున్నాము. ఈ 240 కోట్లూ ఈ రాష్ట్రంలో ఈ 5 సంవత్సరాలలో ఖర్చుపెట్టే విషయంలో ఈ Plan ప్రకారంగా చాలా items కి సగానగం contribution గా గ్రామాలలో, తాలూకాలలో, జిల్లాలలో ఆ సంస్థలు ఇవ్వవలసిన బాధ్యత ఉన్నట్లుగా ఇక్కడ చెప్పబడియున్నది. మన మంత్రిగారు చెబుతూ ఆర్థిక సమానత్వం ఈ పంచవర్ష ప్రణాళికయొక్క సిద్ధాంతం, దానియొక్క objective ఆర్థిక సమానత్వం నిరుద్యోగ సమస్యా పరిష్కారం, జాతీయ అభివృద్ధి పరిశ్రమలు మొదలైనవాటి అభివృద్ధి అని చెప్పారు. ఈ విషయంలో నేను గవర్నమెంటును ఒకటి అడగవలసియున్నది. నిజంగా ఆర్థిక సమానత్వం కలగజేయడానికి ఈ పంచవర్ష ప్రణాళిక ఏదైనా ఒక సూత్రాన్ని కనిపెట్టి ఆసూత్రాన్ని అమలులో పెట్టడానికి ఏమైనా ప్రయత్నం చేస్తుందా అని అడుగుతున్నాను. ఐతే ఈ పంచవర్ష ప్రణాళికలో ఖర్చుపెట్టేటటువంటి 240 కోట్లరూపాయలు కూడా చాలావరకూ ఇదివరకు జరుగుతూ యున్నటువంటి పనుల యొక్క extension schemes అన్ని department లూ ఖర్చుపెట్టే డబ్బు తీసుకొని కొంత మొత్తాన్ని వేసి, ఈ పెద్ద మొత్తాన్ని చూపిస్తుందే కాని దేశంలో యున్న ఆర్థిక అసమానత్వం గాని, ఆంధ్రరాష్ట్రంలో యున్న ప్రజల నిరుద్యోగ సమస్యనుగాని, తిండి సమస్యనుగాని పరిష్కరించే విధంగా Plan లేదు. ఎందుచేతనంటే, ఆర్థిక సమానత్వం కలుగజేయాలంటే ముందు దేశంలో యున్నటువంటి ఈ land నంతా socialise చేయాలి. దానికేమైనా చర్య తీసుకొనుటకు ప్రభుత్వం ఆలోచించిందా అని అడుగుతున్నాను. ఐతే Land Reform Committee యున్నది. అది వస్తుందని

3rd August 1955] (Sri V. Kurmayya)

చెప్పి ఈ ప్రణాళికలో చెప్పియున్నది. ఈ ప్రణాళిక క్రింద Land Reform Committee సిఫార్సులు ఏమి వస్తాయో మనకందరకూ ముందుగానే తెలుసును. ఐతే కాంగ్రెస్ Socialistci Pattern of Society అని చెప్పింది. అవి అల్లా వదలిపెట్టండి. మన Indian Constitution ప్రకారంగా మనదేశం Social Welfare State అన్నాం. Co-operative Common wealth అన్నాం. ఏదైనా ఒకటే కొంచం అర్థం మారితే, ఇప్పుడు ప్రపంచంలో వాడుకలోయున్న Socialism అనే మాటకు Communism అనే మాటకూ సరియైన అర్థ మిచ్చేటట్లుగా మనం Socialistic Pattern of Society అన్నా కూడా ఒకటే. ఈ Plan ముందుగా మనం తీసుకోడానికి పూర్వం, అమలుపరచబోయేందుకు పూర్వం మన land అంతా socialise చేసి, industry అంతా nationalize చేసినప్పుడే ఈ scheme లో అన్నీ కూడా సాధ్యమవుతాయి గాని లేకపోతే ఏవీ సాధ్యంకాదు. మనం voluntary service కాని లేకపోతే 50% సహాయంగాని కావాలని అడుగుతున్నాం. ఒక్క రూపాయి save చేసి bank లో వేస్తే అదికూడా చాలా అవసరమని చెబుతున్నారు మంత్రిగారు. రెండు జతలు చెప్పులజోళ్ళు తొడుగుకునే వాడు ఒక జత తొడుగుకొని రెండో జతకు వచ్చే డబ్బు save చేయమని మంత్రిగారు అంటున్నారు. కాని ఈరోజున, మన 2 కోట్లమంది ప్రజలలో 50 లక్షలమంది ఒకపూటే తిండితిని మన ఆంధ్ర రాష్ట్రంలో ఉంటున్నారని చెప్పి మంత్రిగారికి, మనకందరకూ తెలుసును. కేవలం delta areas లో తిండికి బాధపడక పోవచ్చునుగాని non-delta areas లో Ceded districts నుంచి శ్రీకాకుళం వఱకూ వెళ్ళి చూచినట్లయితే రోజుకు పావలా 5 అణాలు కూలికంటే ఎక్కువ లేదనిచెప్పి మన కందరకీ తెలుసును. ఈ పావలా, ఐదణాలలో ఈరోజులలో జీవనం చెయడం సాధ్యమా ? రూపాయిగాని, అర్ధరూపాయి గాని, 10 రూపాయిలుగాని save చేయమని మంత్రిగారు చెబుతున్నారే, social justice చేస్తామని చెప్పి అంటున్నారు, ఇదా social justice అని అడుగుతున్నాను. ఒక్కొక్కరి చేతులలో వందల ఎకరాలు, వేల ఎకరాలు ఉంచుకొని కొంత మంది చేతులలో private sector అనే పేరుతో cement factory లు ఇవన్నీ తీసుకుని ఈమాదిరిగా ఉండడం social justice చేయడమా అని అడుగుతున్నాను. ఇది కేవలం బూటకం అని నా ఉద్దేశ్యం. ఎందుకని గట్టిగా చెబుతున్నానంటే మనం రెండవ పంచవర్ష ప్రణాళిక వేసుకున్నాం. ఇదివఱకు ఏమి జరిగినా జరగక పోయినా ముందు రాబోయే plan లో ఈ దేశాన్ని, ఈ రాష్ట్రాన్ని ముందుకు తీసుకు పోదాం అనుకున్నప్పుడు మనం ఏమిచేయాలి ? Social Welfare Board అంటారే దానికి చాలా తక్కువ ఖర్చుపెట్టారు. Social Welfare Board కు 25 లక్షల రూపాయలు మాత్రమే ఇక్కడ కేటాయించినట్లు తెలుస్తోంది. దేశం అంతా కూడా Social Welfare State అని చెబుతూ Social Welfare Board అన్నచోట 5 సంవత్సరాలలో 25 లక్షల రూపాయిలు ఖర్చుపెడతామంటున్నారు.

The Hon. Sri K. VENKATA RAO :—Social Welfare Board అన్నది ఆడవాళ్ళ సంస్థ. దానికి 75 లక్షలు వాళ్ళిస్తారు. 25 లక్షలు మనం ఇస్తాం.

Sri V. KURMAYYA :—నాకు ఆ సంగతి తెలుసునండి. Social Welfare Board ఢిల్లీలో యుండి. దానికి ఇక్కడ State Board ఉంది. దానికి grant

(Sri V. Kurmayya) [3rd August 1955

లిస్తున్నారు. నాకు తెలుసును. ఐతే ఈ Social Welfare Board క్రింద రాష్ట్రంలో జరుగవలసిన పనులన్నీ కూడా Union Government సహాయంతో జరగాలి. ఈ Social Welfare Board వారు చేసే పనులు హరిజనవాడలలోనూ, బీదవాళ్ళకూ చేస్తున్నారని చెబుతారు. అటువంటివి ఏవీ జరగడం లేదని నిష్కర్షగా చెబుతున్నాను. ఈ Social Welfare Board లో State Government కి ఏమైనా అధికారం ఉంటే, లేకపోతే సలహా ఇవ్వదలచుకుంటే అక్కడ నిజమైన హరిజనులను, backward classes లో యున్న స్త్రీలనుకూడా వేసి అక్కడ పని చెయ్యాలనీ లేకపోతే Central Government కి సిఫార్సు చెయ్యమని చెప్పి నేను కోరుతున్నాను. ఇక వాళ్ళ హరిజన సమస్యను గురించి, హరిజనులు, backward classes, హరిజన క్రైస్తవులు వీళ్ళంతా నూటికి 50 గురు ఉన్నారు. నేను మొన్న మంత్రిగారితో చెప్పాను. వాళ్ళకి 4 కోట్ల రూపాయిలు మాత్రమే పంచవర్ష ప్రణాళికలో ఇచ్చారట. ఈ నాలుగు కోట్ల రూపాయిలు, 244½ కోట్లలో ఎంతభాగం అని అడుగుతున్నాను. నిజంగా మహాత్మా గాంధిగారు, హరిజనసేవా సంఘాలు అస్పృశ్యతా నివారణ తీసుకున్నప్పుడు చెప్పారు. గాంధీగారు అనేక తావులలో హరిజన సేవాసంఘాలు పెట్టినప్పుడు కీర్తిశేషులైన కుసుమ ధర్మన్నగారు అడిగారు. ఈ హరిజనసేవా సంఘాలలో అగ్రజాతులు ఉండడానికి కారణమేమిటి, హరిజనులను ఎందుకు వేయలేదని అడిగితే గాంధిగారు ఏమని సమాధానం చెప్పారంటే విజయనగరంలో అర్ధరాత్రి హరిజన సేవ చెయ్యడానికి ఈ సేవా సంఘాలు ఏర్పడ్డాయి. Debtor and Creditor అనేటటువంటి Bible సిద్ధాంతాన్ని తీసుకువచ్చి అగ్రజాతులంతా కూడా Debtors అనీ, హరిజనులందరూ Creditors అనీ అగ్రజాతులవారు చేసిన పాపానికి, పాపం అంటే హరిజనులను తరతరాలుగా అస్పృశ్యులుగా ఉంచడం పాపం కాబట్టి, ఆ పాప నివారణార్థం వాళ్ళ బాకీని with compound interest తో చెల్లించడమే ఈ హరిజన సేవా సంఘాల ఉద్దేశ్యం అని అన్నారు.

అటువంటి హరిజనసేవాసంఘాలు hostels స్థాపించారు. ఈ subsidized hostels కు ఇక్కడ మంత్రిగారు 19 లక్షలకు పైగా కేటాయించారు. అయితే నిన్న లచ్చన్నగారు మాట్లాడుతూ ఈ hostels అన్నీ డబ్బు దుర్వినియోగం చేస్తున్నవి కాబట్టి ప్రభుత్వం వీటిని తీసుకోంటుందని చెప్పారు. ఆవిధంగా ఒకవైపు ఈ hostels ను తీసుకుంటున్నామని అంటున్నారు. ఇంకొకవైపు planning మంత్రిగారు దీనికి 19 లక్షలరూపాయలు ఈ ప్రణాళికలో Harijan subsidized hostels కు ఇచ్చినామని అంటున్నారు. దీనిబట్టి మంత్రివర్గానికి joint responsibility లేదన్నమాట. ఏమంత్రికిఇచ్చినా portfolio ఆ మంత్రి ఇష్టానుసారము నడపడానికి ప్రయత్నిస్తున్నారని నేను గట్టిగా నమ్ముచున్నాను. ఈ ప్రభుత్వము వారు joint responsibility యే లేకుండా ఎవరి అంతట వారు వ్యవహరిస్తున్నారని ఎందుకు ఈవిధంగా చేస్తున్నారని నేను ఒక హరిజన సభ్యుడుగా, ఒక హరిజన సేవకుడుగా, శాసనసభ్యుడుగా అడుగుతున్నాను.

ఇంకొకవిషయం చెప్పుతున్నాను. Harijan hostels లో వున్నటువంటి backward classesవిద్యార్థులకు midday meals'కు గాను 6 లక్షలరూపాయిలు ఇస్తున్నట్టుగా ఉన్నది. అయితే హరిజన విద్యార్థులకు midday meals లేదన్నమాట. ఈ విష

యంలో నాసలహా చెప్తున్నాను. అస్పృశ్యతఅనేదిపోవాలంటే అన్ని Harijan hostels లో గాని, ఇక్కడ hostels లో గాని అన్ని కులాలవారికి స్థానం వుండాలి. మంగలి, మాల, మాదిగ, ఎరుకుల, బుడబుక్కల, తెగడ అనే తేడాలేక అందరురావాలి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు రావాలి. నేను స్థాపించిన hostels లో ఒక్క క్షత్రియ, వైశ్యులు తప్ప కొందమావానగపక్తున్నారు. నిజంగా reform రావాలంటే, ఈ అగ్రజాతులు అనుకునేవాళ్ళు, బాగా చదువుకొన్నటువంటి ఇద్దరిని ఒకచోట పెట్టడంవల్ల వెనుకబడినవారు పైకి రాగలుగుతారు. Social welfare అనే భావంతోటి విద్యను కలుగజేయాలని చెప్పుచున్నాను. Social service, social service అని అంటున్నారు. Social service ఎవరికి కావాలి అని అడుగుతున్నాను. Social service కాదు. Social reform కావాలి. మంత్రి కళా వెంకటరావుగారు బ్రాహ్మణుడుగా ఉన్నప్పుడు లేదా గోపాలరెడ్డిగారు రెడ్డిగా ఉన్నప్పుడు చంద్రమౌళిగారు కమ్మగా ఉన్నప్పుడు ఈ reform రాదు. ఎప్పుడైనా సరే reform దేశములో రావాలంటే నీకజాతులుగా ఉన్నటువంటి మాలవాళ్ళు, మాదిగవాళ్ళు లేకపోతే backward classes కు చెందిన ఒక కార్మికుడు గాని రాష్ట్రానికి అధిపతిగా ఉండాలి. అప్పుడు ఈ reform వస్తుంది. అంతేగాని ఈ social service ఎవరికి కావాలని అడుగుతున్నాను.

Mr. SPEAKER:– That is not planning. We are now in planning.

Sri V. KURMAYYA:— ఇదంతా planning గురించే మాట్లాడుతున్నానండీ. Social welfare అనేది planning నుండి వస్తుంది కాబట్టి దాన్ని గురించి మాట్లాడుతున్నాను. కనుక social reform కావాలి. దీనికి ఒక చట్టము తీసుకురండి. కులమత భేదము లేకుండా నాగేశ్వరరావుగారు చెప్పినట్లు inter-caste marriage జరగాలని చట్టము తీసుకువస్తే అప్పుడు నిజమైన reform వస్తుంది విశ్వనాథంగారు ఏదో పుస్తకాల్లో ఈ కులాలు పోవాలని వ్రాశారు. కులాలు కాదు పోవాలసింది కులతత్వము పోవాలని చెబుతున్నాను. ఆ కులాలు నాశనం కావాలంటే ప్రభుత్వము ఎక్కువగా social reform కు పనిచేయాలి. అంతేగాని social welfare అని చెప్పి 3, 4 కోట్లు ఖర్చు పెట్టడంవల్ల ప్రయోజనంలేదు. ఇప్పుడున్నటువంటిది adult franchise. ఈ adult frachise లో ఉన్నటువంటి ఈ backward classes ను హరిజనులను మాత్రము వీరు ఎన్నటికి అణగ ద్రొక్కలేరు అని గట్టిగా చెప్పుచున్నాను. ఇది adult franchise అని జ్ఞాపకముంచుకోమంటాను. ఈవేళ కాకపోయినా రేపైనా ఈ అగ్రస్థానము ఒక మాదిగవాడో, పాకీవాడో లేక ఇంకొక backward class వాడో ఆక్రమించుతాడు. ఆక్రమించే రోజు వచ్చింది. అది ఇక ఆపలేరు. మహాత్మా గాంధీగారు మన ప్రధానమంత్రి నెహ్రూ గారితో ఏమి చెప్పారు? "ఒకప్పుడు ప్రధాన మంత్రిగా ఉండవలసింది నీవుకాదు, ఒక కార్మికుడు, అతని కొకవేళ చదువు రాకపోయినా నీవు ప్రధాన కార్యదర్శిగాఉండి తోడ్పడవలసిందని" చెప్పారు. ఇంకా ఏమి చెప్పారు? తనకు శక్తి ఉండినట్లయితే ఒక కార్మిక స్త్రీనో, లేక హరిజన స్త్రీనో అక్కడ Republic President గా చేస్తానని గాంధీగారు చెప్పారు. అందుచేత, దీనికి ప్రాధాన్యత నిచ్చి ఇప్పుడు అను కొన్న 4 కోట్లు కాకుండా ఒక 40 కోట్లు provide చేసి మీ పాపాలన్నీ పరిహారం

చేసుకోనేవిధంగా ఈహరిజనసేవ backward classes సేవ చేయాలని కోరుతున్నాను ఇది గాంధీగారి ఉద్దేశ మని మనవి చేస్తున్నాను

తరువాత public health విషయం గురించి చెప్పారు కాని public health ముఖ్యంగా గ్రామాలకు సంబంధించినటువంటిది ఇప్పుడు సుమారు 16 వేల గ్రామాలు ఉన్నాయి ఇన్ని గ్రామాలుండగా, ఇప్పుడు అయిదువందలమంది midwives, nurses కు మాత్రం ఇందులో provision చూపించారు కాని 16 వేలమంది midwives, nurses ఉన్నప్పుడే అన్ని గ్రామాలలోను maternity area చేయడానికి వీలు అవుతుంది గాని లేకపోతే లేదని మనవి చేస్తున్నాను చాలా గ్రామాలలో రోడ్లుకూడా లేవు ఒక గ్రామం నుంచి ఇంకో గ్రామానికి పోవడానికి పోవలేరు బురదలో నడవవలసి వుంటుంది ముఖ్యంగా ఈ మాదిరి పల్లెలలోను, మాలపల్లెలలోను connecting roads వేసి, అక్కడున్నటువంటి మురికిని పోగొట్టిన రోజునే ఈ కలరా మొదలగు రోగాలు రావడానికి వీలుండదు లేకపోతే ఎక్కడపడితే అక్కడ కలరా మలేరియాలు బయలుదేరుతుంది అక్కడనుంచి ఇక్కడికి వస్తుంది వాళ్ళను వీళ్ళను కూడా చంపేస్తుంది కనుక ఈ public health విషయంలో గట్టిగా ప్రయత్నంచేసి, ఇంకా ఎక్కువ మొత్తాన్ని కేటాయించవలెనని మంత్రిగారిని కోరుతూ, అధ్యక్షులవారు ఈ అవకాశం ఇచ్చినందుకు వారికి నా కృతజ్ఞతాభివందనములు తెలుపుతున్నాను

Sri N RAMABHADRA RAJU — అధ్యక్ష మహాశయా! ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక గురించి మాట్లాడేముందు మంత్రి సంజీవరావుగారిని అభినందిస్తున్నాను కాని నా దృష్టిలో ఒక లోటుకూడ కనిపిస్తున్నది అదేమంటె అమ్మయినా సరే పెట్టదు అన్నట్లు ఈ planning కు గాను, 244 కోట్లు కాకుండా అయిదువందలలో ఆరువందలలో కాని ఉంటే బాగుండేదని చెప్పుచున్నాను కాని మంత్రిగారు, అయ్యా మన ప్రభుత్వముయొక్క ఆర్థిక స్తోమతు ఏమిటి, డబ్బు ఉంటేనే ఎక్కువ ఇవ్వడానికి అవకాశం ఉంటుంది అని జవాబు చెప్పవచ్చు ఈ సందర్భంలో ఒక విషయం మనవి చేస్తాను ఇది అప్పుడప్పుడు పత్రికలలో చూస్తూ ఉన్నాము మద్రాసు, బొంబాయి రాష్ట్రాలు ఈ రెండవ పంచవర్ష ప్రణాళికకు ఏర్పరచిన మొత్తాలను మన రాష్ట్రము ఏర్పరచిన మొత్తాన్ని చూచినట్లయితే వీటికి ఏవిధమైన పోలిక లేదు మద్రాసు రాష్ట్రము మనదానికంటె పెద్దదికాదు ఆర్థికంగాను, జనాభాలోను హైదరాబాదు అటువంటిదే, మధ్యప్రదేశ్ అటువంటిదే ఈ సందర్భమున మనం ఒక విషయాన్ని మరచిపోకూడదు ఇతర రాష్ట్రాలకంటె మన రాష్ట్రము నిన్నగాక మొన్న ఏర్పడినటువంటిది ఈ మద్రాసు, బొంబాయి రాష్ట్రాలు ఎన్నో రోజులనుంచి అనేక రంగాలలో అభివృద్ధిచెందినాయి కాని మనరాష్ట్రము మొన్ననే ఏర్పడింది కనుక మనరాష్ట్రం ఎక్కువగా అభివృద్ధి పొందడానికి అనేక రంగాలలో పథకాలు ఏర్పాటుచేసుకోవడం చాలా అవసరమని తెలియజేస్తున్నాను ఆవిధంగా చూచినప్పుడు, మనము ఇతర రాష్ట్రాలకంటె పెద్ద పథకాన్ని వేసుకోవలసియుంటుంది మద్రాసుప్రభుత్వము 350 కోట్ల రూపాయలలో పథకము ఏర్పాటు చేసుకొన్నది హైదరాబాదు 840 కోట్లతోను, మధ్యప్రదేశ్ 400 కోట్లతోను, బొంబాయి 840 కోట్లతోను చాలా చిన్నదైన ఒరిస్సా 280 కోట్లతోను పథకాలు ఏర్పాటు చేసుకున్నాయి కాని ఆంధ్రరాష్ట్రము 244 కోట్లు రూపాయలు మాత్రమే కేటాయించింది ఈ విధంగా

3rd August 1955] (Sri N Pamabhadra Raju)

ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే మన పథకము చాలా తక్కువగా ఉన్నదని చెప్పవలసి యున్నది మామూలుగా మనము చూస్తూఉన్నదే ఒక్కొక్కప్పుడు గట్టిగా మాట్లాడుతూఉంటే కొన్ని పనులు అవుతూ ఉంటాయి గట్టిగా అడుగుతూ ఉంటే మరికొన్ని పనులు జరుగుతాయి ఆ విధంగా శాసనసభ్యులు, మంత్రులను మంత్రులు కేంద్రప్రభుత్వాన్ని అయ్యా మాకిదిచాలదు మేము అభివృద్ధిపరచుకొంటాము అని గట్టిగా వక్కాణించి కూర్చుంటే తప్ప ఆవిధంగా చెప్పుతూ ఉంటేనే తప్ప ప్రభుత్వము ఇవ్వదు మన అనుభవముకూడ చూస్తూ ఉంటాము ఇంటిలో పసిపిల్లలు తల్లిని తండ్రిని పలుమారు అడుగుతూ ఉంటే చివరకు విసిగి డబ్బు ఇచ్చేస్తుంటారు అడక్కపోతే ఇవ్వరు ఆవిధంగా మన మంత్రిగారు కూడ చేయవలసి యున్నది వెంకటరావుగారు మంత్రివర్యులే కాకుండా నాకు అన్నిరకాలా దగ్గరివారు కూడాను కాని వారు చిన్న పొరబాటు చేశారేమో అనుకొంటాను అయినా ఇది final report కాదు రేపు 30, 31 తారీఖున గోపాలరెడ్డిగారు, వెంకట్రావుగారు ఢిల్లీకి వెళ్ళి కేంద్ర ప్రభుత్వముతో ఆలోచన చేసిన తర్వాత final stage కి వస్తుంది. కనుక ఈ పథకాన్ని 5, 6 వందల కోట్లతోటి తయారుచేసి దీని కొరకు కేంద్రప్రభుత్వముతో fight చేసి అప్పుడు కూడ వారు ఒప్పుకోకపోతే అప్పుడు ఇంకొక స్వరూపంలో చేసుకోవచ్చు ఆవిధంగాచేస్తే బాగుంటుందని మొట్టమొదటినుంచి చెప్పుతూనే ఉన్నాను

ఆంధ్రాలోవుండగా మొదటివిషయము ఈరోజున దేశాన్ని, రాష్ట్రాలను పరిపాలిస్తున్న ప్రభుత్వము, కాంగ్రెసు ప్రభుత్వమే దీనికి పునాది వేయాలని బాపూజీయొక్క ఆశయము ఇంతకుముందు కూర్మయ్యగారు హరిజనోద్ధరణ విషయాలు చెప్పారు గ్రామ పరిశ్రమలు ఎన్నో వున్నవి ఈనాడు Industries కూడా వున్నవి రాబోవు పంచవర్ష ప్రణాళికలో యివి చాలా తక్కువగా ఏర్పాటుచేశారు ఇతర రాష్ట్రాలలో Industries కు గాను వున్నటువంటి పథకాలు చూస్తే, కేంద్ర ప్రభుత్వమువారు మద్రాసు State కు 70 కోట్లు యిచ్చారు హైదరాబాదుకు 80 కోట్లు యిచ్చారు మనకు ఆంధ్రకు చూస్తే 11 కోట్ల పై చిల్లర మాత్రమే

The Hon Sri K VENKATA RAO — వారు కూడ చెప్పారు నేను కూడకుండా చెప్పాను అంతే దానిలో లేదా

Sri N RAMABHADRA RAJU — సరే వదలకండి ఆలోచించి చూస్తే గూడా యీనాడు మన హిందూదేశములో వున్న బొంబాయిలోనిగాని, హైదరాబాదులోనిగాని, అలహాబాదులోనిగాని, యింకను యితర రాష్ట్రాలలో వున్న మిల్లులు అన్నీ చూస్తే అవిఅన్నీ దేనిలోవస్తాయో, వాటినిమాత్రము మన రాష్ట్రములోకూడా ప్రథమములోనే ఏర్పరచవలసిన అవసరములేదా ? ఉన్నదని అంటున్నాను అయినప్పటికినీ యీరోజున, నిన్న లేక మొన్న ఏర్పడిన యీ రాష్ట్రముయొక్క అభివృద్ధికోసం చేసే ప్రయత్నము, కృషి అంతో యింతో ప్రభుత్వముమీద ఉన్నదని నేను చెబుతున్నాను వీటి అన్నిటికన్నా ముఖ్యమైంది విద్య విద్య లేకపోతే యేరాష్ట్రముగాని, ఏ సంఘముగాని మరియేది గూడా అభివృద్ధి చెందలేదు ప్రభుత్వము ఇంచుమించు 12½ కోట్లు విద్యకోసం కేటాయించారు ఇది చాలా తక్కువ అని నా అభిప్రాయము, విద్యకుగూడా హెచ్చుగా చేయకపోవడము ప్రభుత్వానిదే లోటు అని నా అభిప్రాయము

అంతే కాకుండా రాష్ట్రీయంగా ఆర్థికంగా బాగుపడాలంటే మనదు అనేక సంస్థలు ప్రభుత్వము దృష్టిలో పెట్టుకోవాలి ఓడరేవుల విషయము తీసుకుంటే రాష్ట్రమునకు వున్న ఓడరేవులతోబాటు Railway Communications, Inland Water Communications, యివన్నీ కూడా మాచుకోవలసి వుంటుంది ఓడరేవు సరియైనదిగా ఉండాలంటే, ఇతర ప్రాంతమునుంచి వచ్చే సరుకును దిగుమతి చేసుకొనేటందుకు గాని, యిక్కడ నుంచి యితర ప్రాంతాలకు పంపటానికి ఎగుమతి సౌకర్యాలు వుంటేనే అది సరియైన ఓడరేవు అనిపించుకుంటుంది దాన్నిబట్టే రాష్ట్రానికి విలువ ఏర్పడుతుంది ఓడరేవు లేకపోతే, రాష్ట్రమునకు విలువవుండదు మన రాష్ట్రానికి వుత్తరమునుంచి దక్షిణమువరకు ఓడరేవుకు తగినచోట్లు అనేకములు వున్నవి అందు ముఖ్యమైనది విశాఖపట్టణమురేవు విశాఖపట్టణంలో ship building yard కూడా వున్నది ఈ yard లో construction of ships జరుగుతూ వుంటుంది ప్రస్తుతమువున్న విశాఖపట్టణపురేవు అంత పెద్దరేవు కాదు దానిని వృద్ధిచేసుకోవలసి వుంటుంది ఇదిగాక కళింగపట్టణము రేవున్నది ఇంకను చాలా చిన్న చిన్న రేవులు వున్నవి కాని మనకు సరియైన పెద్దరేవు ఎక్కడనూ లేదు వున్న వాటిలో విశాఖపట్టణమురేవు ఒకటేవున్నది దీన్ని ముందు వృద్ధిచేసుకోవాల్సివున్నది

మరొకవిషయము, సోదర సభ్యులు చాలామంది మత్స్యపరిశ్రమను గురించి చెప్పారు ఈ పరిశ్రమను వృద్ధిచేయటానికి తూర్పుగోదావరిజిల్లాలో river mouths చాలా వున్నవి ఈ పరిశ్రమ చేయటానికి తగినన్ని ప్రదేశాలు తూర్పుగోదావరిజిల్లాలో వున్నన్ని ప్రదేశాలు, మనరాష్ట్రములోనే కాదు, దేశములోనే లేవని నా అభిప్రాయము కాబట్టి అటువంటి మత్స్యపరిశ్రమను వృద్ధికితెస్తే విదేశాలతోకూడా ఎగుమతి దిగుమతి సౌకర్యాలు ఏర్పడగలవు ఈ మత్స్యపరిశ్రమకు కావలసిన సహాయము యీ fishermen కు ఏవిధంగా చేస్తుందో నాకు బోధపడటములేదు ప్రస్తుతము యీ డిమాండును బట్టిమాత్రమే ఏదో కొద్దిగా ఏర్పాటుచేస్తున్నారు అది సరికాదు ఇంకను ఎక్కువగా వారికి సహాయముచేయాలని అంటున్నాను మత్స్యపరిశ్రమదార్లకు ఆర్థిక సహాయముచేసి, వారికి మార్కెటింగు facilities ఏర్పాటుచేస్తే యీ fishermen వర్గాన్ని ముందుకుతీసుకొనిరావడానికి వీలవుతుంది

మరొక విషయము ఈ రోజున దేశములో అందరుకూడా చాలామంది విద్యాభ్యాసము చేస్తున్నారు చాలామంది యీరోజులలో ఉద్యోగాలులేకుండా బాధపడుతున్నారు ఎక్కువగాకూలి పరిశ్రమలు, కాకుండా యింకను యితరవృత్తులలో వుండేవారు చాలామంది వుద్యోగాలులేక అవస్థలు పడుతున్నారు ఈసంగతి ప్రభుత్వమునకే కాదు మనకు అందరికికూడా తెలుసు ఈ నిరుద్యోగ సమస్య తీర్చడానికివున్న మార్గము [illegible] గాంధీగారు చెప్పినదాన్ని మనము విస్మరించకూడదు అని నేను ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాను వారి ఆశయాలలో మొదటిది cottage industries వీటిని వృద్ధిలోకితీసుకునిరావాలని ఆయన ఎంతో యోచిస్తూ వుండేవాడు దానికి మార్గము నేను ఒక్కటే చెబుతున్నాను మన రాష్ట్రములో చిన్న చిన్న cottage industries ప్రతి కుటుంబములోను కొద్దోగొప్పో వుంటున్నవి వీటికిగాను ఒక పథకమును ప్రభుత్వము ఏర్పాటు చేయాలి రాబోవునది ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రథమ పంచవర్ష ప్రణాళిక దాదాపు అయిపోయింది ఇక రాబోయే ద్వితీయ పంచవర్ష

3rd August 1955] (Sri N Ramabhadra Raju)

ప్రణాళిక కోసైనా యీ cottage industries కు దోహదమిచ్చి ముందుకు తీసుకొని రావాలి ఇప్పుడు కేంద్ర ప్రభుత్వమువారు మన రాష్ట్రానికిగాను 244 కోట్లు కేటాయించారు ఇండస్ట్రీస్ మినిష్టరు అయిన శ్రీ వెంకట్రామయ్యగారు యింకను కొంచెము శ్రమపడి, కేంద్ర ప్రభుత్వమును వత్తిడి చేసి, మనకు industries వృద్ధికి తీసుకొని రావటానికి వీలుగా యీ సొమ్ము చాలదనిచెప్పి యింకా కొన్ని కోట్లు హెచ్చుగా సంపాదించుకొని రావడానికి కృషి చేస్తారని నమ్ముతూ విరమిస్తున్నాను

Sri J LAKSHMAYYA — అధ్యక్షా, Planning మంత్రిగారు తమ సామర్థ్యాన్ని ద్విగుణీకృతం చేసుకోవాలనే వుద్దేశ్యముతో పంచవర్ష ప్రణాళికను రూపొందించారు కాబట్టి వారి చేతలలో ఏలోపములేకుండా చేస్తారని నాకు నమ్మకమువుంది అయినప్పటికీ వారు exhibition లో చూపించిన వివరాలు చూడకుండా వ్యాఖ్యానించటానికి అవకాశములేదు కాబట్టి వారే సర్వవిధయాలు చేస్తారని నమ్ముతూ కొన్ని లోపాలుమాత్రము అందులో సవరించటానికి వున్నవని నేను సూచిస్తున్నాను నూటికి 70 మంది రైతులువున్న యీ ఆంధ్రదేశములో పశుగణాన్ని వృద్ధిచేయాదము అనే దానికి వారు పూనుకొనడము మంచిది అందుకు నేను సంతోషిస్తున్నాను కాని పశువులు తిరగడానికి, అవసరమైన గ్రామానికి సమీపములోవున్న పచ్చికబయళ్ళు సంగతిమాత్రము మంత్రిగారు గుర్తించినట్లులేదు గ్రామానికి సమీపములోవున్న పోరంబోకులు, పచ్చికబయళ్ళు, వ్యక్తులద్వారానో, సంఘాలద్వారానో వారి ఆక్రమణలోవున్నవి అందువల్ల రైతులు వారి పశువులు మేపుకోటానికి వీలులేకుండా చాలా యిబ్బంది పడుచున్నారు ఆపరిస్థితులు ప్రభుత్వానికి తెలియకపోలేదు అదీకాకుండా గ్రామాలలోవుండే పశువులు, ఏగంటలో, రెండుగంటలలో, కాళీస్థలాలలో నిలబడటానికిగూడా వీలులేకుండా గ్రామస్థులు చాల యిబ్బంది పడుతున్నారన్న సంగతి ప్రభుత్వము గుర్తించలేదు అందువల్ల పచ్చికబయళ్ళు, పోరంబోకులు, ఎవరు ఆక్రమించుకున్నప్పటికీ అటువంటివి వెంటనే ప్రభుత్వము స్వాధీనపర్చుకోవాలని సూచిస్తున్నాను అంటే, యివి స్వాధీనపరచుకుంటే ఆక్రమణదారులను నష్టపరచాలనే వుద్దేశ్యముకాదు వారిమీద ద్వేషభావముతో మాట్లాడుతున్నాననీకాదు అటువంటి ఆక్రమణదారులకు సహాయము ప్రభుత్వము చేయాలంటే దానికి అనేక విధములువున్నవి ప్రభుత్వము, వారికి సహాయము చేయవచ్చు గాని ప్రజలను గ్రామస్థులను యిబ్బంది పెట్టడము న్యాయముకాదు ఎర్రని యెండలో పశువులు నడిరోడ్డుమీద నిలబడవలసివస్తున్నది పచ్చికబయళ్ళు, పోరంబోకులే పశువులకు మైతప్రదేశములలో మేయటానికి, విశ్రాంతిగా తిరగటానికి యేర్పర్చబడిన ప్రదేశాలు యీవిధంగా ఆక్రమించుకొనుట న్యాయముకాదు పశువులు నోరులేనిజీవములని, అవి మేసేచోటును ఆక్రమించుకుని, వాటికి ఆప్రదేశాలు లేకుండాచేయడము న్యాయముకాదు కాబట్టి ప్రభుత్వము గ్రామాలలో పశువులకొరకు యేర్పడిన ప్రదేశాలు ఆక్రమణలలోనుంచి నిర్మొఖమాటంగానైనాసరే తొలగించవలసిందిగా కోరుతున్నాను లేబరు సంఘాలవారికి సహాయముచేయాలంటే యింకా అనేకవిధముల[illegible] చేయవచ్చును మనము ప్రతిరోజూ చేయిస్తున్న పనులలో టెండర్లుపిలిచి ఒక కంట్రాక్[illegible] యిచ్చేందులు యిటువంటి లేబరుకు, contractor కు యిచ్చి యేటిగట్లు పోయడ[illegible] కాలువలు త్రవ్వడమో, రోడ్లు వేయడమో, లేక రాతిపేర్పు చేయ[illegible] యింకను యిటువంటి Skilled labour అక్కరలేని పనులను అటువంటి లేబ[illegible] యిచ్చి చేయించే మార్పుచేసుకుని రావాలని నేను కోరుతున్నాను అది ఒక[illegible]

కంట్రాక్టరుకుయిస్తే దానిలోవచ్చే లాభము అంతా, ఆ ఒక్క కంట్రాక్టరే తింటాడు ఈవిధంగా కేవలము సొసైటీలకుయిస్తే ఆసంఘాలలోనివారందరు జాగ్రత్తగా పనిచేయడానికి అవకాశము వుంటుంది సంఘంలోనివారందరు కొన్నాళ్ళపాటు ఆవచ్చేఆదాయంవల్ల జీవించడానికి ఆస్కారముంటుంది గ్రైనపని P W D వారు, లేక Highways డిపార్టుమెంటువారుగాని supervision తో చేయిస్తే పనులు త్వరగా సక్రమంగా జరగటానికి కూడా ఆస్కారముంటుంది సంఘములో వ్యక్తులు లాభాలు పంచుకుంటారు కాబట్టి బీళ్ళు వగైరాలు సేద్యానికిచ్చి గ్రామములలో తగాదాలుపెట్టే సందర్భాలు కల్పించవద్దని మనవిచేస్తున్నాను

తరువాత Co operative Marketing Societies మార్కెట్టుసెంటరులువల గ్రామాలలోగాక జనసమ్మర్దమువుండే తాలూకా Headquarters లో మార్కెట్టు సెంటరు కాన్పటికి పెట్టుతున్నారు ఇది అన్యాయము పంచవర్ష ప్రణాళికలో నూరుసంఘాలకు మాత్రమే ఆస్కారముకల్పించవచ్చునని తెలిసింది ముఖ్యంగా వ్యాపార స్థలాలలో అటువంటి సొసైటీలు లేకుండాచేయడము చాల అన్యాయము కాబట్టి యింకా సంఖ్యపెంచి, యిటువంటి వ్యాపారస్థలాలలోనే యిటువంటి సొసైటీలకు యివ్వాలని అంటున్నాను

తరువాత రైలుమార్గాలవిషయం వున్నది నరసాపురంనుంచి నిడదవోలుకు గోదావరి యేటిగట్టుదగ్గరే రైలుమార్గమువేయిస్తే అది తూర్పుగోదావరి జిల్లాలో అమలాపురం తాలూకాలో ముఖ్యప్రదేశాలను, కొత్తపేట, రాజోలు, వగైరా ప్రాంతములు touch చేస్తూవెళ్ళుతుంది ప్లానింగు మంత్రి కళావెంకట్రావుగారు యీవిధంగా వెళ్ళే ఒక రైలుమార్గము వేయడము నిర్మించటానికి పూనుకోలేదో తెలియదు బహుశ వారి స్వంతజిల్లా కాబట్టి వారి స్వలాభముకోసము యిటువంటి ప్రయత్నము చేస్తున్నారని ప్రజలు అనుకుంటారనికాబోలు వారు ఆప్రయత్నానికి పూనుకోలేదని అనుకుంటు న్నాను పైగా యీ రైలుమార్గమువేస్తే గోదావరిగట్టువెంబడి అనేకముఖ్యమైన రేవు స్థలాలు touch చేస్తూపోతుంది కాబట్టి ప్లానింగుమంత్రిగారు యీ విషయములో తగు శ్రద్ధవహిస్తారని నమ్ముతున్నాను

ఈ ప్లానులో యితరవిషయాలు అన్నీకూడా సమగ్రంగాచూడవలసినదే చర్చించటానికి అవకాశములేదు యింతకుమించి నాకుకూడా మాట్లాడటం యిష్టములేదు గనుక యింతటితో విరమిస్తున్నాను

Sri B RAMA REDDI — అధ్యక్షా, మహాశయా ! ద్వితీయ పంచవర్ష ప్రణాళికను రూపొందించడంలో ప్లానింగు మంత్రిగారు తమ ప్రతిభా విశేషాలను చూపించినంతవరకు బాగానేవున్నది దానితో నేను ఏకీభవిస్తున్నాను కొన్ని విషయాలు మాత్రము ఇంకా వున్నవాటిని వుదహరించి చెప్పదలచుకొన్నాను వారు చెప్పినదాంట్లో ఈ విషయముగా వున్నది "Looked at from any angle, agriculture which will continue for many years to be the predominant vocation of the people and its requirements particularly in respect of irrigation must play a primary role in our plan" అనే విషయము చెప్పడములో వారు మన ఆంధ్రదేశము ముఖ్యముగా వ్యవసాయక దేశం అని మాత్రము వారు ఒప్పుకొన్నారు అని తెలుస్తున్నది

అభివృద్ధి విషయంలో ఆర్థిక సమానత్వము సాధించాలి, అది చాలా ముఖ్యమైనది అని, సాంఘిక సమానత్వము అందులో ఒక భాగముగా వుంటని వారు సెలవిచ్చారు ఆర్థిక సమానత్వము ఎక్కడ సాధించాలంటే ముఖ్యంగా ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులోను, ముఖ్యంగా కమ్యూనిటీ Development Blocks National Extension Scheme Blocks వారు ఏర్పాటు చేసినప్పుడు, ఇప్పుడు ప్రభుత్వము ఏర్పాటు చేస్తున్నటు వంటి విషయాలను బట్టి చూస్తే ఎక్కడ అయితే ఇంతకుముందు ఇరిగేషను సౌకర్యాలు వున్నాయో, ఎక్కడ అయితే ప్రజానీకము ఎక్కువ ఆర్థికత్వానికి పాటుపడుతుందో,

The Hon. Sri K VENKATA RAO — నేను ఒకవిషయం చెప్పాలి నేను ఇంతవరకువున్న కమ్యూనిటీ National Extension Schemes Blocks లు ఈ కమిషను ఏరియాల్లో రెండుతప్ప మొత్తము 27 లో 25 బాక్‌వర్డ్ ఏరియాల్లో వున్నాయి

Sri B RAMA REDDI — మంత్రిగారు చెప్పినవిషయం కాదనడానికి వీల్లేదు కాని మొట్టమొదట ప్రారంభించే వుడు కమ్యూనిటీబ్లాకులు ఏర్పాటు చేసినప్పుడుమాత్రము కేవలం K. C కాలువమీదనే ఆధారపడివున్నటువంటివాటిల్లో ఏర్పాటు చేసినారుగాని అదేప్రక్క ప్రక్కనవున్నటువంటి ఎక్కువ క్షామానికి గురిఅవుతున్న ప్రాంతముగాను మొట్టమొదట తీసుకొనివుంటే బాగుంటుంది అని సలహా చెబుతూ ఇకమీదటనైనా ముఖ్యముగా ఎక్కువ క్షామాలకు గురిఅయ్యేప్రాంతాలను దృష్టిలోపెట్టుకొని N E S బ్లాక్సును ఏర్పాటుచేయాలని వారిని నేను ప్రార్థిస్తున్నాను ప్లానింగు లో ఇరిగేషను వెల్సు అని వేసివున్నారు కాని ఈ ఇరిగేషను వెల్సుఅనేవి సాముదాయకంగా గ్రామాలకుసంబంధించివుండేవి ప్రతిరైతుకు ఒక్కొక్క బావిక్రింద కేవలం 10, 12, 20, 30 ఎకరాలు సాగుచేసుకోదలచిన అవసరమువుండి వుండదు ఈపరిస్థితుల్లో ఒకప్పుడు ఈవిషయము చర్చించినప్పుడు మనము ఎందుకు గ్రామసముదాయానికి ఇచ్చేదానికి వీలుంటుందిగాని, ప్రైవేటువెల్సుకు ఇచ్చేదానికి వీల్లేదుఅన్నారు అటువంటప్పుడు ఈ ఇరిగేషనువెల్సు అనేదానికి అర్థముఏమిటో నాకు బోధపడడములేదు. అందువల్ల ఇరిగేషనువెల్సు ప్రైవేటువ్యక్తుల స్వాధీనములో వున్నప్పటికికూడా వారి సంఘాలకు అంటే 10 మందికి ఇచ్చినట్లయితే వారు ఒక సంఘముగా ఏర్పాటుఅవుతారు సంఘసముద్ధరణఅనే పదానికి అర్థము కూడా వుంటుంది కాబట్టి కేవలం పెద్దలుగావున్నటువంటి రైతులస్వాధీనములోకూడా ఈ ఇరిగేషను వెల్సు వుండవచ్చును అటువంటివారికి ఈసహాయము ఈప్లానులో ఒకవిధముగా చూపినట్లయితే వారు బాగుపడి లోపాలులేకుండా మంచిస్థితికి వచ్చేందుకు అవకాశము వుంటుంది వారికికూడా సహాయముచేయాలని నేను ప్రార్థిస్తున్నాను నిరుద్యోగ నిర్మూలనకూడా ఇందులో ఒక భాగంగావున్నది కాని ముఖ్యముగా ఈప్రణాళిక ఏర్పాటుచేసినప్పుడు ఇప్పటివరకు అన్నివిధాలాకూడా, ఈ ప్రణాళికలో చూపినటువంటి మొత్తములో ఎక్కువగా, సాధారణముగా అవసరమైన పనికిరాకుండా డిపార్టుమెంటులో వుద్యోగస్తులకు దాదాపు ర క్రింద 8 వంతులు భాగము పోతున్నది ముఖ్యముగా ఈ కమ్యూనిటీప్రాజెక్టులోను మన N E S బ్లాకులలోను వున్న వుద్యోగస్తులకు ఎక్కువ ఖర్చు అవుతున్నందువల్ల అనుకొన్నటువంటి ఆదాయముగాని,

ప్రణాళిక వేసేప్పుడు గ్రామము అయినా దృష్టిలో పెట్టుకొని ఉద్యోగులు తాలూకాను ప్రక్క ప్రక్క వున్నటువంటి ఆర్థికంగా లోబడి వున్నవాటిని దృష్టిలో వుంచుకొని ఒక విధమైనటువంటి ఆస్కారము ఇవ్వించాలని వారికి మనవి చేస్తు ఇంతటితో విరమిస్తున్నాను

Sri B G M A NARASINGA RAO — అధ్యక్షా! మన ప్లానింగు మంత్రిగారు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను మన ఎదుట పెట్టినారు చాలా స్వల్పకాలంలో ఇంత సమగ్రమైన ముసాయిదాను తయారుచేస్తారని మేము అనుకోలేదు ఇంత కష్టపడి తయారుచేసినందులకు వారిని, వారి department వారిని మేము అభినందిస్తున్నాము అయితే ఈ ప్రణాళికకు రాష్ట్రములో వున్న యావన్మంది ప్రజలుకూడా సహకరిస్తేనేగాని ఇది విజయవంతము కానేరదు ప్రజల్లో గొప్ప వుత్సాహము కల్గి పూర్తిగా చేస్తేతప్ప ఈ ప్రణాళిక ఎంతమాత్రముకూడా విజయవంతము కానేరదని చెప్పి నా విశ్వాసము ప్రతివారి విశ్వాసముకూడా అదేనని తోస్తోంది అయితే ప్రజల సహకారము తీసుకొనేటందుకు ప్రభుత్వము ఏమి చర్యతీసుకొంటుంది అనేదే మనము ఆలోచించాల్సినవిషయము అనేక శతాబ్దాలుగా భారతదేశము బానిసత్వములో వుండటమువల్ల ప్రజల్లో నిర్లిప్తత అనేదిఏర్పడి చైతన్యము లేకుండా ఇంతవరకు వుండాల్సి వచ్చింది ఇప్పుడు ఇది నాదేశము, ఇది నారాష్ట్రము, ఇది నాగ్రామము అని దీనికోసము పూర్తిగా కృషి చేస్తేనేగాని ముఖ్యముగా ఏవిధమైనటువంటి సౌభాగ్యము అనేది మనము కాంక్షించలేము అనేది ప్రతిఒక్కరూకూడా గ్రహించవలసి వున్నది అందుకు ప్రజలను చైతన్యవంతము చేయడానికి ప్రతిఒక్కరూకూడా ప్రయత్నించాలని చెప్పి నేను కోరుతున్నాను

అయితే ఈ ప్రణాళికలో చాలా లోపములు ఉన్నవని చాలామంది చెప్పుచున్నారు అయితే ఏ ప్రణాళికలో లోపములు లేకుండ ఉన్నవో నాకు తెలియకుండ ఉన్నది అనేక దేశములు ప్రణాళికలు చేసినవి అవి చాలా లోపభూయిష్టముగా వున్నవని వారే ఒప్పుకుంటున్నారు అందువల్ల చేసిన ప్రణాళికలో లోపములు వుండలేదనుకొని ఈ కార్యక్రమమును పూర్తిగా విజయవంతము అయ్యేటట్లు చూడవలసిన బాధ్యత మనపైన ఉన్నది ఆ విధముగా మనము అంతా కూడా ప్రజలను ఉత్తేజపరచి ఇది అంతా ప్రజల ప్రణాళిక అనుకొని అందరు కలిసి పనిచేస్తేనేగాని ప్రణాళికాకాలములో అమలు జరుగదు మన గ్రామ అభివృద్ధి మనమే చేసుకోవాలి ప్రతిదానికి ప్రభుత్వము నడుపకూడదు మనకు మనము తోడ్పడవలెనని ప్రతివారు కూడా ఉత్తేజింపచేయవలసిన బాధ్యత మనపైన వున్నది.

[At this stage temporary Chairman Sri Gottimukkala Jagannadha Raju occupied the Chair]

అంతేకాకుండా ప్రతిపక్షము మీద కూడా ఉన్నది కాని ప్రతిపక్షమువారు విమర్శనాయుతముగా కాలక్షేపము చేస్తున్నారు ఇప్పటికే వారి మనస్సులలో కొంచెము మార్పు గోచరిస్తున్నట్లు కన్పడుచున్నది అయితే వారు జాతీయతను వారి sincerety ని రుజువు పరుచుకోవాలి ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఉత్సాహవంతముగా పోయి గ్రామాలలోకిపోయి "ఇది మన దేశమునకు ఈ పనిచేయాలని చెప్పట లాభము లేదు మనము నష్టము కట్టుకుంటాము ఈ చెఱువు పూడిపోయింది దానిని త్రవ్వుకుందాము,

యీ గోష్ఠు వేసుకుంటాము, మన స్కూలు మనము పెట్టుకుంటాము" అని చెప్పి కమ్యూనిష్టువారు ఏనాడు అయితే ప్రజలలోకి పోయి వారిని ఉత్తేజపరుస్తారో ఆనాడే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయవంతము కాగలదని నా నమ్మకము వారికి నిజముగా జాతీయత ఉన్నట్లయితే వారు పాత ధోరణి అంతా మానివేసి ఈ జాతీయ రంగములో ఉత్తేజముతో పనిచేస్తారని నా విశ్వాసము అందుచేత నేను వారికి రాజకీయ రంగములో చాలా మార్పులు వచ్చినట్లు గమనించాలని కోరుచున్నాను భారత దేశము ఒక్క మన దేశమునకే గాక యావత్ ప్రపంచమునకు కూడా శాంతిని నెలకొల్పడానికి చేస్తున్న కృషిని వారుకూడా అభినందిస్తున్నారు అందుచేత శాంతి అనేది పుట్టినచోట భారతదేశములో నెలకొల్పబడినట్లయితే భారతదేశము మిగతా దేశాలలో శాంతి నెలకొల్పడానికి దోహదము చేయగలగని నా విశ్వాసము అందుచేత భారతీయులైన మీరు యీ దేశములో శాంతి నెలకొల్పడానికి జాతీయ ఔన్నత్యమును పైకి తీసుకు రావడానికి జాతీయ పునర్నిర్మాణములో సహకరించండి అని నేను ప్రతి పక్షమువారితో కూడా విన్నవిస్తున్నాను ఆ విధముగా ప్రతిపార్టీ ఎప్పుడైతే సహకరిస్తుందో అప్పుడే యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తప్పకుండా సాధించుకో గలమని నా విశ్వాసము ఇప్పటికే యీ ప్రణాళిక చాలా పెద్దదైనదని మనవి చేశారు ఈ ప్రణాళికలో పేర్కొనబడిన కార్యక్రమము అన్నీ కూడా వచ్చే 5 సం॥లలో పూర్తిచేసుకోగలిగితే మనము ఎంతో ముందుకు పోయిన వారము అవుతాము దాని ప్రకారము పనులన్నియు సక్రమంగా నెరవేరిన మేమంతా బాగా సంతోషిస్తాము అని ప్రభుత్వమునకు మనవి చేస్తున్నాను ఆంధ్ర ప్రజానీకము అంతా కూడా సంతోషిస్తుంది అయితే ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడా irrigation కు electricity కి అగ్రస్థాన ప్రాముఖ్యత యిచ్చియున్నారు Irrigation and electricity కి మొదటి పంచవర్ష ప్రణాళికలో ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వడమువల్ల ఇతర కార్యక్రమము కుంటుపడినదని ప్రతి ఒక్కరు చెప్పినారు అయితే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో భారత ప్రధాని చెప్పింది నిరుద్యోగ నిర్మూలన భారీ పరిశ్రమలు నెలకొల్పడము అన్నారు కాని ఆంధ్రరాష్ట్రములో 2 వ పంచవర్ష ప్రణాళిక చూచినట్లయితే 100 కోట్లు irrigation కు 40 కోట్లు electricity కి 10 కోట్లు ఇతర వాటికియిస్తూ 16 కోట్లు పరిశ్రమలకు కేటాయించారు పారిశ్రామికంగా ఎంతో ముందుకు పోయిన మద్రాసురాష్ట్రం చూస్తే 60 కోట్లు ప్రత్యేకించారు ఆ విధముగ చూచినట్లైన మనము పారిశ్రామికంగా చాలా కృషి చేయవలసియున్నది కాని మనము ఎక్కువగా ఈ నదులమీద agriculture కు ఖర్చుపెడుతున్నాము అందుచేత ప్రభుత్వం ఇదిగమనించి ఈ అభివృద్ధి అనేది ఎక్కువగా పారిశ్రామిక రంగములో తీసుకువస్తారని నా కోరిక ఇంకా చూచినట్లయిన మనము చేయవలసిన అభివృద్ధి కార్యక్రమాలు చాలా ఉన్నవి మన దేశము self sufficient కావాలంటే మనకు కావలసిన నిత్యజీవిత వస్తువులను మనము తయారు చేసుకోవాలి దానిలో consumer goods తయారు చేసేటందుకు factory లు నిర్మాణము చేసుకోడానికి కృషి జరగాలని ఈ పంచవర్ష ప్రణాళికలో ఉన్నది సబ్బుల తయారీలో గాని ఇతర మందుల విషయంలో గాని Cigerettes తయారీలో గాని, powders ఇతర perfumery goods లో గాని తయారీకి కొన్ని కోట్ల రూపాయలు పైదేశాలకు పోతున్నవి ఈ consumer goods తయారుచేయవలెనని కోరుచున్నాను Irrigation లో అధికముగా పెట్టుబడి పెట్ట

డము వల్ల ఇప్పటికే ధరలు దిగుతున్నవని ప్రభుత్వము అంటున్నారు ఇప్పటికే రైతులు ఎంతో ఆందోళన చేస్తున్నారు ఎక్కువగా ప్రాజెక్టులు కట్టడమువల్ల యింకా ధరలు తగ్గి agricultural సంగమును తారుమారు చేస్తాయని కూడా మనకు భయము ఉన్నది అది కూడా ప్రభుత్వము గమనించాలని కోరుచున్నాను అంతేకాకుండా ముఖ్యముగా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సక్రమంగా నడవాలంటే ధరలు తగ్గకుండా చూడాలని అదే ప్రథమ లక్ష్యమని చెప్తున్నారు ధరలు తగ్గకుండా కాపాడాలంటే యీ కరువు అన్నది, యీ దరలు అనేది యీ విధముగా ఉంటాయని తెలుస్తాయి ఈ విధముగా శాశ్వతముగా ఉండేటట్లు ప్రభుత్వము చేస్తుంటే ఈ పనివారలకు కరువు భత్యము ఇవ్వాలని మనవిచేసుకొనుచున్నాను అంతే కాకుండా ఈ ధరలకు Government protection యిచ్చినట్లయితే కరువు ఈ సాదిగా అంతేకాకుండా ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రతిసంవత్సరము real income 5% ఎక్కువ చేస్తామని చెప్పారు 5 సంవత్సరముల కాలములో 25% real income increase చేయవలసి ఉంటుంది ఈ real income కు ఏవిధముగా ప్రయత్నము చేస్తున్నారో చూపించ లేదు అయితే ప్రణాళిక అంతా చదివితే కార్మికులకు, కార్మిక సంక్షేమములకు, 5 సంవత్సరములలో ఏమి జరుగుచున్నది దీనిలో చూచినట్లయిన, 1 కోటి 90 లక్షలు కార్మిక సంక్షేమమునకు కేటాయించినట్లు తెలుస్తున్నది ఏవిధముగా ఖర్చుపెడుతున్నారో దర్శీసు ఎక్కడా లేదు అందుచేత కార్మిక సంక్షేమము అనేది ఆఖరు దశకు వచ్చిందేమోనని, కనుక ప్రభుత్వ దృష్టిలో కార్మికులు ఎప్పుడూకూడా అధమాధముగా ఉన్నది కనపడుతూ ఉన్నది ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదము కావాలంటే పారిశ్రామిక కార్మికులకు ప్రోత్సహవలసి ఉంటుంది కార్మిక సంక్షేమములు ఇంకా ఎక్కువ చేయవలసి ఉన్నది కనుక ప్రభుత్వము వారు policy ని సక్రమంగా మార్చుకొని ఆవిధముగా కార్మిక సంక్షేమమునకు దోహదము కలుగచేస్తారని నేను విన్నవించుకుంటున్నాను

Sri P SREERAMULU —అధ్యక్షమహాశయా! ఇంతకుముందు మాట్లాడిన సోదరసభ్యులకిచ్చిన సమయాన్ని బట్టి కనీసం అందులోసగం సమయమైనా నాకువస్తుందని ఆశిస్తున్నాను ప్లానింగుమంత్రిగారు శ్రమపడి తయారుచేసినటువంటి 244 కోట్లరూపాయలకు యిచ్చినటువంటి మన స్టేటుప్లాను చాల సక్రమంగ వున్నది కాని సోదరసభ్యుడు రామభద్రరాజుగారు చెప్పినట్లు గ్రామాలనుంచి, పట్టణాలనుంచి, జిల్లాలనుంచి మేమందరముకూడా కష్టపడి తయారుచేసినటువంటి ప్లానును సగానికిసగం తగ్గించటంవలన ఒక విధమైన నిస్పృహ జనిస్తున్నది ఐతే మన ప్లానింగుమంత్రిగారి కున్నటువంటి సత్తా మాకు తెలుసును వారికున్న సత్తాను పురస్కరించుకొని కనీసం వదకొట్టినటువంటి 244 కోట్లకు తగ్గించినటువంటి యీ plan అయినా యధావిధిగా ఢిల్లీప్రభుత్వంతో పోరాడి తప్పకుండా పూర్తిగా sanction చేయించే భారం planning మంత్రిగారి పైనున్నది వారికున్న సత్తాను పరీక్షించవలసిన సమయమిది ముఖ్యంగా యింత శ్రమపడి తయారుచేసినటువంటి పరిశ్రమలశాఖ మంత్రిగారికి రెండుమూడు విషయాలు సూచించదలచాను భారీపరిశ్రమలు, మధ్యరకంపరిశ్రమలు, cottage industries స్థాపించే విషయములో ఒక విషయం దృష్టిలో పెట్టుకోవలసినదని ప్రభుత్వానికి తమద్వారా మనవి చేస్తున్నాను ప్లానింగుశాఖమంత్రిగారు ప్రశ్నోత్తరసమయాలలోగాని, యితర debate సమయంలోగాని ఉద్ఘాటించినట్లు ప్రజలు ముందుకువచ్చి ధనాన్ని వసూలుచేసినట్లయితే

ఆ ప్రాంతాలలో పరిశ్రమలు పెట్టడానికి వెనుకంజవేయం, కాని ప్రజలు విరివిగా ముందుకువచ్చి కావలసినటువంటి ధనాన్ని వసూలుచేసి సిద్ధంకావటములేదు అది విచారకరం అని చెప్పారు ఐతే ఎక్కడయినా ప్రజలు ముందుకువచ్చి కావలసినటువంటి లక్షలధనాన్ని సేకరించి వసూలుచేయడమే ప్రధానంగా పెట్టుకోకుండా ఏప్రాంతాలలో ఏపంటలు విరివిగా పండుతాయో ఏయే ముడివస్తువులు యెక్కువగా వుత్పత్తిఅవుతో అదికూడా దృష్టిలోపెట్టుకొని ఆ ప్రాంతాలలో వాని కనువయిన పరిశ్రమలను స్థాపించవలసినదని నా విన్నపం గుంటూరుజిల్లా ప్లానింగుకమిటీ సమావేశమైనప్పుడు చెఱకు పరిశ్రమవిషయంలో ప్రత్యేకంగా చెఱకుపంట విరివిగా వున్నటువంటి ప్రదేశాలలో ఒక factory నిర్మాణం చేయాలని జిల్లాప్లానింగుకమిటీలో ప్రతిపాదనవచ్చినపుడు ప్రత్యేకంగా ప్రజల సహకారాన్ని పొందవలసినటువంటి ప్లానింగుశాఖ technical objection పెట్టి ఆప్రతిపాదనను అధ్యక్షులు త్రోసిపుచ్చారు ప్లానింగుకమిటీ chairman గా ఆ subject అప్పటి agenda లో లేదని, మిగతా షరతులన్నీ fulfil చేసినప్పటికీ ప్రభుత్వం పంపించిన list లో యీ ప్రదేశం లేదన్న కారణంచేత నిరాకరించడం విచారకరమైనవిషయం ఈఉదాహరణను తమద్వారా ప్రభుత్వదృష్టికి ఎందుకుతీసుకువస్తున్నానంటే ఉత్సాహంతో ప్రజలు ముందుకు వచ్చినపుడు technicalities వలన అభివృద్ధికి అడ్డులేకుండా చూడవలసినదని, ప్రజల శ్రేయస్సుదృష్ట్యా యిలాంటి technicalities అభ్యంతరాలుగా పెట్టకుండా వుండవలసినదని ప్రభుత్వోద్యోగులకు ప్రభుత్వము instructions పంపిస్తారనే నమ్మకంతో మనవిచేస్తున్నాను ప్రత్యేకంగా రైల్వేవిస్తరణ విషయంలో గుంటూరుజిల్లా ఒంగోలునుంచి చిలకలూరుపేట, మాచర్లమీదుగా హైదరాబాదుకు ఒక రైల్వేలైను స్థాపించవలసిన అవసరం ఎంతో వున్నది దీనినిగురించి చాల రోజులుగా ఆందోళన జరిగినటువంటి విషయం ప్రభుత్వానికి తెలిసినదే మధ్యప్రాంతాలలో ఏవిధమైనటువంటి రైలురవాణా సౌకర్యాలు లేవు ఇలాంటిలైను నిర్మించడానికి యీ ద్వితీయపంచవర్ష ప్రణాళికలో చేర్చవలసినదని ప్రభుత్వానికి తమద్వారా మనవి చేస్తున్నాను ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రము ఏర్పడినతరువాత ఇండిజినస్ మెడికల్ కాలేజి మద్రాసులో ఉన్నట్టుగా మనకుకూడా ఒకటి స్థాపించాల్సిన అవసరం వున్నదికాబట్టి Second Five Year Plan లో తప్పక ధనాన్ని కేటాయించి, అటువంటి కాలేజి సాధ్యమైనంత త్వరలో ఆంధ్రరాష్ట్రములో స్థాపించడానికి తగు చర్య తీసుకోవలసినదిగా ప్లానింగుశాఖమంత్రిగారిని ప్రార్థిస్తున్నాను ముఖ్యంగా పశువుల అభివృద్ధికోసం నాణ్యమైనటువంటి పశుగణాన్ని వృద్ధిపొందించాలి రైతే దేశానికి వెన్నెముక అని నాయకులు చెప్పుకోవడమేగాని రైతును ప్రోత్సాహపరచడానికి తగినంత కృషి ప్రభుత్వపక్షమున జరగడంలేదు వ్యవసాయానికి అత్యవసరమయిన నాణ్యమైన పశుగణం లభించాలంటే artificial insemination centres ఆంధ్రరాష్ట్రము లో ఎక్కువగా స్థాపించాలని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను మనుష్యులకు వచ్చే రోగాలలోకూడ రోజులు మారాయి అలాగే పశువులకు వచ్చే రోగాలలోకూడ వివిధంగామారాయి పశువులకు యిదివరకు లేనటువంటి రోగాలుకూడ ఉత్పత్తి అవుతున్నాయి అందుచేత పశుగణాభివృద్ధికోసం యెక్కువ గ్రామాలలో Veterinary Hospitals స్థాపించవలసిన ఆవశ్యకతను గమనించవలసియున్నది దీనిని రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చవలసిన అవసరం ఎంతో వున్నది తరువాత తమరు యిచ్చినటువంటి హెచ్చరికను దృష్టిలోపెట్టుకుని యితరులు చెప్పిన

విషయాలను చెప్పటయే గాక పేదకుటుంబాలకు ప్రత్యేకంగా హరిజనులకు కూడు, గుడ్డ యిల్లు, యీ మూడు చౌకగా లభించేటట్లు గ్రామాలలో వున్న ప్రజలు సౌభాగ్యవంతంగా చక్కగా నివసించడానికి వసతులు కల్పించాలి ఇప్పుడున్నటువంటి co operative housing scheme వల్ల పెద్దపెద్ద పట్టాలలో గ్రామాలలోని పేదప్రజానీకం యిళ్ళు కట్టుకోకుండా వున్నారు ప్రభుత్వం యిచ్చినటువంటి వసతి యొక్క పూర్తి ప్రయోజనాన్ని పేదప్రజానీకం పొందలేకుండా వున్నారని మనవి చేస్తున్నాను మొన్న Co operative Housing శాఖకుచెందిన మంత్రిగారు చెప్పినట్టు చౌకరకపు యిండ్లు కట్టుకోడానికి వీలుండేటట్టుగా చట్టాన్ని సవరించి కేంద్ర ప్రభుత్వముయొక్క సహాయాన్ని అర్థించి 1000, 2000, 3000 లోపల, యింకా 500 ల మొత్తములోకూడ పేదప్రజలకు ప్రత్యేకంగా హరిజనులకు గృహవసతిని కల్పించే స్కీములను ఏర్పాటు చేయవలసినదని మనవిచేస్తున్నాను మొత్తం ధనాన్ని ఉచితంగానే యిచ్చి నివేశన స్థలమునిచ్చి భూమి లేనివారికి అందులో హరిజనులకు గృహ నిర్మాణము కొరకు ధన సహాయము చేయవలసిన అవసరం ఎంతో వున్నదన్న విషయము ప్రభుత్వ దృష్టికి తీసుకు వస్తున్నాను తరువాత irrigation విషయం తమరు క్రొత్తగా అధ్యక్షస్థానాన్నలంకరించారు మేము క్రొత్తగా వచ్చిన సభ్యులము కాబట్టి మరికొంత నిమిషాలివ్వాలని కోరుతున్నాను Irrigation projects క్రింద నామిత్రుడు మూర్తిరాజుగారు చెప్పినట్లుగా drainage schemesకు యివ్వవలసినంత ప్రాధాన్యతను యివ్వడంలేదు Irrigation projects ఎంతఅవసరమో ముంపు నివారణ పథకాలు, మురుగునీటి సౌకర్యాలు అంత అవసరం మురుగునీటి సౌకర్యము ముంపు నివారణ కలుగ చేయకపోతే పండిన పంటలన్నీ నాశనమవుతున్నాయి రైతు చేసిన కృషి అంతా వృథా అవుతుంది తరువాత flood control schemes లో కృష్ణానదికి సీతానగరం మండ అమరావతి వైకుంఠపురం వరకు కుడివైపున గుంటూరు తాలూకాలోని అనేక గ్రామాలు ప్రతి సంవత్సరం అతిగా కురిసేటటువంటి వర్షాలవల్ల వరదలువచ్చి పంటలు యెంతో నష్టపడుతున్నవి అందుచేత ఈ వైకుంఠపురం, అమరావతి, సీతానగరము మధ్య Flood Control Schemes క్రింద కృష్ణానదికి కుడివైపు కరకట్టను నిర్మించేందుకు Second Five Year Plan లో చేర్పించి సారవంతము అయిన సుమారు ముప్పది గ్రామాలకు చెందిన యీ భూములను వరదనుండి కాపాడి ప్రభుత్వం వచ్చే నికరమైన revenue పోగొట్టుకోకుండా ప్రజలకు సౌకర్యం కలుగ చేయవలసినదని తమ ద్వారా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను ఈ అవకాశం నాకిచ్చినందుకు తమకు కృతజ్ఞత తెలుపుతున్నాను

Sri T JALAYYA — అధ్యక్షా, నాకు కూడా యీ Planning మీద మాట్లాడడానికి సదవకాశము యిచ్చినందుకు వందనాలు అర్పిస్తున్నాను ప్లానింగు మంత్రిగారు తయారుచేసిన యీ పథకము ఎన్ని కాగితాలు త్రిప్పినా నాకు కావలసిన అంశాలు ఎక్కడా కనబడలేదు ఇంగ్లీషులో వుంది కావున కనబడలేదు నాకు ఇంగ్లీషు రాదు నామాదిరి సభ్యులుకూడా వున్నారని నా అభిప్రాయము ఐతే వారికి విషయము తెలియచ్చలేదేమో తెలియచ్చనందుకు నేను విచారిస్తున్నాను మన Planning మంత్రిగారు భారతచరిత్రలో తిమ్మరుసు వగైరా మంత్రులకంటే ఇంకా తెలివైనమంత్రి అని స్పష్టముగా యీ Planning వల్ల కనబడుతున్నది అందుకు వారిని మనము

అభినందించక తప్పదు వారు Planning లో Irrigation కు ఎక్కువగా చూపించారు ఐతే Public Health కు 7 కోట్ల 25 లక్షల రూపాయలు దానిలో చూపించారు Medical కు 8 కోట్ల చిల్లర చూపించారు Public Health అంటే మనుష్యుల ఆరోగ్యము కాపాడవలసినమాట అటువంటిదానికి ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వకుండా Medical కు ఎక్కువ చూపించారంటే రోగము వచ్చిన తర్వాత మందు ఇవ్వడానికి ఎక్కువ డబ్బు చూపించుతున్నారు కాని రోగము రాకుండా చేసే సదుపాయానికి మంత్రిగారు ఎక్కువగా గమనించలేదని నా ఉద్దేశము కనుక Public Health కు కావలసిన డబ్బును ఇంకా ఎక్కువగా కేటాయించి మనుష్యులకు రోగాలు రాకుండా చేసే సదుపాయాలు చేస్తారని నా ఉద్దేశము అదిన్నీ కాకుండా యాత్రాస్థలములు ఆంధ్రలో ఎక్కడలేవని నా ఉద్దేశము మద్రాసు రాష్ట్రములో చూస్తే ఎన్నో ఉన్నాయి Kodaikanal వున్నది ఇంకా చాలావున్నాయి మనకేవి లేవు మనము చేసుకోదలచుకుంటే ఎన్నో వున్నాయి విశ్రాంతే కాదు యాత్రాస్థలములలో కాశీతో సమానమైనటువంటి శ్రీశైలమున్నది ఒక యాత్రికుడు శ్రీశైలము వచ్చాడంటే ఒక వందరూపాయలు ఖర్చుపెట్టుతాడు నూరు కానులు మనకు Sales Tax వస్తుంది వినుమానము వస్తుంది రోడ్డు పూర్తి ఔతుంది ఇంకా ఎన్నో వున్నాయి చేయవలసి వున్నవి కొన్ని వుంది ఎంతో జనము పోతున్నాము ఎందుకని - ఒక అందమైన పట్టణముగా తయారుచేశారు గనుక మనము ఆ విధంగా తయారుచేయడానికి ఎక్కడా Planning లో కనబడలేదు 85 మునిసిపాలిటీలు వున్నవి ఏ మునిసిపాలిటీనైనా తీసుకోండి ఒక అందమైన పట్టణముగా తయారుచేయండి అయిదవ పట్టణముగా తయారుచేయండి ఆంధ్రదేశములో ఒక పట్టణము అయిదవదిగా వుంది, దానిని చూచి మనము సంతోషించాలనే అభిప్రాయము కలిగేటట్లుగా Planning మంత్రిగారు చేస్తారని నేను ఆశిస్తున్నాను కనుక Planning మంత్రిగారు యాత్రాస్థలముగాని వేరొక్క అందమైన పట్టణముగాని తయారుచేస్తారని ఆశిస్తున్నాను నేను చెప్పితే అతిశయోక్తి అంటారేమో మా గుంటూరుపట్టణము తగినదని కూడా నేను చెప్పక తప్పదు మా గుంటూరు పట్టణానికి High Court వచ్చింది Water Scheme వచ్చింది Drainage Scheme లేదు Drainage యిచ్చినట్లయితే 5-వ పట్టణముగా తయారు చేస్తామని మేమే హామి యిస్తున్నాము మేము హామీ యిచ్చినప్పుడు కూడా వీరు దానిని తీసుకోకపోతే అది ఆశ్చర్యకరంగా వుంటుందని నా ఉద్దేశము యిక పంట వృద్ధికి కావలసిన సదుపాయాలు చేశారు అయితే దాని వ్యాపార వృద్ధికి కూడా తగినైన సదుపాయము చేయకపోతే పండినపంటను కొనేవాళ్లు లేకుండ పోవలసివస్తుంది నేను నా వ్యక్తి అనుభవములో మూడు కరువులు చూశాను రెండు రూపాయల చొప్పున ధాన్యము అమ్మిన నా చేతులతోనే 25 రూపాయల చొప్పున ధాన్యము అమ్మాను రెండు రూపాయలు అమ్మిననాడు market ఏ స్థితిలోవుంది రైతుగతి ఏమైంది Black market చేసేవారి సంగతి నేను Black market చేయించేవాడుంటేతప్ప చేసేవాడుండడు Black market చేయించడానికి ప్రభుత్వము తలచుకుంటే చేయడానికి కావలసినంతమంది బయలుదేరుతారు కనుక తగిన మార్కెటు పెట్టి ఆ మార్కెట్టులో ఆసరకుల విక్రయము అన్నిచోట్ల చూడవలసియున్నదని నేను మిమ్ములను కోరుతున్నాను భాగ్యవంతుడు తనకు తానే సౌకర్యం చేసుకుంటాడు హరిజను

లకు automatic గా సదుపాయము జరిగిపోతుంది ఇక మధ్యతరగతి వున్నది. ఈ మధ్యతరగతి 100 కి 45 మంది వున్నారు వాండ్లకు ఏమిటి మీ Planning లో వాండ్లకేమి చూపించినారు హరిజనులకు చూపిస్తున్నారు భాగ్యవంతులు, వాండ్లే చేసుకుంటున్నారు మధ్యతరగతిగా వుండే వారికి Planning లో మీరేమి చూపించినారని అడుగుతున్నాను కనుక మధ్యతరగతి వారికి ఏనాడైతే Planning లో సదుపాయాలు కలుగజేస్తారో ఆనాడు ప్రభుత్వము గట్టిగా సాగుతుంది దేశము బాగుపడగలదని నా ఉద్దేశము ఇంకా కొన్ని industries వృద్ధిచేయాలని నా అభిప్రాయము Cottage Industries వృద్ధిచేయాలంటే కాగితాలమీద చూపించినంత మాత్రముచేత వృద్ధి కావని నాకు తెలుసు, మంత్రిగారికి తెలుసు Cottage industries ఎక్కువగా ఉత్పత్తి అయ్యే దేశానికి మనదేశమునుండి విద్యార్థులను పంపించి training యిచ్చి తీసుకొచ్చి పెట్టినట్లయితే cottage industries వృద్ధికావడానికి అవకాశముందని నా ఉద్దేశము Cottage industries అంటే నా అనుభవములో పెద్ద industries పెడితేకాని cottage industries వృద్ధికిరావు ఒక్క బట్టలమిల్లు పెట్టితే Cottage industries వృద్ధికావు బట్టలమిల్లును తయారుచేసే Factory ని పెట్టితే కాని cottage industries వృద్ధిపొందాయి తప్ప బట్టల మిల్లు పెట్టినంత మాత్రాన cottage industries ఎన్నటికీ వృద్ధికావు Motor తయారుచేసే Factory ని పెట్టితే కాని మిగత చిన్న సామాను చేసే cottage industries వృద్ధి కావు క్రొత్తక్రొత్త industries పెట్టేకానికంటే ఇదివరకు పాడుపడివున్న ప్రాత industries ను వృద్ధిచేసి తగిన సదుపాయము చేసిన పేరు వస్తుందని నా ఉద్దేశము మంత్రిగారిని నేను కోరేది ఏమిటంటే compulsory గా విద్యావిధానము చేసిన నాడే దేశము బాగుపడుతుంది Compulsory free education యిచ్చిననాడు కాని దేశము బాగుపడదు మద్రాసుగా వున్న మలబారు దేశము నిన్ననో మొన్ననో ఇంగ్లీ కొచ్చి మనకంటే ముందుకుపోయి 100 కి 70 మందిని తయారుచేసుకున్నది కనుక Planning మంత్రిగారు compulsory education కు దానితో కావు యిస్తూ cottage industries నిమిత్తమై పరదేశాలకు విద్యార్థులను పంపించి విద్యనేర్పించి టెక్నీషియన్స్‌ను తయారుచేసి మనయొక్క State వృద్ధిపరచి బాగుచేయమని కోరుచున్నాను శ్రీ వెంకటరావుగారు యీ యొక్క planning మంత్రిగా వుండడము మన State అదృష్టము ఎంతో మైనా చేయగలరని నమ్మకముంది ప్రజలకు కూడా వారియందు నమ్మకమున్నది కనుక planning మంత్రిగారు ఢిల్లీ పోయినపుడు వారితో మాట్లాడి మా గుంటూరులో సిగరెట్టు Factory ని పెట్టిస్తారని నేను గట్టిగా నమ్ముతూ వారిని అభినందిస్తూ యీ అవకాశమిచ్చినందులకు మీకు వందనాలు అర్పిస్తున్నాను

Sri A YERUKU NAIDU — అధ్యక్షా! ప్రజా జీవిత ప్రమాణం పెంపొందించుటకు ఆంధ్రప్రభుత్వం తరఫున ప్లానింగ్ మంత్రిగారు 241 కోట్ల ఖర్చుతో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రవేశపెట్టినందుకు చాలా అభినందనీయులు ఐతే మొదటి పంచవర్ష ప్రణాళికకూ దీనికీ తేడా ఏమిటంటే మొదటి పంచవర్ష ప్రణాళిక విధానమంచి జిల్లా level వరకూవచ్చి ఎక్కడేవో కొంతమందికి కొన్ని area లలో సదుపాయాలు జరిగియున్నవి రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రతి గ్రామం దగ్గరనుంచీ కూడా plans తయారుచేసి తాలూకా level, district level నుంచి రాష్ట్ర level వరకూ

వచ్చింది అందుచేత ప్రతిగ్రామంలో కూడా సంచలనం కలిగిస్తుంది ప్రభుత్వం ఇచ్చే అసలులో పెడుతుంది నివాళ్ళు ఎంతో కుతూహలంగా ఎదురుచూస్తున్నారు ఐతే ఈ గ్రామ ప్రణాళికలు అమలు చేయుటకు డబ్బు ఇవ్వవలసిన ప్రశ్న వచ్చే టప్పటికి ప్రజల దగ్గరనుంచి ఎంత సహకారం వస్తుందో ఆలోచించవలసి నియము ప్రజలు డబ్బుఇవ్వమనే టప్పటికి ఇంతకుముందు జిల్లాలవారీగా చూచినట్లైతే ఈ local development స్కీము క్రింద కొంతవరకూ జరిగి ఎంత వరకూ ఆగి పోయిందో మనకు చాలావరకూ బోధపడుతుంది ఇల్లాగనే చాలాచోట్ల ఉత్సాహం కొద్ది schools start చేసికూడా ఆ సగ్య డబ్బు కట్టలేనని అనేకచోట్ల schools stop చేశారు కాబట్టి ప్రభుత్వం ఈ విషయమై ప్రజలనుండి డబ్బు రాబట్టుటకు ఏదో మార్గము యోచిస్తే గాని ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదం కాదేమోనని నాకు చాలా అనుమానంగా యున్నది తరవాత సిబ్బందిలో మార్పు రావాలి ఇప్పుడు పంచవర్ష ప్రణాళిక క్రింద అనేక estimates వేయుస్తున్నారు కాని ప్రజల దగ్గరకు వెళ్ళి సరికి అక్కడ staff చాలకనో వారు సహకారము చేయలేకనో అవన్నీ మార్చే కారు కాబట్టి సిబ్బందిలో పరిపూర్తియైన ఒక reform వస్తేగాని ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా అమలు జరగదని నా అభిప్రాయం తరువాత ముఖ్యంగా ఇప్పుడు వచ్చే వాటిలో ప్రభుత్వం ఒకటే విషయం గుర్తించవలసినదని కోరు తున్నాను అది ఏదంటే ఈ రాష్ట్రం రెండు భాగాలుగా ఈ development planకు సంబంధించి చూడాలని కోరుతున్నాను ఒకటి rich zones రెండవది poor zones అంటే బీద ప్రదేశాలు, ధనముగల ప్రదేశాలు అల్లా చేసినట్లైతే డబ్బున్న ప్రదేశాలలో ప్రజల సహకారం వచ్చియుంటుంది కాని బీద ప్రదేశాలలో ప్రజలు సహకారం చేయలేని కారణంచేత వారికి ఎట్టిపనులు పోయినా జరగకపోవచ్చును అవసరమైతే ఒక economistని అనగా ఒక ఆర్థిక వేత్తను ప్రభుత్వం నియమించి ఈ 245 కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నారు కాబట్టి అటువంటి బీద ప్రజలకు ఒక concession వచ్చే రూపంగా విభాగం చేసి ఈ ద్వితీయ ప్రణాళిక అమలు చేయవలసిందని నేను ప్రభుత్వానికి సూచిస్తూ విరమిస్తున్నాను

Sri S RANGANATHA MUDALIAR — Mr Speaker Sir, I am not in a position to find fault with the planning as submitted to the House by the Hon Minister for Planning and Industries The question now is how far the planning has satisfied the demand for a socialistic pattern of society That is the point for consideration just now The Avadi Congress has adumbrated a socialistic pattern of society It is that society that was called by Gandhiji by the name 'Rama Rajyam' What is that society ? The phrase 'socialistic pattern of society' is in everybody's mouth But what is that society ? I wish to know the specific and definite answer According to me, it is a society where there shall be no rich men because there will be no poor men, where there shall be no learned because there will be no unlearned, where there shall be

3rd August 1955] (Sri S Ranganadha Mudaliar)

no need for protection of private property for there will be no thieves What I mean to say is that in such a society the artificial distinctions that now obtain between the rich and the poor, between the educated and the uneducated between high and low, all these distinctions must go And the first step in this direction is to raise the standard of living of the common man by increasing the productive potentialities of every citizen, male or female, young or old Such society is the primary objective of planning The draft plan prepared by the Government, I should think, embodies in itself such an objective at all levels, from the village to State level and from the individual to community level There is no point in trying to find fault with the draft plan as submitted by the Government at this stage The Hon Minister has said that these proposals will be submitted to the Government of India and necessary modifications will be got and enough time will be granted to us for discussing the same That will be time for us to request the Hon Minister to put this thing to give up that thing or to give preference to some other thing So far as the planning as submitted by the Government is concerned, I see a ring of sincerity vibrating through the whole plan But we must not forget one thing in this connection we have not got crores in cash, we are going with bent knees to the Government of India for a loan and the other part of it has to be contributed by ourselves and the Hon Minister wanted us to know, at the time when the next session meets, how much each of us from our own constituency has got to give him in the shape of contribution either in cash or labour That is the most important thing We must remember that we must be prepared to contribute half to the plan, either in cash or labour There is no use asking "I want this or I want more " If we are prepared to contribute half to the plan in the shape of cash or labour there is no question of asking the Government to do this or to do that It behoves us to help the Government in all their efforts to make the plan a signal success In this connection, I congratulate the Hon Minister for the bold way with which he has come forward with certain definite and conclusive proposals, so far as they go at present And at this stage to try to pick holes in it and waste our time by dilating on the details is to be guilty of gross disservice to this young State Thank you, Sir

Sri P GUNNAYYA — అధ్యక్షా! గౌరవనీయులైన ప్లానింగుమంత్రిగారు ఆంధ్రదేశములో రాబోవు అయిదుసంవత్సరాలలో 244 కోట్ల రూపాయలు ఖర్చు చేయటానికి ప్లాను తయారుచేసినందులకు వారిని నేను తద్వారా అభినందిస్తున్నాను. ఈ 244 కోట్లలోనుంచి village planning development క్రింద 11 కోట్ల రూపాయలు ఆంధ్రదేశములో ఖర్చుచేయటానికి వారు ఒక పథకము తయారుచేశారు. ఈ సొమ్ము యీ village development క్రింద సక్రమంగా ఖర్చుచేస్తారని నేను ఆశిస్తున్నాను. ఈ విషయములో నా సలహా యేమిటంటే, గ్రామాలలో ఒక్కొక్క యింటిక్రింద ఒక వెయ్యిరూపాయలు చొప్పున యీ 11 కోట్లతో ఒక లక్ష పదివేల యిళ్ళు తయారుకావటానికి సాధ్యమవుతుంది. కాబట్టి యిదేమాదిరిగా యీ డబ్బు ఖర్చు చేస్తే, ప్రతిజిల్లాలోనూ పదివేలయిళ్ళదాకా తయారుచేయించవచ్చును. ప్రతిగ్రామం లోను ఒక్కొక్క గ్రామానికి యాభై యిళ్ళచొప్పున కట్టించినట్లయితే తప్పకుండా గాంధీగారు కలలుకన్నటువంటి స్వరాజ్యాన్ని, సహాయనాయకత్వాన ప్లానింగుమంత్రిగారు ఆంధ్రప్రభుత్వాన్ని ఎలపరుస్తారని నేను ఆశిస్తున్నాను.

అదియునుగాక ప్రతిగ్రామములోను కొత్తయిళ్ళుకట్టించి, దానితోడు విద్యుచ్ఛక్తి విద్య, వైద్య, ఆరోగ్య సౌకర్యాలు కలుగజేసి, ప్రతి గ్రామానికి ఒక డాక్టరును నియమించి ఈవిధంగా అభివృద్ధి కార్యక్రమాన్ని సాగించినట్లయితే అయిదుసంవత్సరాలలో ప్రజలు అన్నివిధాల ముందంజవేసి వృద్ధికిరాగలరని మనవిచేస్తూ ఆవిధంగా చేయవలెనని ప్రభుత్వమును కోరుతున్నాను.

అంతేగాక హరిజనులగురించి వెనుకబడినవారిని గురించి నాలుగుకోట్లరూపాయలు మాత్రమే ఇచ్చారు ఈ అయిదుసంవత్సరాలకు. కాని మనప్రక్కనే వున్నటువంటి హైదరాబాదు తొమ్మిదికోట్ల రూపాయలవరకు ఖర్చుచేయడానికి నిశ్చయించిందని మొన్న పత్రికలో చూశాను. అందుచేత గాంధీగారు కలలుగన్నరీతిగా ఈ హరిజనాభివృద్ధి అయిదేళ్ళలో కలగజేయాలంటే తప్పనిసరిగా ఈ నాలుగుకోట్లు రూపాయలు కాకుండా ఇంకా కొన్నికోట్లురూపాయలు అదనంగా ఖర్చుపెట్టి వారికి అన్నివిధములైన సౌకర్యములను కలుగజేయవలెనని కోరుచున్నాను. వారికి ఇళ్ళవసతి కలుగజేసేవిషయములో ఒక యింటికి వెయ్యిరూపాయలకు తక్కువలేకుండా ఖర్చుపెట్టి ఆవిధంగా ప్రతిగ్రామానికి కనీసం పదిఇళ్ళయినా కట్టించవలసినదిగా కోరుచున్నాను.

తరువాత Irrigation విషయములో 64కోట్లు రూపాయలతో పథకాలు తయారుచేశారు. కాని ఈ planలో minor irrigation పనులు, చెరువు పనులు, చిన్న చిన్న కట్టలు మొదలగుపనులు చాలమట్టుకు లేవు. కనుక ఈ అయిదు సంవత్సరాలలో minor irrigation పనులకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి ప్రతి తాలూకాలోను, చెరువులు చిన్న చిన్న వాగులు కట్టడానికికృషి చేయవలెనని మనవిచేస్తున్నాను.

ఇక రోడ్లకుగాను 13 కోట్ల, 43 లక్షలు మాత్రము ఇచ్చారు. ప్రతి రోడ్డు బాగుచేయాలంటె చాలా కష్టంగా ఉంటుంది. అయినా మా పాతపట్నంలో ది రోడ్లయినా ఉంటాయి. ఇవన్నీ పర్లాకిమిడి మహారాజాగారు కొన్ని లక్షలు ఖర్చుచేసి చేయించారు. ఇప్పుడు ఈరోడ్లన్నీ మరమ్మతు చేయాలంటే కనీసం 10 లక్షల రూపాయలైనా కావాలి. కనుక, వాటికి సిమెంటుగాని, తారుగాని వేయకపోయినా, మెటల్ అయినా వేసి ప్రభుత్వమువారు మరమ్మతుచేయిస్తారని ఆశిస్తున్నాను.

ఈ Plan కు కేటాయించిన 244 కోట్ల రూపాయలను సక్రమంగా ఖర్చుపెట్ట గలరని, అందులో వెనుకబడిన జిల్లాలకు ఎక్కువ ఖర్చుపెట్టి, ప్రాజెక్టులు లేనటువంటి ప్రాంతాలకు minor irrigation పనులకు ప్రాముఖ్యతనిచ్చి ఆయా పనులు చేయిస్తారని ఆశిస్తున్నాను ముఖ్యంగా agriculture కు చాలా డబ్బు ఇచ్చారు ఇప్పుడు రైతుకు సంబంధించినంతవరకు వారికి ఈ కాంగ్రెస్ ప్రభుత్వములో ఇచ్చినటువంటి నివాసస్థలాల్లో ఇళ్లు కట్టుకోలేక చాలా ఇబ్బందులకు గురి అవుతున్నారు చాలా గ్రామాలలో స్థలాలుకూడ లేవు కాబట్టి ప్రతి గ్రామములోను కనీసం 2, 3 ఎకరాలైన స్థలం తీసుకొని ఆవిధంగా వారికి ఇళ్ళస్థలాలు చూపించి, ఇళ్ళు కట్టుకొనేదానికి కూడ సగము డబ్బు ప్రభుత్వము ఇచ్చి ఇళ్ళు కట్టించే ఏర్పాటు చేయవలెనని కోరుచున్నాను ఆవిధంగా చేసినట్లయితే గ్రామములలోని ప్రజలు తప్పకుండా ప్రభుత్వాన్ని అభినందిస్తారని అనుకొంటున్నాను తరువాత ప్రతి తాలూకాలోను ప్రతి గ్రామములోను పశువులకు వైద్యసహాయం కూడ కలుగజేసేందుకు ఎక్కువ కృషి చేయవలెనని వినయపూర్వకంగా మంత్రిగారిని కోరుతున్నాను

ముఖ్యంగా ఈ 244 కోట్ల రూపాయలను ప్రభుత్వంవారు సక్రమంగా ఖర్చుపెట్టడానికి కృషి చేస్తూ ప్రజలకు సరియైన సౌకర్యాలు కలుగజేస్తారని అత్యంత వినయపూర్వకంగా మనవిచేస్తూ అధ్యక్షులవారు నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు నా వందనములు సమర్పిస్తున్నాను

Sri P RAJAGOPALA NAIDU —అధ్యక్షా! Planning మంత్రిగారు ఈ ప్రణాళికను సక్రమంగా తయారు చేసినందుకు వారిని నేను అభినందిస్తున్నాను అయితే ఈ సందర్భములో వారు ఒక విషయాన్ని గుర్తించాలని కోరుతున్నాను మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో అభివృద్ధి చాలా జరిగినా ఆదాయము చాలా తగ్గిపోయింది అందువల్లనే వ్యవసాయపు వస్తువుల ధరలు పడిపోయినాయి కనుక ఉత్పత్తి హెచ్చినా ఆదాయము తగ్గకుండా ఉండేటట్లు చూడాలి ఈ విషయమై Planning మంత్రిగారు ప్రణాళికలో ఒక విధానాన్ని రచించి ఉన్నారు వ్యవసాయ వస్తువుల ధరలు పడిపోకుండా చూడడానికి ప్రయత్నం చేస్తారనేది చాల సంతోషకరమైన విషయము కాని దానికోసం ఏ యే మార్గాలు అనుసరించబోతున్నారో వాటిని ఇందులో సూచించలేదు ఈ విషయములో ప్రభుత్వం కూడ ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి ఎన్నికల సందర్భములో United Congress party Agricultural Finance Corporation ను పెడతామని చెప్పింది Industrial Finance Corporation ఏవిధంగా పెట్టారో ఆవిధంగానే Agricultural Finance Corporation కూడ పెట్టాలి లేకపోతే వ్యవసాయ వస్తువుల ధరలు నిలకడగా ఉండడానికి స్థిరీకరణ చేయడానికి వీలుకాదు Market ను regulate చేసేందుకు రైతాంగానికి కావలసినప్పుడు అప్పులు ఇవ్వడానికి వీలుకాదు అందువలన Agricultural Finance Corporation పెట్టడానికి ప్రయత్నం చేయాలి దానికొరకు డబ్బు కేటాయించాలి కాని ఆ విషయము ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో లేకపోవడం చాలా విచారకరంగా ఉన్నది కాబట్టి Agricultural Finance Corporation పెట్టడానికి ప్రయత్నం చేయాలి అని నేను కోరుచున్నాను తరువాత Industries విషయంలో private sector అన్నది అన్నారు వ్యక్తులను ప్రోత్సహిస్తున్నారో అలాగే ప్రభుత్వము కూడ

కొన్ని పరిశ్రమలను మాత్రం నడుపుతూ ఉన్నది కాని co operative sector ను విరివిగా అభివృద్ధిపరచాలని నేను కోరుచున్నాను ఈ ప్రణాళికలో కూడ co operative sector ను అభివృద్ధి చేయాలనే ప్రయత్నం ఉన్నది కాని అయినా ఎంత వరకు కూడ తగినంత అభివృద్ధి కల్పించరు ఈనాడు ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్నటువంటి చోట్లను ఈ సహకార పద్ధతులమీద పరిశ్రమలను నడిపించడంవల్ల చాలావరకు తగ్గించుకోగలము కనుక ఈ సహకార పద్ధతులమీద పరిశ్రమలను నడపడానికి ఎక్కువగా ప్రభుత్వము పూనుకోవలసియున్నది ఈనాటి విధానాన్ని అనుసరించి ఎక్కడైతే ప్రజలు తమంతట తామే సహకారసంఘాలను ఏర్పరచుకొంటారని ప్రభుత్వమునకు విన్నవిస్తారో అప్పుడుమాత్రము ఈ co operative సొసైటీలు పెట్టడంగాని లేదా co operative పద్ధతిమీద పరిశ్రమలు నడపడంగాని జరుగుతూ ఉన్నది ఇంతమాత్రం చాలదు ప్రభుత్వం ఇంకా ఎక్కువగా ఈవిషయంలో శ్రద్ధ తీసుకోవాలి అంతేకాకుండా Labour Co operative Societies ను కూడా ఏర్పాటుచేసి అధికంగా ఈ నిర్మాణ కార్యక్రమాన్ని సాగించగలిగితే చాలావరకు ఖర్చు తగ్గిపోడానికి వీలుంటుంది అలాగే పరిశ్రమల విషయంలోను co operative sector ను అభివృద్ధి చేయాలని నేను Planning మంత్రిగారిని కోరుతూ ఉన్నాను అంతేకాకుండా ఈ గ్రామీణ గృహనిర్మాణవిషయమై ఇంతకుముందే చెప్పాను దీనికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలని నేను కోరుతున్నాను ఇప్పుడు ఉన్న పద్ధతి చాలా ఖర్చుతో కూడుకొన్నదని ఇంతకుముందు నా మిత్రులుకూడ చెప్పారు వేలకొలది ఖర్చుపెట్టి ఏవో కొన్ని ఇళ్ళు మాత్రం పట్టణాలలో కట్టడానికంటె గ్రామాలలోను, పట్టణాలలోను పేదవాళ్ళకు అనుకూలమైన పద్ధతిలో చౌకరకమైన ఇళ్ళు తక్కువ ఖర్చుతో ఎక్కువ కట్టడానికి ప్రయత్నిస్తేనే ప్రజలను సంతృప్తిపెట్టడానికి వీలవుతుంది కాబట్టి ఇంతకుముందు మన మిత్రులు చెప్పినట్లు రెండు వందలను కాని వెయ్యిరూపాయలకు లోపుగా ఉండే ఇళ్ళకు ఎక్కువ ప్రోత్సాహం ఇవ్వాలని నేను కోరుతున్నాను

తరువాత వెనుకబడిన కులాలవారికి, హరిజనులకు scholarships ఏవో ఇస్తున్నారు అది అభినందించదగినదే వాటిని ఇంకా కొంచెము హెచ్చించితే మంచిదనుకొంటాను అయినా ఒక విషయం మాత్రం మరచిపోతున్నారు చాలామంది అభివృద్ధి చెందిన కులాలు అనే పేరుతో చాలావరకు వెనుకకు నెట్టివేయబడుతున్నారు అందులో ఉన్నటువంటివారి విషయమై నేను మాట్లాడను గాని పేదవారు చాలామంది ఉన్నారు ఈనాడు Constitution లో గాని ఇతరత్రా గాని మనం ఈ కులాలు ఉండకూడదు, ఇవి పోవాలని చెప్పుకొంటూ ఉంటాము కాని, అభివృద్ధి చెందిన కులాలవారిలోనే ఆర్థికంగా దౌర్బల్యంగా ఉన్నటువంటివారికి కూడ ప్రత్యేకంగా సౌకర్యాలు కలిగించవలసియుంటుంది వెనుకబడిన కులాలవారికిని, హరిజనులకు ఎక్కువ మొత్తాలను హెచ్చించినా ముందు ఉన్న కులాలలో కూడ పేదవారికి scholarships ఇచ్చి వారు కూడ అభివృద్ధి చెందడానికి అవకాశం కల్పించవలసిందని కోరుతూ విరమిస్తున్నాను

Sri E NAGAYYA — అధ్యక్షా ! ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తయారు చేసేముందు గౌరవనీయులైన ప్లానింగుమంత్రిగారు సభ్యులు ఎవరితోనైనా సంప్రదించి ఆ ప్లాను తయారుచేసినట్లయితే యిప్పుడు మన సోదరసభ్యులు వ్యాఖ్యానము చేయటానికి అవకాశములేకుండా వుండేది 244 కోట్లరూపాయల ఖర్చుతో తయారుచేసిన

3rd August 1955] (Sri E Nagayya)

యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పెద్దభాగము irrigations, minor ports Municipalities లోను ఎక్కువగా ఖర్చు కనబడుతున్నది పేదప్రజలు నివసించే పల్లెప్రాంతాలలో చేయవలసినపనులు ఎన్నో వున్నవి ప్రతి గ్రామములోను irrigation సౌకర్యాలు లేనందువల్ల వారికి పంటపోయి చాలా బాధపడుచున్నారు ఇలాంటి పరిస్థితులలో ఎక్కువసొమ్ము యీ Municipalities వున్న పెద్దపట్టణములలో ఖర్చుచేయడముకన్న, కొంతమట్టుకు irrigation సౌకర్యాలు, రైతులకు కావలసిన పనులు అన్నీ చేయాలని అంటున్నాను

రెండవది మన రాష్ట్రములో ఏగ్రామానికిఅయినా బయలుదేరి వెళ్ళవలెనంటే రోడ్లు ఎక్కడనూ కనపడవు ఎక్కడైనా వున్నట్లయితే అవి 4వతరగతికిచెందిన రోడ్లు అవికూడా రోడ్లు అని చెప్పుకోటానికి వీలుకానిపరిస్థితిలోవున్నవి కొన్నిచోట్ల రోడ్లే కనబడవు అవి ఎన్నో సంవత్సరాలక్రింద బ్రిటిషువారి హయాములోవుండగా జిల్లా బోర్డు వేసినరోడ్లు కొన్నిచోట్ల రోడ్లుఅని గుర్తు కనబడడమేగాని, అది రోడ్డుగా కనపడేటట్టు కనపడదు కాబట్టి ప్రతిగ్రామానికి పోవటానికి ముందు రోడ్లు అవసరము గనుక మంత్రిగారు ముందు యీ రోడ్లవిషయము తీసుకోవలసిందిగా కోరుతున్నాను

తరువాత విద్యావిషయము వున్నది గ్రామాలలో education facilities బొత్తిగాలేవు ప్రతి 500 జనాభాగల గ్రామాలలోనూ ఒక elementary school నిర్మించాలి 500 జనాభాకు తక్కువ కాకుండా వున్న గ్రామాలలో ఒక చిన్న medical institution అంటే ఒక డాక్టరు dispensary ద్వారా పెద్ద అట్టహాసము వుండనక్కరలేదు సాధారణముగా వైద్యములో ప్యాసుఅయిన డాక్టరును ప్రసూతి ఆడవాళ్ళకు ఉపయోగముగా వుండునట్లు సర్వీసు midwifery ద్వారా ప్యాసుఅయిన డాక్టరును ఒకరిని appoint చేసి ఒక చిన్న హాస్పిటల్ గా ఒక welfare center ను ఏర్పాటుచేస్తే సమయములనుబట్టి గ్రామాలలో ఉపయోగకరముగా నుండును. దగ్గరగా హాస్పిటల్ సౌకర్యములేని గ్రామాలు అనేకము ఉన్నవి Emergency కి వారు ఉపయోగపడేటట్లుగా medical సౌకర్యాలు అందినవారు అవుతారు మంత్రిగారు యీ విషయము గుర్తుంచుకొని గ్రామాలలో యీ వైద్య సౌకర్యాలను ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను

తరువాత Fisheries Department వున్నది Fishermen విషయము చాలామంది సభ్యులు మాట్లాడారు సభ్యులు అందరు సముద్రమునకు దగ్గరగా వుండే ప్రాంతాల విషయము చెప్పారేగాని, సముద్రానికి దూరప్రదేశాలను గూర్చి ఎవరూ చెప్పలేదు Fishing area లో మాత్రమే కొంతమట్టుకు fish supply చేయడము జరుగు చున్నదేగాని దేశవ్యాప్తంగా దూరప్రాంతాలకు పంపటానికి fishermen కు సౌకర్యాలులేవు Fishermen కు సౌకర్యాలు కలిగించి, వారి పరిశ్రమ కనుగుణంగా తెచ్చిన చేపలను అమ్ముడు పోయేటట్లుగా ప్రభుత్వము చూడాలి ఇంతేకాకుండా వారికి convenient ప్రదేశాలలో మార్కెటింగు facilities ప్రభుత్వము ఏర్పాటు చేస్తే యీ పరిశ్రమను ఎక్కువగా అభివృద్ధి చేసుకొని విదేశాలకు కూడా పంపేటట్లు చేసికొని వ్యాపార పరిస్థితులు ఏర్పాటు చేసుకోటానికి వీలగును ఇంతవరకు వారు యీ పరిశ్రమలో నష్టపడుచున్నారు విశాఖపట్టము రేవులో కొద్దిగా fishing జరుగు చున్నది అక్కడ జరిగిన fishing ను బట్టి అవి అమ్ముడు పోనందువల్ల నష్టపడడము

లాగుచున్నది ఆ విధంగా కొండా వారికి మార్కెటింగు సౌకర్యాలు ప్రభుత్వము యేర్పాట్లు చేస్తే విదేశాలకు గూడా యేరోప్లేనులలో పంపుకోటానికి గూడా ప్రభుత్వము యేర్పాటు చేస్తే fishermen యీ పరిశ్రమను అభివృద్ధికి తెచ్చుకోగలరు. ఈ విధంగా చేస్తే కడు పేదవారైన fishermen జాతివారందరు గూడా బ్రతికేటానికి అవకాశాలను ప్రభుత్వము కలిగించాల్సివుంది

తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సందర్భములో ప్రజలవద్దనుంచి సేకరించే contribution 50% నుంచి 25% కు తగ్గిస్తే పనులు అన్నీ కూడా అవుతాయని నాకు నమ్మకము వున్నది పంచవర్ష ప్రణాళికలో పనులు అన్నీ కూడా అయ్యేటట్లుగా కనబడటంలేదు మనము యీ ప్రణాళికలోని అంశములు అయ్యేటట్లుగా కనబడవేమోగాని, నిజానికి కొన్ని లెఖలువేసిచూస్తే ఖర్చు మూడువంతులు పనులు చూస్తే నాలుగు వంతులు కనబడుతున్నవి కాబట్టి మంత్రిగారు రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోని పనులు జాగ్రత్తగా పరిశీలించి క్రమపద్ధతిని చేయిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను

Sri P RAMACHARLU — అధ్యక్షా, ఇంత త్వరలో ఇన్ని వివరములతో ఈ ప్రణాళికను తయారుచేసిన మంత్రి శ్రీ కళా వెంకటరావుగారి నభినందించుచున్నాను ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కోట్లకొలది ధనము వినియోగించి లక్షలకొలది ఎకరములకు నీరిచ్చుటకును, వేలకొలది కిలోవాటుల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయుటకును ఏర్పాట్లు కలవు కాని ప్రజలు చేయుచున్న వృధా కాలహరణమును అరికట్టి కాల ప్రవాహమునకు అడ్డులు వేసి ప్రజలను కార్యోన్ముఖులను చేయు కార్యక్రమము కనబడదు ఆంధ్రదేశమున రెండున్నర కోట్ల ప్రజలున్నారు అందులో బాలురు, వృద్ధులు, వికలాంగులు పోను కనీసము ఒక కోటిమంది పని చేయజాలిన జనులున్నారు కాని ఈ కోటిమందిలో ఏ కొన్ని లక్షలమంది మాత్రమే పనిచేసెదరు వారికైనను సంవత్సరము పొడవునా దినమంతయు పని ఉండదు వ్యవసాయదారులకు సంవత్సరములో కనీసము ఐదుమాసములైనను పనియుండదు పని ఉన్న రోజులలో నైనను దినమంతయు పనిగల రోజులు ఏమున్నవి నలుగదింటె హెచ్చుగా నుండవు ఈ విధముగా జనులు ఏ పని లేక ఉండు దినములు గంటలు చాలగ నున్నవి ఒక కోటి మంది జనులు నిత్యమును ఒక గంట పనిచేసినయెడల రోజునకు పదిగంటలే పనిచేయు కాలమని లెక్కించినను 2611 సంవత్సరముల పనిచేయు కాల మేర్పడును ఇంత కాలము వృధా అగుచున్నది కాలమే ధనమను పాశ్చాత్యుల నీతిని మనము గ్రహించుట లేదు ఏ అమెరికావారు గాని ఇంగ్లీషువారు గానీ మన వలె వృధా కాలహరణము చేయరు అందుచేత ఆంధ్రులు సోమరితనమునకు పేరువహించినారు రాయల సీమలోని వారికి పని లేకను సర్కారుజిల్లా వారికి తప్పక పనిచేయవలసిన అవసరము లేకను వృధా కాలహరణము చేయుట తటస్థించుచున్నది గోహత్యను పాపమను చున్నాము నరహత్యను నేరమనుచున్నాము కాని కాలహత్యను దోషమని మనము భావించుటలేదు ఇంతమంది ఈ కాలమును వినియోగించుటకు ప్రణాళికలో ఏమియు ఏర్పాటు కనబడదు

మనలో చదువుకొన్నవారున్నారు పెన్షన్ పుచ్చుకొని ఏమి చేయుటకును తోచనివారున్నారు పండితులున్నారు స్త్రీలు మెడికల్ కాలేజీలో చదువుకొని

ప్యాసయి వివాహము చేసికొన్నతర్వాత తమ వైద్యవిద్యను ఉపయోగించు నవకాశము లేనివారున్నారు అట్టివారు ఐచ్ఛికముగా పనిచేయు ఒక కార్యక్రమమును వారికి చూప కలిగిన యెడల దేశమున కెంతో లాభముగా నుండును ఎవరెవరి మనస్సునకు ఏ పని ఉచితమని తోచునో అట్టిపనినే వారు చేయుటకు అవకాశము కల్పించవలెను ప్రతి గ్రామములోను ఒక పది ఎకరముల భూమిని ప్రత్యేకించి అందులో ఎవ్వరైనను ఒకటి రెండు ఫలవృక్షములను నాటి పెంచుకొని వాని ఫలములను వారే అనుభవించవచ్చునన్న యెడల ఎంతో ఆ పనికి పూనుకొనెదరు విద్యావంతులకు అల్పకాలికశిక్షణ మిచ్చిన యెడల వారు కొంతసేపు బడులలో బాలురకు విద్య నేర్పెదరు కొందరు వైద్యము చేయ వచ్చును మరికొందరు కసరత్ నేర్పవచ్చును ఈ విధముగా ఎవరితో ఏ పని సాధ్యమో వారితో ఆ పని చేయించి ఆ సోమరికాలమును చక్కగా వినియోగించినయెడల దేశము నకు లాభము కలుగుటే గాక ఊరిలో పనిలేని సోమరులకు శూన్యమునైన కలహములు నిందారోపణలు అర్థములేని రాజకీయ ప్రలాపములు మానిపోవును

మంత్రి శ్రీ కళా వెంకటరావుగారు తాము ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను గ్రామము తాలూకా మూలముగా ప్రజాభిప్రాయము తీసికొని చేసినందున క్రిందినుండి మంచి పునాదులమీద ఇది కట్టబడినదనిరి కాని వాస్తవమునకు ఇది తొందర తొందరగా ఏ కొందరు క్రింది ఉద్యోగులతోనో వేయబడినది అంతేకాక కార్యక్రమములో ముందు వెనుక లాలోచనలేకుండ ఈ ప్రణాళిక వేయబడినది ప్రాజెక్టులు కట్టుచున్నాము రైతులా నీటిని ఉపయోగించలేకున్నారు ఎలెక్ట్రిసిటీ బ్రహ్మాండముగా తయారగు చున్నది కాని దానిని ఉపయోగించగల పరిశ్రమలు ఏర్పాటులేదు స్కూళ్ళ వృద్ధి చేయుటకు ఏర్పాటున్నది అందుకు అవసరమైన ఉపాధ్యాయులను తయారుచేయు పని ఆరంభము కాలేదు వైద్యాలయముల సంఖ్య పెరుగుటకు అంచనా వేసినారు కాని దానితో ఈడుగా వైద్యులను తయారుచేయు ఏర్పాట్లు తక్కువ ఎన్నినో ప్రాజెక్టులు నిర్మాణమునకు ఎస్టిమేట్లు వేసినారు కాని ఇంజనీర్లు సిద్ధముగా లేరు ఇంజనీర్లను తయారుచేయు కాలేజీలు పెంచబడలేదు కావున ఈ వేసికొన్న ప్రణాళికలోని అభి వృద్ధి కార్యములు కొనసాగునో కావో అని సందేహించుచున్నాను పూర్వమున హంపీ విరూపాక్షదేవాలయ గోపురము నొక్కరు చూచి పై శిఖరమునుకట్టి ముగించిన పనివా రెట్లు దిగివచ్చిరని విచారపడెనట ఇంకొక్కరు సమాధానమిచ్చుచు పైనుండియే గోపు రమును కట్టుకొనుచు వచ్చి వచ్చి క్రిందపని పూర్తిచేసి దిగిపోయిరని చెప్పెనట ఆ విధము గనే మనము ఈ ప్రణాళికలను పైనుండి కట్టుకొని వచ్చుచున్నాము కావున ప్రజలు వానిని ఉపయోగించజాలకున్నారు

కార్యారంభములో కూడిన ఉత్సాహము ప్రజలలో నుదయించినగాని బ్రహ్మాండ మైన ఖర్చుతో వేయబడిన ఈ ప్రణాళికలు ఫలవంతములు కావు ప్రక్కన నిలుచుండి చూచువారలు గాక ప్రజలను కార్యోన్ముఖులుగా చేసి రంగములో దింపతగును

ముందు చెప్పినట్లు ఒక కోటిమంది దినమున కొక గంట పనిచేసినయెడల 2611 సంవత్సరముల పని ఒక్కరు నిర్వహించినంత అగును తృతీయ పంచవర్ష ప్రణాళికలో నైనా ప్రభుత్వమువారు ఈ విషయమును గుర్తించి ప్రజలందరికి చేతనింత పని కల్పించి సోమరితనమును పారద్రోలి యెడల దేశము ఎంతయో భాగ్యవంతము నీతివంతము కాగలదు

ఇంకొక్క విషయము చెప్పి ముగింతును రాయలసీమ, సర్కారు అను విభాగము పెట్టుకొనుట ఇప్పుడు భావ్యముకాదను మంత్రిగారి అభిప్రాయముతో నేకీభవించుచున్నాను ఇది అంతయు ఒక్కటే శరీరమని భావించవలెను కాని శరీరములో ఏ భాగమునకు నొప్పి కలిగినను ఆ శరీరం బాధపడవలసి వచ్చినట్లే ఆంధ్రదేశములో ఏ భాగము అభివృద్ధి కానక దారిద్ర్యముచే క్రుంగినను అది ఆంధ్రదేశము మొత్తమునకే ముప్పు అని మంత్రులు గ్రహింపవలెను మా అనంతపురములో వర్షములు చాలవు కనుక మాటిమాటికిని కఱవు కాటకములకు గురికావలసి వచ్చుచున్నది ఎన్ని ప్రాజెక్టులేర్పడినను దానికి జీవనదితో సంబంధముగల ప్రాజెక్టు ఏర్పడితీరవలెను తుంగభద్ర ఎగువ కాల్వ నీరు మా జిల్లాలో పరిమితము చేయవలెనను అభిప్రాయమును మానుకొని మాకు అవసరమును సాధ్యమును ఐనంత నీటి వసతిని కల్పించిన తప్ప మాటిమాటికిని రిలీఫ్ పనులని, కఱవు నివారణపనులని ప్రభుత్వము కోటానుకోట్లు ఖర్చుపెట్టక తప్పదు పరిశ్రమలలో నైనను రాయలసీమకు ఉచితస్థానమియ్యవలెను మా జిల్లాలో పట్టు ఉత్పత్తి పరిశ్రమ సాధ్యమని ఇదివరకే చెప్పియుంటిని వేలు లక్షలు ఖర్చుపెట్టి ఆంధ్రులు ఇతర రాష్ట్రములనుండి దేశదేశములనుండి పట్టును కొనుచున్నారు దానిని ఉత్పత్తి చేసుకొనగల ఏర్పాటునకు మా జిల్లాలో ఎక్కువ అవకాశమున్నది కావున ఆ ప్రయత్నమునైనను ప్రభుత్వము చేయగలదని ఆశించుచున్నాను

ముందు చెప్పిన రీతిగా ప్రతి ఒక్కరికిని పని కల్పించి సోమరితనమును నిర్మూలించిన గాని ఆంధ్రదేశము వృద్ధిపొందజాలదని విన్నవించుకొనుచున్నాను

Sri G YELLAMANDA REDDI — అధ్యక్షా! ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికనుగురించి లెక్కలు అన్ని రాష్ట్రములలో మాదిరిగానే తయారుచేసి ఇచ్చారు అయితే ఈ ప్రణాళికలోవున్న లక్ష్యాలు మొత్తము వున్న జాతీయ ఆదాయాన్ని పెంచాలని నిరుద్యోగ సమస్యను తగ్గించాలని మొదలైన విషయాలు వున్నాయి కాని మొత్తము ౫ ఏళ్లలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలు జరిగిన విధానమును బట్టి కాని లేకపోతే దీంట్లో పొందుపరచినటువంటి విధానములో పునాదులను బట్టి గాని అలాంటిది సక్రమంగా ఎంతవరకు నిర్వహింపగలరో అని అనుమానము సాధారణముగా ప్రతివారికి వేస్తుందని నేను అభిప్రాయ పడుతున్నాను సాధారణముగా ఈ రోజు దేశంలో స్వాతంత్ర్యం వచ్చిందని అనుకొన్న తరువాత జాతీయాభివృద్ధి కావాలని, జాతీయ పునర్నిర్మాణమును చాలా గొప్పగా సాగించాలని చెప్పి అన్ని వర్గాల ప్రజానీకంలో అలాంటి ఉత్సాహం, అలాంటి పట్టుదల వుండడము సహజము దాన్ని సక్రమంగా ప్రభుత్వము వినియోగించుకొని దేశమును ఇలాంటి సందర్భములో ముందుకు తీసుకు పోవడానికి ప్రయత్నము చేయాలి మన ఆంధ్రరాష్ట్రము వంటి రాష్ట్రంలో ముఖ్యముగా పరిష్కారము కావలసినది భూసంస్కరణసమస్య నేను భూసమస్యనుగురించి చెప్పాలని మంత్రిగారు చెప్పారు కాని కేంద్రము అనుసరించిన విధానమును బట్టి మనము ముఖ్యముగా రాష్ట్రములో ఈ రోజు ప్రభుత్వములో భూమి సమస్యల ఎడల దానికి సంబంధించిన అనేక విషయములలో ప్రభుత్వము అవలంబించే విధానమును బట్టిగాని ఈ భూమి సమస్యను పరిష్కారము ఏమాత్రము చేయలేదు అని నేను అభిప్రాయపడుతున్నాను భూమిసంస్కరణలు జయప్రదము కానిదే, దేశము ఏసమస్యలోను జయప్రదము కాదు కేవలము ఈ రోజు కనీసము వ్యవసాయములో అయినా సరే గొప్ప అభివృద్ధి

